# అగ్రహారము

కేతవరపు వేంకటశాస్త్రి
(కవితాసమితి సభ్యుఁడు)



సరస్వతీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము

నిజామురాష్ట్రమందుండు ఆంధ్రసోదరుల సౌకర్యార్థమై దక్షిణ హైద్రాబాదు నెం. 544/566 వ గృహమునందు నాంపల్లి గౌరీశంకరవర అండుకో, ఆంధ్ర బుక్కు డిపో వారిని మా ప్రతినిధులుగా ఏర్పఱచినాము. కావున నిజామురాష్ట్రవాసులు కావలసిన పుస్తకములను వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

కృష్ణామండలమునందుండు మాచందాదారుల సౌకర్యార్థమై బెజవాడలో ఆర్. జి. పాల్ అండుకో వారిని మా ప్రతినిధులుగా యేర్పఱచినాము. కావలసిన పుస్తకములు వారికిని వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ప్రకాశకుడు

౧

"అయం ముహూర్త శ్శుభ ముహూర్తోస్తు" "కన్యాం కనకసంపన్నాం కనకాభరణై ర్యుతాం. తుభ్యం దాస్యామి...అట్టట్టట్టట్ట... ఆగు. ఆగు. సుబ్బావధానీ! నీ సంగతి యేమి? మా మాట లేమయి నను జొరనిచ్చెదవా? వరదక్షిణసిద్ధపఱిచినారో లేదో కన్యాదాత గారి నడుగకుండ, నప్పుడే కన్యాప్రదానము చేయించుచున్నావా? ఎవరి యనుజ్ఞ వడసి చేయించుచున్నావు? నీవే సర్వాధికారివలె వర్తించుచున్నావే. మా కీయ నిర్ణయించిన మూఁడువేల రూపాయిలిక్కడఁ గ్రుమ్మరించునంతవఱకును గన్యాదానము వలనుపడద"ని గంభీరస్వరముతో నొక పురుషుఁడు పెండ్లిపందిరిక్రింద నిలువఁబడి కనుగవనుండి నిప్పులు గుప్పలుగాఁ గురియించుచుఁ బలికెను.

ఘనగర్జారవమువంటి యా కఠోరకంఠనినాదమును విని పురోహితుఁడు మౌనముద్రాధారియై మిడుతు మిడుతు మని యతనివంకఁ జూడఁజొచ్చెను. అతఁడే యననేల? సభలో నున్నవారి చూపులన్నియు నొక్కపరి నతనివంకకుఁ దిరిగెను. బ్రహ్మఘోషము నిలిచిపోయెను. తూర్యధ్వను లాగిపోయెను. పెండ్లివారి పరస్పర సల్లాపవచనములు కట్టువడెను. నానావిధ కోలాహలధ్వనులతో నిండియున్న వివాహమంటప మొక్క త్రుటికాలములో నిస్తరంగ నిశ్శబ్దసముద్రము ననుకరించెను.

అంత నూతన వస్త్రధారియు రుద్రాక్షమాలాలంకృతగళుండును, రక్షాబంధనాంచితమణిబంధుండును, దీర్ఘశరీరియుఁ, బంచాశద్వర్షవయస్కుండును నగు కన్యాదాత యతనిం గాంచి "బావగారూ! ఈవిషయమై మీ రిప్పుడు చర్చించుట ధర్మముగాదు. ఇంతకుఁ బూర్వమే తగుమనుష్యులయెదుట సర్వమును నిర్ణీతమయినది. వర

శుల్కమునకు బదులుగ మా యిచ్చు శుల్కము వెలకుఁ దగినంత భూఖండము సమస్తాధికారములతోఁ వరునకు వ్రాసియిచ్చునటుయు, దానికి మే మంగీకరించుటయు, తద్విషయమై దస్తావేజు వ్రాసి యుంచుటయు, సర్వము జరిగినది. దానికి మీ రంగీకరించి......"
ఆ మాట ముగియకుండఁగనే వరుని జనకుఁడగు శ్యామసుందరరావు పెద్ద యెలుంగుతో నా పందిరి రేకు లెగిరిపోవునట్లుగా "ఆఁ, ఏమీ? ఇట్టి యసందర్భము లాడుచున్నారు? ఈ విషయము నే నంగీకరించితినా? చాలు. చాలు. ఇట్టిమాటలు లాడకుఁడు." అని పలికెను.

అది విని కన్యాదాతయగు రామావధాని "అయ్యా! మీ రిట్లనుట తగదు. నాఁడు పెద్దమనుష్యులయెదుట మీ రేమన్నారో జ్ఞాపక మున్నదా? మొదట భూఖండము కావలెనని కోరినది మీరే కాదా? అందులోను మీ యేఁటి బాడవభూమితోఁ గలిసియున్న రేగుమానిస్తువాయే కావలెనని కోరలేదా? అట్టి సుక్షేత్రము నిచ్చుటకు నే నిష్టపడని సమయమునందు మధ్యవర్తులచే "ఆభూమి నీ కూతునకు, నీ యల్లునకే చెందును గాని పెఱవారికిఁ జెందదు గదా? రామావధానిగారు! మీ రిందుల కంగీకరింపక తీరద"ని చెప్పించిన వారు మీరే కదా? ఇంత పట్టుదలతోఁ గోరుచున్న మీ యభిలాషము నెఱవేర్పకపోయినచో మీ సంబంధము తప్పిపోవునేమో యని తుద కంగీకరించితిని. ఇట్లు కోరినది మీరు. పెద్దమనుష్యుల నిర్బంధముపై నాభూమి వరునకు శుల్కముగా నంగీకరించినవాఁడను నేను. అన్నియు నిర్ణీతము లయినపిమ్మట మీ రిట్లనతగవు...

ఆ వాక్యము పూర్తికాకుండఁగనే "అయ్యా! రామావధాని గారూ! మీ రెప్పటివో కృతయుగపుమాటలాడిన లాభములేదు. కట్టకడపట నే మాటలు జరిగినవో యవి చెప్పరేమి?" అని శ్యామసుందరరా వనెను.

రామా.—ఏమి జరిగినది ?

శా.—మాకు రొక్కమే కాని భూములు బుట్రలు వద్దని.

రా.—అట్లయినఁ బరమసంతోషము. కాని నాకీ వార్త తెలుపవలదా ?

శ్యా.—తెలుపకేమి? వాసుదేవరావుగారిచే వార్త పంపితిమి.

రా.—మా కతఁడు పెండ్లివారికిఁ గావలసిన సదుపాయములను గూర్చియే చెప్పెను. కాని యీ యంశము చెప్పనే చెప్పలేదు.

శ్యా.—పోనిండు. ఇప్పుడు చెప్పితిమి కాదా ?

రా.—సరియే. దానికి నే నంగీకరించితిని. మూఁడువేలు రూపాయిలును దప్పక యొసంగెదను. కాని యిప్పటి కిప్పు డంత సొమ్ము జతపడుట యెట్లు! ఇది పల్లె కాని పట్టణముకాదు.

శ్యా.—ఎట్లో జతపఱుపవలెను. లేనిచోఁ బెండ్లి యెట్లు?

రా.—ఎట్లు జతపఱుతును? ఈ సమయమున మ మ్మిట్లు బాధించుట తగునా ?

శ్యా.—నిర్ణీతమయిన కట్నము నడుగుట బాధించుటయా ? ఇట్టి నిష్ఠురము లాడిన మనువా రిచ్చుటలేరు. మొదట నొకమాట ! ఇప్పు డింకొకమాట ! మానవునకు రెండు నాల్కలా ?

రా.—అయ్యా ! నా కొక్కటియే నాలుక. నే నెప్పుడు నొక్కటియే చెప్పుచున్నాను. మీకు భూమి కావలయుననుటచే రొక్కము జతపఱుపలేదు. ఇప్పుడు రొక్కము కావలయునని యనుచున్నారు. ఇందు రెండునాల్క లెవ్వరి కున్నవో! నే నా కట్నము నియ్యనన్నచో మీ రప్పుడు నన్ను నిందింపవచ్చును. పోనిం డయిన దేదో యైనది. రెండు మూఁడు దినములలో రొక్కము పూర్తిచేసి యిచ్చెదను. నాయందు మీకు నమ్మకము చాలనిచో నీగ్రామములో

మీరు కోరినవారిచే నొప్పించెదను. ఇప్పటికి లగ్నము జరుగనిండు.

శ్యా—ఆహా! మీమాట లెంత సంసములుగా నున్నవి? వరున కిచ్చెడి కట్నము లరువుపెట్టుట నెక్కడను జూడలేదు. శక్తి లేనప్పు డిట్టివి తలపెట్టరాదు.

రా—నిజముగా నా కట్టి శక్తి లేనినో మీరు చెప్పినట్లే చేసి యుందును. కాని భగవంతుండు నా కింత యిచ్చియున్నాండు. ఇది వఱకు ముగ్గు రాండుపిల్లలకుఁ బెండ్లిండ్లు చేసినాను. నే నెందును మాటపడలేదు. లోపము రానీలేదు. మీకు రొక్కమే కావలయు నని తెలిసిన నీపాటికి సిద్ధముచేసి యుంపకపోదునా? ఇప్పటివఱకును మీకు రొక్కమె కావలెనన్న సంగతి తెలియలేదు. ఆ మధ్యవర్తుండు వాసుదేవుండు మాకుఁ దెలుపనేలేదు. శుభముహూర్తము మించి పోవుచున్నది. అది మనకు ముఖ్యము. మేము రొక్కము చెల్లించు నంతవఱకును బంగారము మీయొద్దనుంచుకొనుండ"ని చెప్పుచుండ...

రామావధాని భార్య యడ్డుపడి "అన్నయ్యా! గతించినదానికి విచారించిన లాభములేదు. మీబావ చెప్పినట్లు బంగారముంచుకొని కార్యము జరుగనిమ్ము. ఇదిగో, ఒడ్డాణము, వాచీగొలుసు, వంకీలు, కాసులపేరు, ఈ నాల్గువస్తువులును నాలుగువేల విలువగలవి. తీసి కొమ్ము. కార్యము జరుగనిమ్ము. మా మర్యాద కాపాడుము. మా కపకీర్తి వచ్చిన నీకుఁ గాదా! బంధువులము గాని పరులము కామే!" అని చేతులు జోడించి పలికెను.

"అయ్యో! ఇదేమి పాపమమ్మా! ఆ నగలు మా కెందుకమ్మా? వియ్యపురాలి యొంటి నగ లిచ్చునందాక కార్యము జరుగనీలేదని లోకులు మమ్ము దిట్టుటకా? ఇంత కట్నము పుచ్చుకొన్నామన్న గౌరవము మాకుఁ గావలెను. కాని యిట్టి లోకాపవాదముతోఁ గూడిన కట్నము మా కక్కఱలేదు. చాలు. చాలు. ఇట్టి వింత

లెక్కడను జూడలేదు" అని శ్యామసుందరుని భార్య పలికెను.

"అంత పేరుప్రతిష్ఠగలవా రగుటచేతనే కాఁబోలు నసమయ మందు రొక్కమిచ్చినఁ గాని పెండ్లి వలనుపడదని యిబ్బందిపెట్టు చున్నార"ని కన్యాదాత సోదరుఁడు పలికెను.

"మీ కంత యిబ్బందిగా నున్నప్పు డిచ్చుట మానివేయుఁడు. ఇట్లుస్సురని యిచ్చిన కట్న మెవ్వరికిఁ గావలెన"ని పెండ్లికొడుకు తల్లి మాఱు పలికెను.

అంతఁ బెండ్లివారు రెండుపక్షములవారయి యెవరికిఁ దోఁచినది వారు పల్క నారంభించిరి. దానికిఁ గ్రమము లేదు.

"రామావధాని యంతగాఁ జెప్పుచున్నపుడు శ్యామలరావుగా రింత పట్టుదల వహించుట తగద"ని యొక రనిరి.

"తప్పంతయుఁ గన్యాదాతదే" యని మఱియొక రనిరి.

"కాదా? క్రొవ్వి కూర్చుండి మూఁడువేలరూపాయిలు కట్న మిచ్చుట కంగీకరించుట కన్యాదాతది పెద్దతప్పు?" అని యొకఁడు పరిహాసముగాఁ బల్కెను.

అది విని వియ్యపురాలు చేతు లూపుచుఁ బెద్ద గొంతుతో "పో నిండు కట్న మియ్యనక్కఱలేకుండ మీ పిల్లకుఁ బెండ్లి చేసికొనలేక పోయినారా? ఎవరయినను వద్దన్నారా? మీపిల్ల నియ్యక తీఱదని మి మ్మెవ్వరు నిర్బంధించినారు? అహర్నిశాలు కనఁబడినవా రందఱ చేతను వార్తలు పంపి పంపి బతిమాలుకొనుటచే నీ సంబంధమున కంగీకరించినాము. అమ్మయ్యా! బాబయ్యా! మీ పిల్ల నిచ్చినఁ గాని వలనుపడదని మిమ్ముఁ బ్రార్థించినవా రెవ్వరును లేరు. ఈ పిల్ల నియ్యనంతమాత్రమున మావాఁడు కలకాలము బ్రహ్మచారియై యట్లుండిపోఁడు" అని పలికెను.

"అయ్యో! పాపము. ఇఁక నేమిగతి? ఈ వరుఁడు లేకపోయిన

మా పిల్లయే కాంబోలు కలకాలము కన్యకయై యుండిపోవును" అని కన్యాదాతవంక వారొకరు పల్కిరి.

"కాదు. కాదు. మీపిల్ల లేకపోయిన మావానికిం బెండ్లమే దొరకకపోవును గాంబోలు" అని వియ్యపురాలనెను.

"మీపిల్లయు లేకపోయిన మాపిల్లకు వరుండే దొరకకపోవునా? ఎందులకీ గడుసుమాటలు" అని కన్యాదాత సోదరుండనెను.

"దొరకునో మానునో! ఇప్పుడంతయు నెందులకు? పడిపడి దండాలుపెట్టి మా సంబంధము చేసికొన్నంగాని నాలుగుపడదని నిర్బంధించినవారి నడిగినం దెలియును." అని యామె పలికెను.

"సంబంధము విషయమై పడిపడి దండాలుపెట్టు నవసర మెవ్వరికిని లేదు. ఇల్లు గుల్లచేసికొని మిమ్ము చెల్లించుకొనుటయే కాక దండాలు కూడం గావలయునా? రామావధాని వెఱ్ఱివాండు గాన యిందుల కంగీకరించినాండు. మఱెవ్వరిందులకు సాహసింతురు? అతండయినను సన్నయ్యగారనియుం, గావలసిన సంబంధమనియు నెంచి మీరు కోరిన గొంతెమకోర్కులకెల్ల నంగీకరించినాండు. ఇంతకుం గలిసిన సంబంధము గదాయని కోసుకొన్నందులకుం దగిన శాస్త్రి చేసినారు?"

"మీకుంగాదు. ఆశాస్త్రి మాకు. నాలుగువేలు కట్నమిచ్చెదమని మాయింటిచుట్టును దిరిగి చెప్పవచ్చిన వారి సంబంధములను వదలి కలిసిన సంబంధము గదాయని సమ్మతించినందులకుం దగిన శాస్త్రి చేసినారు? మా దురదృష్టదినములు గాకపోయిన నీ వైదికసంబంధము నాసింపనేల?"

"అయ్యో! తల్లీ! ఎంతపొరపాటుచేసినారు? ఈ వైదికసంబంధము మాని నియోగిసంబంధమును జేసికొనుండు. అవును. మీరు వైదికులు గారు. నియోగులు" అని హేళనముగాం బలికెను.

ఇంక నిందులకు సమాధానము చెప్పలేక వియ్యపురాలు పరుష

వచనములు ప్రారంభించెను. ఆఁడుపెండ్లివారుగూడ నందులకుఁ దీసిపో లేదు. రామావధాని యెంతవారించినను నెవ్వరును వెనుదీయలేదు. ఆకోలాహలధ్వనులలో నొకరు చెప్పినమాట యింకొకరికి వినఁబడు టయే లేదు. క్రమముగాఁ బరుషవచనము లతిశయించినవి. కోపములు హెచ్చినవి. సంతోషములు నిలిచిపోయినవి. యుక్తాయుక్తవివేకమును మఱచిరి కర్తవ్యమును విసర్జించిరి. పెండ్లిపీటపై గూర్చుండిన వరుని లేవఁదీసికొని వియ్యపురాలు వెడలిపోవుచుండెను. శ్యామలరావు తెచ్చిన పెండ్లివస్తుసంభారములు పట్టుకొని యామెను వెంబడించెను. తక్కినవారు వారి ననుసరించిరి. అప్పుడు కొందఱు తగువుమనుష్యు లతని నడ్డగించుకొని "అయ్యా! శ్యామలరావుగారూ! మీవంటి ప్రాజ్ఞులు మూర్ఖులవలెఁ బీటలపై పెండ్లి విఘ్నము గలిగించుట న్యాయముగాదు. యుక్తముగాదు. తెల్లవారునప్పటికి మూఁడువేల రూపాయిలును జెల్లింపుభారము నాది. ఇంతవఱకు వచ్చినదానిని మానిన మీ యనుభవమునకు నపకీర్తి గాకపోవును. ఇదివఱలో మీరిరువురును బంధువులు. ఆచుట్టఱికము నాలోచించియైనను మీ మర్యాద మీరు గాపాడికొని రామావధాని మర్యాద గాపాడుఁడు. ఇదియంతయు మీచేతిలోనిపని. మరలుఁడు. రండు. వరునిఁ దీసికొని రండు. కార్యము నెఱవేఱనిండు. నామాట మన్నింపుఁడ"ని ప్రార్థించిరి.

అందులకు శ్యామలరావు గ్రుడ్లుగుప్పెడుచేసి "ఓహో! అందఱు నాకు నీతులుగఱపువారే? అనుకొన్న కట్నమీయవలయునని చెప్పు నీతిపరుఁ డొకఁడును లేఁడు గదా?" అని పలికెను.

"రామావధాని కట్నమీయనని చెప్పినప్పుడుకదా మేము చెప్ప వలెను. అతఁడు భూమి వ్రాసి యిచ్చుటకు సిద్ధముగానున్నాఁడు. కాదు రొక్కమే కావలయునన్నచో నిరువదినాలుగు గంటలలోఁ

జెల్లించెదననుచున్నాఁడు. అంతవఱకును బంగారమును మీ యొద్ద నుంచుకొనఁ గోరుచున్నారు. ఇఁక రామావధాని తప్పేది" అనివా రనిరి.

"అట్లయిన నా తప్పంతయు నాదే?"

"కాకము జెవ్వరిది?"

"అయినచో నిట్టియవివేకులతో సంబంధము చేసికొనుట రామావ ధానినంటి వివేకికిఁ దగదు. ఇఁక మమ్ముద్ధరింపకుఁడ" ని మూర్ఖత్వ ముతో శ్యామలరావు వెడలిపోవుచుండెను.

అది చూచి తగుమనుష్యులు రామావధానిని జూచి "అయ్యా! ఇప్పట్లఁ గార్యము చెడగొట్టుకొనుట యుక్తముగాఁ దోపదు. మీ రొకమాఱు ప్రార్థించిన మరలునేమో చూడుఁడు. ప్రయత్నింపుఁ డ"ని పలికిరి.

"అయ్యా! వివేకము చెడియున్నవారికి మనమెంతమంచి మాట లాడినను వారికి విపరీతములు గానేయుండును. ఎట్లయినను గార్యము పొత్తుచేసి కొనవలెనన్న యిష్టము వారికిలేనప్పుడు మనమెంత బతి మాలినను లాభముండదు. పోనిండు కాఁదలఁచినది కాకమానద" ని బదులుచెప్పెను.

కాని రామావధానిభార్య జానకి యూరకుండఁజాలక కోపోద్ధ తుఁడై వెడలిపోవుచున్న శ్యామలరావున కడ్డుపడి "అన్నయ్యా! ఇట్లుచేయుట తగదు. మాకు నలువురలోఁ దలవంపులు తేకు. ఇరు వదినాల్గుగంటలలో రొక్కము చెల్లింపనిచో నీయిష్టమువచ్చిన పరి హారము విధింపుము. లగ్నము జరుగనిమ్ము. ఇట్టిస్థితిలోఁ గార్యము చెడఁగొట్టుట యుభయులకును శ్రేయస్కరము కాదు. దయ యుంపుము. చెల్లెలినగు నామాట మన్నింపు"మని బతిమాలెను.

"చెల్లెలివగు నీమాట వినుటఁబట్టియే యిట్టియవమానము పాలయి

తిని. ఇఁక మాటాడకుమ”ని విరసముగాఁ బలికి వెడలిపోయెను. ఇఁక నేమియు ననలేక దీనాననయై జానకి తిరిగివచ్చెను. శ్యామలరావు మోటుతనమును నిందింపనివారచ్చట నొక్కరునులేరు. వృంతము నుండి పడుచున్న ఫలము నెవ్వఁడు నిలుపఁగలఁడు. ఇష్టములేక కార్య విముఖుఁడగు మూర్ఖుని నెవ్వరు మరలింపఁగలరు. ఈవిధముగ నొక నిముసములో వివాహము విఘ్నమయ్యెను. అంత రామావధాని ప్రధానకాలమందుఁ బిల్లదానికుంచిన యలంకారములు తగు మను ష్యులచేతికిచ్చి మగపెండ్లివారికిఁ బంపెను. అవి వారు పుచ్చుకొని పెండ్లికొడుకునకుఁ గట్టఁబెట్టిన మధుపర్కములను గాహ్వారపుఁ దావళ ములను నాఁడు పెండ్లివారికిఁ బంపివేసిరి. ఇట్లు కార్యము విఘ్నమగు నని యెవ్వరును దలంపలేరు. దైవసంకల్పము దురూహముకదా?

౨

విశాఖపట్టణ మండలాంతర్గత శారదానదీతీరము నంటిపెట్టుకొని రామయ్యగ్రహారమను పేరితో నొక పల్లెటూరు కలదు. అది పూర్వ మెప్పుడో విజయనగరపురాధీశుఁడగు విజయరామగజపతిచే రామావ ధాని యను నొక విద్వత్ప్రవరున కొసంగఁబడెనఁట! రామవధాని కొసఁగఁబడుటచేతనే యాతనిపేర నా పల్లెటూరు పరంగుచున్నదని పలజ్ఞులు చెప్పుచున్నారు. అందు మొదట నివసించిన వయిదికు బ్రాహ్మణకుటుంబములే యైనను రాను రాను బెక్కండ్రకు నివాసమై ప్రస్తుత మొక వంద బ్రాహ్మణకుటుంబములతో నలరారుచుండెను. వారి ననుసరించి యితరవర్ణములవారు కూడఁ గొందఱు వచ్చి యందు నివసించి యుండుటచే నిప్పు డది పల్లెయని చెప్పుటకు నలనుపడకుం

డెను. ఆ గ్రామమును రెండుభాగములుగఁ జేసి యొకభాగమున కెగు
దలవీధి యనియు, రెండవదానికి దిగుదలవీధి యనియుఁ బిలుచుచుం
దురు. బ్రాహ్మణులా రెండువీధులందును సమానముగానే కాపుర
మున్నారు. ఆ యగ్రహార మేర్పడినప్పు డం దున్న బ్రాహ్మణకుటుం
బములు క్రమముగాఁ బెరుగుచున్నట్లుగనే తదీయభూములు గూడ
శారదానదీజలపూరపరిప్లావితములై సారవత్తరములై ఫలవంతములై
రాఁబడియందు హెచ్చిపోయి ప్రస్తుతమున నయిదాఱు కుటుంబముల
వారిని దక్కఁ దక్కినవారిని ధనసంపన్నులనుగాఁ జేయకపోలేదు.
అందులో నయిదాఱు కుటుంబములవారు సంవత్సరమున కే డెనిమిది
వేల రూపాయిల యాదాయముగలవారు గలరు. ఈ ధనాధికకుటుంబ
ములు రెండు మాత్రమే దిగుదలవీధిని గలవు. వారిలో రామావధాని
యొకఁడు. ఇతని కీ యవధానియను పదము వంశపారంపర్యముగా
వచ్చినదే కాని స్వకీయశక్తిచే నార్జించుకొన్నది కాదు. అయిన
నతఁడు తెలివితేటయందును, నూహాపోహలయందును, గురుబ్రాహ్మణ
దేవతాభక్తియందును, బూర్వాచారములందును బరాయణుఁడై,
సాధువై, సాధుచింతనుఁడై, సాధుజనరక్షణలాలసుఁడై వర్తించు
చుండెను. ఎంతవర్షము గురియుచున్నను, శీతబాధ యతిశయించి
జీవకోటి నెంత కుదియించుచున్నను, నతఁడు ప్రాతఃకాలముననే
శారదానదిలో స్నానముచేసి కాల్యకృత్యముల నొనర్చుకొని వచ్చు
చుండును. అతని దేహము దృఢమై, దీర్ఘమై, సుందరమై, చూచువారి
కింపు గొలుపక పోదు. అతఁడు కేవలము వేషమును బట్టి శుద్ధశ్రోత్రి
యునివలె నగపడుచున్నను, లౌకికజ్ఞానసంపన్నులలో నగ్రసరుఁడని
చెప్పక వలనుపడదు. అతనికి దంభవేషములును, వృథావ్యయము
లును గిట్టవు. అతని కిరువురు సోదరులును, ముగ్గురు సోదరీమణులును
గలరు. సోదరు లిరువురును బెద్దలై వివాహితులయి పుత్త్రవంతులయి

యున్నను విభక్తులు గాక యన్నగారికనుసన్నల మెలఁగుచు వర్తించు చుందురు. వారి భార్యలు కూడ బావగారగు రామావధానియందును, దోడికోడలగు ననసూయయందును సమితమగు భక్తిగౌరవములు గలవారయి గుణవతులని వాసి కెక్కిరి. గృహాధికార మంతయు రామావధానిది. అతఁడు చెప్పిన విధమునఁ గుటుంబమువారందఱును భయభక్తులతో మెలఁగుచుందురు. అతని యాజ్ఞ కెదురు లేదు. అయిన నతఁడు సకలకార్యములందును గడు జాగరూకుఁడయి వర్తించుచు నడుమ నడుమ సోదరుల యాలోచనము కూడ వినుచుండును. ఆకారణమున వారి సౌభ్రాత్రము దాశరథుల సౌభ్రాత్రమును మించుచుండెను. ఇట్లు పరస్పరప్రేమతోఁ బరఁగు నా సోదరత్రయమును గాంచి యా గ్రామవాసులే కాక యితరులు కూడ నెక్కుడుగా నాదరించి గౌరవించుచుందురు. కాని వారి ధనకుల గౌరవసంపదలను జూచి మత్సరపడువారు కూడఁ గొందఱు లేక పోలేదు.

శుద్ధశ్రోత్రియకుటుంబ సంభూతులయిన నా సోదరులకు మొదట నవనాగరకతాసంపర్కము సంభవింపలేదు. కాని వారి భార్యల ననుసరించి వారు నవనాగరకులయి వర్తింపక తీఱినది కాదు. అందు రామావధాని భార్య యనసూయ యొక న్యాయాధీశుని కూతు రగుటచే నదివఱకు నాగరకతతో విశేషసంబంధము లేని రామావధాని కుటుంబక్షేత్రమున నామె పాశ్చాత్య నాగరకతాబీజములను నెలకొల్పి వర్తింపసాగెను. అందువలనఁ బిల్లలకు వేషభాషల విషయమున ధనము వ్యయమగుచుండెను. అతని కిద్దరు పుత్త్రులును, నిద్దరు పుత్త్రికలునుఁ గలరు. ఇదివఱ కతఁడు తన పెద్దకుమారికకును, దన సోదరుని పిల్లలకును బెండ్లి చేసియున్నాఁడు. భార్య ప్రోత్సాహమున నా యాఁడుపిల్లలకుఁ బెద్ద యుద్యోగుల సంబంధములు చేయుటచే

ధనము వ్యయమగుటయే కాక యింకను వ్యయమగుచుండెను. దొర తనమువారి యుద్యోగులగు వియ్యంకులు దమ యింటికి కరుదెంచి నప్పుడు తగు విధమున గౌరవింపకున్నచోఁ దమ కీర్తికి భంగము గల్గునని తలంచి తన గృహమును నానావిధ చిత్రాసనాదిపరికరములతో నింపవలసి వచ్చెను. భోజనాదిసత్కారములందుఁ గూడఁ దొంటికంటె నెక్కుడుగా వర్తింపవలసి వచ్చెను. పండుగులకుఁ దమ యల్లుండ్రను వియ్యపురాండ్రను గొనిపిచ్చి దగిన సత్కృతులను గావింపవలసి యుండుట గూడ ధనవ్యయమునకుఁ గారణ మయ్యెను. ఈవిధముగా రాను రాను ధనవ్యయ మధికమగుటచేఁ గుటుంబ పోషణమునకు సంవత్సరాదాయము చాలక రామావధాని యప్పటప్పట ఋణము చేయవలసినవాఁ డయ్యెను.

అయినను ఋణము మహావ్రణమువంటిదని భయపడుచుండువాఁ డగుటచే రామావధాని యుక్తకాలమునందే మేల్కొని ధనచికిత్సా సాహాయ్యమునఁ దద్బాధను దొలఁగించుకొని సుఖియై వర్తించుచుండెను.

ఇంతట రామావధాని దన కడపటి కూతురగు భద్రకు వివాహము చేయవలసి వచ్చెను. ఆపిల్లయందుఁ గుటుంబమువారికందఱకు నధిక వాత్సల్య ముండుటచే నెంతకట్నమిచ్చియైనను భాగ్యవంతుల యింటిలో బడవేయవలయునని వా రందఱును దలంచుచుండిరి. అందులో ననసూయ తమ భద్ర యత్తవారు కేవలమును ధనికులే కాక నవనాగరకులై కూడ నుండవలయునని కోరుచుండెను. మఱియు నామె తమ గ్రామమునకు సమీపముగా నున్న రావ్పూరులోఁ గాపురమున్నవాఁడును దన కొక్కవేలు విడిచిన పినతండ్రికుమారుఁడును నగు శ్యామలరావుగారి యింటను దమ చిట్టితల్లి యగు భద్రను బడవేసినచో నాపిల్ల యమితసౌఖ్య మందుటయే కాక మాటిమాటికిఁ దమ

కన్నులఁబడి తమకుఁ గూడ నమందానందము గూర్చునని యామె యాశపడి వారు కోరినంత రొక్కమును, నితరములగు వస్త్రాభరణాదులును, నిచ్చుట కంగీకరించిరి. సర్వము సన్నద్ధమైనది. ఈ వివాహ మతివైభవముతోఁ జేయవలయునని తలంచి రామావధాని నానావిధవస్తుసంభారములను సమకూర్చుకొని సిద్ధముగా నుండెను. శ్యామలరావు తన కుమారుని కిచ్చు శుల్కమునకు బదులుగాఁ దన భూములతోఁ గలిసియుండిన భూఖండ మీయవలయునని కోరినందున నతఁ డందులకు సమ్మతించి కట్నమునకై రొక్కము సమకూర్చ మానివేసెను. పిమ్మట శుభలగ్నము నిర్ణీతమగుటయుఁ బెండ్లివారు తరలివచ్చుటయుఁ గన్యాదానసమయమునఁ గట్నమునకై కలహించుటయు మగపెండ్లివారు వెడలిపోవుటయుఁ జదువరులు చదివియున్నారు. మగపెండ్లివారు వెడలిపోవునప్పటి కెంతో రాత్రిలేదు. ఆడుపెండ్లివారు గుంపుగుంపులై కూర్చుండి వివాహభంగమునకు మిక్కిలి విచారింపఁజొచ్చిరి. అం దనసూయపొందెడి దుఃఖమునకుఁ బారమే లేదు. ఆమె చుట్టును జేరి పెండ్లివారు పలువిధములగు నీతులుచెప్పి యామె దుఃఖమును శాంతింపఁజేసిరి. అప్పటి వారందఱును నంతటి స్వల్పాంశమునకై పంతముపట్టి వివాహము భంగముపుచ్చి వెడలిపోయిన శ్యామలరావు మూర్ఖత్వమును నిందింపనివారు లేరు. కాని వారెంత యోజించినను శ్యామలరా వట్లు చేసి వెడలిపోవుటకుఁ గారణ మరయలేక పోయిరి.

“రొక్కమైననేమి? భూమియైననేమి? ఇందులకై శ్యామలరావు పట్టుపట్టుట మిగులఁ దెలివిమాలినపని” యని యొకరనిరి.

“కాని యాశ్రమత్యాగము చేసిన కొడుకు నతఁ డెంతకాల మట్లుంచుకొనఁగలఁడు? మూఁడు రాత్రులలోగా వివాహము చేయక తీఱదుగదా? ఈ ప్రాంతముల రామావధానిగారి సంబంధముకంటె

మేలయినది లేదుగదా? ఏమి చేయునో చూచెదము. దినత్రయము లోపల నతఁడు కొడుకునకు వివాహము చేయనిచో నతనిని గులము నుండి బహిష్కరించి తీరవలెన"ని మఱియొకఁ డనెను.

"శ్యామలరావంత వెఱ్ఱివాఁడుగాఁడు. ఏదో మఱియొక సంబంధమును నిశ్చయించుకొని యుండియే యిట్లు చేసి యుండున"ని వేఱొకరనిరి.

"అది సత్యము. అతని కంత మనోధైర్యమే లేకపోయినచో నట్లు సాహసింపఁగలఁడా? కాని మనకుఁ దెలిసినంతవఱకు క్రాంతముల శ్యామలరావుగారితో సంబంధము చేయువా రెవ్వరును నగపడర"ని మఱియొకరనిరి.

"ఈ ప్రాంతమునందు లేకపోవుగాక మఱియొక ప్రాంతమునం దున్నవారు రాఁగూడదా?" అని మఱియొకఁడనెను.

"వచ్చుఁగాక. అట్లయిన నింతకుఁ బూర్వమే యది నిర్ణీతము కావలెను. అంతేకాని పెండ్లికిఁ దరలివచ్చి యూరేగి వివాహవిధులను గొన్నింటిని బూర్తిచేసికొని కన్యాప్రదానసమయమందుఁ గలహించి వెడలిపోవుట యెక్కడను జూడలేదు. ఇది కడు వింతగా నున్నది. శ్యామలరావు తలం పేమియో యింతుకయుఁ దెలియకున్నద"ని మఱి యొకరనిరి.

"తెలియుట కేమున్నది. తెలిసియే యున్నది. శ్యామలరావతి లుబ్ధుఁడు. చిరకాలమునుండి కట్నములకై బేరములాడుచునే యున్నాఁడు. కార్యము మించిపోవుచున్నదని తెలిసికొని యెవ్వరో నాలుగువేలు కట్నమిచ్చెదమని వార్త పంపియుందురు. అతఁడా ధనాశచే నేదో మిషకల్పించి కలహించి వెడలిపోయినాఁడు. ధనమం దత్యంతాశ గలవాఁడు గాన నతఁ డట్లు చేయఁగల్గెను. కాని మానాభిమానములను బరిగణించు వాఁడెవ్వఁడయిన నట్లుచేయఁగలఁడా"

యని మఱియొకఁ డనెను.

"ధనమున కెంత కక్కుఱితి పడువాఁడయినను నింతవఱకు సిద్ధ
మయిన కార్యమును జెఱిచికొన్నవాఁ డుండఁడు. ఎంతటిలోభి.
ఎంతటి మూర్ఖుఁడు. ధనమే కైలాసమా? ఎదుటివారి గౌరవ మాలో
చింపవలదా? ఇంతమంది చుట్టములు! ఇంతమంది స్నేహితులు! ఇంత
మంది తగు మనుష్యులు! ఇంతమంది బ్రాహ్మణులు! వచ్చియుండగా
వీరి కందఱకు నాశాభంగము గల్గించి యరుంధతీవసిష్ఠులవంటి యా
దంపతులకుఁ దీఱని మనోవ్యధయు నవమానమును గల్గించిన యా
తుచ్ఛుని నేమిచేసినను బాపమున్నదా? మన బ్రాహ్మణులకుఁ గట్టు
బాటులేదు. కాని యానరాధముని మన కులమునుండి బహిష్కరింప
వలదా? వివాహమునకు విఘ్నము గల్గించి పోవలసినంత యవసర
మేమి కల్గినది. తగినట్లు బుద్ధి చెప్పువారు లేక గనుక వాని యాట
లిట్లు సాగివచ్చుచున్నవి. మన మందఱమును మానాభిమానములు
గలవారమైనచో నడుము గట్టుకొని నిలిచి శ్యామలరావు కొడుకు
నకుఁ బెండ్లి కాకుండఁ జేయవలయును. వాఁడు పశ్చాత్తాపపడి బుద్ధి
తెచ్చుకొని రామావధానిగారి కాళ్ళపైఁ బడి బ్రతిమాలుకొనునట్లు
చేయవలయును. వాని కుమారునికిఁ బిల్ల నిచ్చెదమని యెవ్వరు వచ్చి
నను నెట్లో వారి మనస్సును విఱిచి పంపివేయవలయున"ని వీరావేశ
పరవశుఁడయి యొకఁడనెను.

"దానికేమి. ఆతఁడేదో సంబంధమును మనసున నిడికొనియే దీని
విసర్జించియున్నాఁడు. ముందుగా నాసంబంధ మెవరిదో యాలో
చించినారా?" అని మఱియొకఁ డడిగెను.

"ఏమో యెవ్వరిదో యించుకంతయును దెలియలేదు. కాని యీ
దినము సాయంకాలమున కెవఁడో యొకఁడు విశాఖపట్టణమునుండి
వచ్చి శ్యామలరావునకేదో యొక ఉత్తరమిచ్చినట్టును నది చూచిన

ప్పటినుండియు నతఁడు విపరీతవర్తనుఁడై యుండెననియు విడిదినుండి వివాహవేదిక కడకువచ్చునంతవఱకు నతఁడు తనవారితో నేదో గుసగుసలాడుచుండెననియుఁ దెలియవచ్చినది. వాఁడే యీ వివాహవిఘ్నమునకుఁ గారణమైయుండునని యొకఁడు పలికెను.

"ఈ సమాచార మింతకుముందు దెలిపినావుకావేమి? వాని నీ యూరు పొలిమేరదాటకుండఁ గాళ్ళువిఱుగగొట్టి బుద్ధిచెప్పకపోవుదునా?" అని తొలివాఁ డుగ్రుఁడయి పలికెను.

"ఎవ్వరో వివాహార్థమైవచ్చి యుందురనుకొంటిని. వివాహభంగము గావింపవచ్చెనని నాకుమాత్రము దెలియునా?" అని యతఁడు మాఱు పలికెను.

ఈ విధమైన ప్రసంగముతో నా రాత్రి గడచిపోయినది. సమీప గ్రామ వాసులగు బంధువులు రామావధానికి ధైర్యముచెప్పి యాజ్ఞ వడసి వెడలిపోయిరి. తక్కినవారచ్చటనే నిలిచిపోయిరి.

## ౩

వివాహభంగమును గూర్చి తన బంధువులు పలువురు పలువిధముల సంభాషించుచుండుటను వినుచు రామావధాని మౌనియై యట్లు కొంతసేపచటనుండి వేఁకువయగుటఁ గాంచి శారదానది కరిగి స్నానాది కృత్యము నెఱవేర్చుకొని యింటికివచ్చి దేవపూజాగృహముఁ బ్రవేశించి శుభ్రవస్త్రములఁ దాల్చి జపముచేసికొనుటకు దర్భాసనము పఱచుచున్న సమయమున నతని భార్య యనసూయవచ్చి విచారఖిన్న హృదయయై చెక్కిటఁ జెయిచేర్చి ద్వారబంధము నానుకొని తదేక మనస్కయై యతనిఁ జూచుచు నిలువఁబడెను. ఆమెను జూచియు

రామావధాని మాటాడక దర్భాసనముపైఁ జిత్రాసనమును బఱచి యందుఁ గూర్చుండి తాను పఠించుచున్న శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళిని ముగించి ధారవోసి జపించుటకు గోముఖిని సవరించుచున్న సమయమున ననసూయ భర్తతో నిట్లు సంభాషించెను.

అన—ఇట్టి సమయమున జపము చేయ మీకెట్లు బుద్ధిపుట్టుచున్నదో నా కాశ్చర్యము కలుగుచున్నది.

రా—(ఆమె వైపు చూడకయే) ఆఁ, ఏమీ?

అ—ఏమందురేమి? సిద్ధమైన పెండ్లి విఘ్నమయినది. ఇల్లు చుట్టాలతో నిండియున్నది. ముందు చేయవలసినదేమో యోచింపకుండ జపము చేయఁ గూర్చుండిన నెట్లు? సంబంధములోఁ దలవంపులు కలిసవి గదాయని విచారమైనను లేదు గదా?

రా—(భార్యవంకఁ జూచి) ఓసీ! అవివేకురాలా? విచారపడి చేయునదేమి? మనయత్నము లెప్పుడును సాగవు. దైవము తోడ్పడినఁ గాని పౌరుషము ఫలింపదు. అంత వఱకు వచ్చిన కార్యము విఘ్నమగునని కలయందైనను దలంచితిమా? ఆ విషయమై నీ వెంతమాత్రమును విచారింపకుము. దాని గుఱించి, తల వంపులయ్యెనను చున్నావు. ఎవ్వరికో చెప్పుము.

అ—మఱియెవ్వరికి?

రా—కారణము?

అ—కారణమడుగుచున్నారా? ఫలింపవలసిన కార్యము చెడి పోవుటయే.

రా—అందు మన లోపమేమయినఁ గలదా?

అ—లేకపోవుఁ గాక. ఎట్లయినఁ గార్యభంగమైనది కాదా?

రా—దైవము చాలకున్న సగుడు. అందుఁ బరాభవ మేమి గలదు?

అ—అదేమండీ! అట్లెందుకు? ఒకరు నిర్ణయించుకొని—నిర్ణయించుటయే కాదు. మెడలోఁ బుస్తెగట్టుటకు సిద్ధపడిన వరుఁడా పిల్లను విడిచిపెట్టిన పరాభవముగాదా?

రా—కాదు. అందు మన లోపమేమియును లేదు. అక్షరాల మనము నిర్ణయించినట్లు చేసితిమి. లోపమంతయు వారిది. వివాహభంగము గల్గించుటవలన శ్యామలరావు మూర్ఖత్వము వెల్లడియైనది. లోకులందఱు నతనినే పలువిధముల నిందించుచున్నారు. వీరిట్టివారని మనలను వ్రేలితోఁ జూపనైనను సాహసింపలేరు. ఇఁకఁ బరాభవ మెవ్వరికి?

అ—అట్లయిన నీ పరాభవము వారికే యందురా యేమి?

రా—కాక మఱేమి?

అ—ఎవ్వఁడయినను దనకుఁ దాఁ బరాభవమును దెచ్చుకొనునా?

రా—శ్యామసుందరునికి ధనము తప్ప రెండవ దనవసరము. ధనము ముందతనికిఁ బరాభవము గిరాభవము కనఁబడదు. ఇతరులేమనుకొందురో యన్న భయమైనను లేదు. అట్టి మూఢుఁడు—అట్టి లోభి—అట్టి మొండివాఁడు—మఱియొకఁడు లేఁడని లోకులందఱు గ్రహించుచున్నారు. అంతకంటెఁ బరాభవ మేమి?

అ—సరియే దానికేమి? మగవాని కెట్లయినను వివాహమగును. కాని యాఁడుపిల్లకు—అందులో నొకఁడు పుస్తెగట్టుటకు సిద్ధపడి విడువఁబడినదానికి—వివాహము కాదేమోయని నా భయము.

రా—మన పిల్ల కన్యకగా నట్లుండిపోవలసిన యవసరము లేదు.

అ—ఎవ్వరును బెండ్లాడకపోయిన,

రా__మన మిచ్చెదమన్నచోఁ బ్రార్థనాపూర్వకముగా స్వీకరించువా రెందరో కలరు. దీనికి భయపడనేల?

అ__ఇప్పుడు చేపట్టుదురో లేదో,

రా__ఏమీ?

అ__వారు చేపట్టి విడుచుటచే,

రా__అగుఁగాక మనయందుఁ గాని పిల్లయందుఁ గాని లోపము లేనప్పుడు సందియమేల?

అ__అట్లని యెవ్వరికో యూరుపేరు లేనివానికి దీనిని గట్టఁబెట్టెదరు గాఁబోలు.

రా__పిల్లదాని కష్టసుఖము లరయనివాఁడ ననియే నీ యూహయా?

అ__ఏమో! త్వరలోఁ గార్యము చేయవలెనని యెంచి యేబీదవాని మెడ కంటగట్టెదరో యని నాకు భయము. నాల్గు దినములు విలంబమైనను సరియేకాని మంచిసంబంధము చూడక తీఱదు.

రా__మంచి సంబంధ మనగా నెందులో మంచి?

అ__ఎందులో నేమి? అన్నిటియందు నుండవలెను. ధనమందు, రూపమందు, చదువునందు, నాగరికతయందు...

రా__అట్టి సంబంధమే చేయుదము.

అ__అన్నియు గుదురుట కష్టము. అన్ని విధముల బాగున్నదనియే యెంతో యాసపడి యీ సంబంధము నిర్ణయించుకొనఁగాఁ దుద కిట్లయినది: ఇంతకు భద్ర యదృష్టవంతురాలని తోఁపదు.

రా__ఈ సంబంధము తప్పుటచే భద్ర గొప్ప యదృష్టవంతురాలని నా విశ్వాసము.

అ__అదేమండీ! అట్లందురు. ఆజమీన్దారి సంబంధము

వంటిది మనము తపస్సు చేసినను దొరకునా?

రా—ఓసీ! అమాయకురాలా! మాటిమాటికి జమీన్దారీ సంబంధ మందువు; అందువలనఁ గలుగు లాభమేమి?

అ—లాభమా! పిల్ల సుఖించుటయే.

రా—అదికల్ల! ధన మున్నంతమాత్రమున సుఖ మబ్బునని తలంపకుము. ధనికులయ్యు సుఖ మెట్టిదో యెఱుఁగనివా రెందరో కలరు. బీదలయ్యు నిరంతరసుఖ మనుభవించువారుగూడ నెందరో గలరు.

అ—(విసివికొనుచు) మీవన్నియు వింతమాటలు. ధనము లేకున్న సుఖమెట్లు కల్గును?

రా—ధన ముండిన నెట్లు కల్గును?

అ—మీ రన్నది బాగున్నది. ధన ముండిన పలువిధముల వెచ్చించి కావలసిన వస్తువులు గొని సుఖించును.

రా—అట్లు వెచ్చింపకుండ వచ్చిన ధన మంతయు సంచులలో వేసి మూతులు బిగించువాఁ డయినచో నేమగును? అతనిని ధన వంతుఁడనియే యందురుగదా? సుఖమేదీ!

అ—అట్టివాఁ డెక్కడను నుండఁడు.

రా—ఎక్కడనో లేఁడు. మీ శ్యామసుందర మన్నయ్య యట్టివాఁడు. కనుకనే నే మొదటినుండియు ధనవంతులయినను వారి సంబంధము వలదని మొర పెట్టితిని. కాని నీవు వినక మొండిపట్టుదల వహించి యా సంబంధమే కావలయునని యన్నావు. నీ కా శ్యామ సుందరరావొక క్రేలువిడిచిన పినతండ్రి కొడుకనియు, నీకు నీవారి సంబంధములపై గోర్కె యుండుట సహజమనియు, నీకుఁ జేయవలసిన యీఁడుపిల్లల పెండ్లిండ్లు లేవు గాన యిది నీ యిష్టప్రకారముగాఁ జేసి నీ మనోరథ మీడేర్చుట మంచిదనియుఁ దలంచి నీ ప్రార్థనముచొప్పున

వారడిగిన వన్నియు నిచ్చుట కంగీకరించితిని. కాని నాకా సంబంధ మెంతమాత్రము నిష్టము కాలేదు. ధన మున్నదన్నమాటయే కాని వారు దినలేరు. ఒకరికిఁ బెట్టలేరు. అట్టివారియింటఁ బడిన పిల్లకు సుఖము కలుగనే కల్గదు. ఆ శ్యామలరావు లుబ్ధాగ్రేసరుఁడు. ఒకనాఁడయినను నాలుగు వస్తువులు వండించుకొని తిన్న పాపమునఁ బోయినవాఁడు కాఁడు. అతఁడు గర్వాంధుఁడు. పట్టపరీక్షయందు తీర్ణుఁ డయినను లోకజ్ఞాన మావంతయు లేని మూర్ఖుఁడు. అతనికి యుక్తాయుక్తవివేకము లేదు. లాభనష్టములు తెలియవు. మన మిచ్చెదమన్న కట్నములో లోపమేమి? భూమి ధనముగాదా? ధనము భూమిగాదా? అతని కాపాటి వివేక మున్నదా?

అ—పోనిండు. అయిన దేదో యయినది. వారు రొక్కము గదా కోరుచున్నారు. మన మా సొమ్ము జతపఱచి వారియెదుటఁ బెట్టినచో వారే యంగీకరింతురు. స్నాతకవ్రతుఁ డగు పిల్లవానిని వారల్లుంచుకొన వీలులేదుగదా? మన మిట్లు చేసినచో ననుకొన్న కార్యము పూర్తియగును. మనము గట్టునఁ బడుదుము.

రా—ఓహో! ఇంకను నీ కాయాశ వదలలేదా? ఏమయినను సరియే. కాని యా మూర్ఖాగ్రేసరునింటఁ బడవేసి నోరెఱుంగని పసికూన గొంతుకోయ నా కిష్టములేదు. ఛీ! ఇంకను, ఆ నీచసంబంధమే చేసికొనవలయునా?

అ—ఆ పట్టుదల యంతయు మా వదినెది. మా యన్నయ్య యేమి చేయఁగలఁడు?

రా—వదినెదో, బావదో. అ దెవ్వరిదైన నేమి? పట్టుదలకు విడుదలవలదా? ఇరువదినాల్గుగంటలలో సొమ్మంతయు నిచ్చెదమని చెప్పుచున్నను, గ్రామములోని తగు మనుష్యులచేఁ జెప్పించినను వినవలదా? ఛీ! అట్టి మూర్ఖులతోఁ జుట్టఱికము చేయుదునా? వలదు.

వలదు. ఈ రాత్రి కర్కాటకలగ్నమునఁ బెండ్లి జరిగి తీఱును.

అ—ఎవ్వరి కిచ్చెదరు?

రా—దాని కెవ్వఁడు భర్త కాఁదగినవాఁడో వానికి.

అ—ఆలస్య మైనను సరియే కాని మంచి సంబంధము చేయ వలయును సుఁడీ.

రా—ఇఁక నాలస్యము పనికిరాదు. పలుతావులనుండి వచ్చిన చుట్టాలను బంపి వేసినచో మరల నెత్తురో రారో! కాన యెట్లయినను నీదినము కార్యముగాక మానదు.

అ—చుట్టములకై త్వరపడి పెండ్లిచేసి పిల్లదాని గొంతు కోయకుఁడు.

రా—అ ట్లెన్నటికిని జేయము.

అ—(విచారించుచు) గ్రామములోని సంబంధము. పిల్ల యెల్లపుడు కనులఁ బడుచుండునుగదా యని యెంతో యాసించితిని. కాని యది జరిగెడి కాదు.

రా—అందులకై విచారింపకుము. ఈ సంబంధము గూడ మన యూరిలోనిదే.

అ—అట్లయిన సంతోషమే కాని తగిన చదువు లేకపోయిన వలనుపడదు.

రా—చదువు చదువందువు. వివేకములేని చదువేల? కాల్చ నా? మీ యన్నయ్య పట్టపరీక్షయందు త్తీర్ణుఁ డయినాఁడు. ఏమి లాభము? తెలివి తేటలు శూన్యముగదా!

అ—అందఱు నట్లే యుందురా? తక్కిన మనయల్లు రాంగ్ల భాష చదివికొన్నవారు. వా రందఱును బెద్దయుద్యోగములు చేయుచు ధనగౌరవము లార్జించుచుండ మనపిల్ల లెంతయు సుఖించుచుందురు. ఈ పిల్ల కట్టి యదృష్టము లభింపకపోయినది పెద్దదయిన విన్నాట మనలఁ

జెడఁదిట్టుచు మన ప్రాణముల కుస్సురుమని యేడ్వక మానదు. కావున వరుఁ డింగ్లీషు చదువుచున్నవాఁడే కావలయును.

రా—ఇంగ్లీషే కాని వేఱొండు చదువు వలనుపడదా ?

అ—పడదు. మన యల్లు రందఱు నింగ్లీషు చదివినవారు. ఇతఁడు కూడ నట్టివాఁడే కావలయును.

రా—ఓసీ! ఈ నిర్బంధ మేల? చదువు జ్ఞానోత్పాదకము. అందఱకును ముఖ్యముగాఁ గావలసినది జ్ఞానము. జ్ఞానదాయకమైన దేచదువైన నేమి ?

అ—అట్లు కాదు. జ్ఞాన ములవడినంతమాత్రమునఁ జాలదు. ధనార్జనమో! రెండును గావలయును.

రా—చదువునకును ధనార్జనమునకును సంబంధము లేదు. చదివినంతమాత్రమున ధన మార్జింపఁగలఁడని చెప్పఁగలమా ?

అ—చెప్పకేమి? వేదశాస్త్రములమాట నేఁ జెప్పలేను. కాని రాజకీయవిద్య చదివినవారికి ధనార్జనము కరతలామలకము కాదా ?

రా—నీవు పొరపడుచున్నావు. రాజకీయభాష చదివినంత మాత్రమున ధన మార్జింపఁగలఁడని నమ్మరాదు. అది చదివినవారు గూడ నెందఱో నిర్ధనులయి యున్నారు. ఇందులకు మీ శ్యాములరా వన్నయ్యయే దృష్టాంతము. జ్ఞానగౌరవములు ప్రతి చదువువలనను గల్గుచున్నవి. ఇఁక ధనమా! అదృష్టాధీనము. సముద్రమున కరిగినను మనము గొనిపోయిన పాత్రము పట్టునంత జలము మాత్రమే తేఁగలము

అ—మీ ప్రసంగ మాలోచింప మన భద్రను వేదశాస్త్ర ములు చదివినవారి కెవ్వరికో యిచ్చున ట్లున్నది.

రా—అవును.

అ—విశ్వనాథమునకా యేమి ?

రా—కూడదా ?

అ—చాలు. చాలు. మంచి సంబంధమే యోజించినారు. భద్రకుఁ బెండ్లి కాకపోయినను సరియే కాని యీ సంబంధము వలదు.

రా—ఎందుచేత?

అ—మన మిదివఱకుఁ జేసిన సంబంధములకును దీనికిని హస్తిమశకాంతరము వారయుంటచే.

రా—నిజముగా హస్తిమశకాంతరము వారయున్నదనియే యీ సంబంధము చేయ నిశ్చయించినాను.

అ—మీ వన్నియు విపరీతవచనములు.

రా—ఇందు వైపరీత్య మేమియును లేదు.

అ—మీ కంటికిఁ గనఁబడదు కాఁబోలు.

రా—నీకీ సంబంధమందుఁ గానవచ్చు లోపము లేమియో చెప్పుము చూతము.

అ—అన్నియు లోపములే.

రా—అట్లుగాదు. ఒక్కొక విషయము నాలోచించి చెప్పుము. చదువు విషయమై యిదివఱకే చర్చింపఁబడెను గదా?

అ—ధనార్జనమున కవకాశముబొత్తుగా లేదు.

రా—చెప్పితిని గాదా? ధనార్జన మదృష్టాధీనమని ఇంతకును ధనవిషయ మాలోచింప నిదివఱకు మనము చేసిన సంబంధముల కంటె నిదియే మేలు. ఈవరునకు సాలునకు వెయిరూపాయల రాఁబడి గలదు. ప్రశస్తముగు నిల్లుగలదు. తోటయు దొడ్డియుఁ గలవు. ఇది వఱకు గొప్పసంబంధములని మన మెగిరియెగిరి చేసిన సంబంధము లాలోచింపుము. వారందఱు పట్టపరీక్షలందు త్తీర్ణులయినా రన్న మాటయే కాని యొకరికయిన నింత భూమి బుట్ట లేదుగదా? ఇల్లు

వాకిలి లేవుగదా? తోట దొడ్డి లేవుగదా? ఇంక మన మెంత సేపు సంతసించినను వారి తండ్రులు పెద్ద యుద్యోగములు చేయుచున్నారని తప్ప మఱేమియును లేదు. నేఁడో రేపో నా యుపకారవేతనము పుచ్చుకొనఁగానే వారి బండారము బట్టబయలగును.

అ—నా యుపకారవేతనమునకు వచ్చు నప్పటికిఁ గొడుకు లుద్యోగులయి ధనమార్జింపక పోవుదురా? ధనమున్నచో మీ రన్న వన్నియు మాకును నిమిషములలో సమకూడును.

రా—వారు సమకూర్చుకొనవలెను. ఇతనికి సమకూడి యున్నవి. ఇందేది మేలందువు.

అ—ఆర్జన లేకుండ నెంతధనమున్న నేమిలాభము. అతని సాంవత్సరికాదాయమంతయుఁ బట్టుమని పదివేలరూపాయలకయినను జాలదు.

రా—ఇకను మాత్ర మేము ధనార్జన చేయకపోవునా? ఇంత యున్న వాఁడు గావున నాపైని నేనార్జించినను జాలును. పుణ్యము మీఁదిపంట. గావున ధనవిషయమై చర్చ విడువుము.

అ—అంత యాదాయమున్నదన్న మాటయే కాని నాఁగరకత యింతయైనను లేదుగదా?

రా—ఆ విషయమై చర్చింప నవసరము లేదు.

అ—ఏమీ! ఎందుచేత.

రా—నీవు రాకపూర్వము మా యిల్లెట్టుండెడిది! మే మెట్లుండెడివారము? మాగృహము శ్రోత్రియగృహమువలెను, మేము శుద్ధశ్రోత్రియులము గాను నుండెడివారము. నీ ప్రభావమువలన నెంత మార్పుగలిగినదో చూడుము. అవధానిగారి యిల్లని పేరేగాని కేవలము దొరగారి యిల్లయిపోలేదా? మన యింట నేమూలఁజూచినను పాశ్చాత్యనాగరకత యంటుకొని యుండలేదా? అల్లే నీ కూతురు

వారి యిల్లు చొచ్చినచో వారును, వారియిల్లును మూఁడురోజులలో నూతనపరిణామ మొందును. ఇఁక నందులకయి విచారింపకుము.

అ—మన భద్రిను రెండవపెండ్లివాని కీయ మీకేమియు గష్టము గాలేదా?

రా—రెండవపెండ్లి యన్న పేరేకాని వరుఁడు చిన్నవాఁడు పదునెనిమిది యేండ్లకంటె నెక్కుడు వయస్సు లేదు.

అ—కడిగినకాలు గడిగి కన్యాదానము చేయుదురా?

రా—ఎంతమాత్రమును దప్పులేదు. ఇంతకును శాస్త్రి యాశాస్త్రీయ విషయమై యెన్నఁదగిన దానవు నీవు గావు. ఆ విషయము నాకు వదలివేయుము.

అ—వరునికిఁ దండ్రిలేఁడు. ముద్దుముచ్చటలు తీఱనేతీఱవు.

రా—ఓహో! అదియా నీసందియము. ఇదివఱకుఁ జేసిన సంబంధములవలన నీకు ముద్దుముచ్చటలు తీఱనేలేదా?

అ—నాకుఁ గాదు. పిల్లకు.

రా—పిల్లకు ముద్దుముచ్చటలు తీర్చునది యత్తగారు కాని మామగారు కారు.

ఇఁక ననసూయ మాటాడక యట్లేకొంతసేపు నిలువఁబడి "పెత్తనమంతయు మగవారిది. వారన్న ప్రకారము జరుగును. అంతియకాని యాఁడువారి పంతములు నెగ్గునా? కానిండు. ఇంతకును దైవమెట్లు నడిపించిన నట్లు నడవక తీఱునా?" అని గొణుగుకొనుచు నచ్చోటు గదలిపోయెను.

విశాఖపట్టణపు రాజవీధియందుఁ బెక్కులు దివ్యభవనములు గలవు. అందొకదానియందు శ్రీనివాసరావు నివసించుచుండెను. అతఁడు బి. ఎల్. పరీక్షయం దుత్తీర్ణుఁడయి నూతనముగా న్యాయవాదిపదవి చేకొనియుండెను. అతఁ డట్లు చేసి నాల్గయిదేండ్లయినను గుటుంబభారమును వహించునంతటి ధనార్జనము లేదు. ఎంతటిబుద్ధిమంతులయినను, వైద్యులకును, న్యాయవాదులకును నధమపక్షము పదిసంవత్సరములు గడచునంతనఱకును, ధనదేవతాకటాక్షలేశము లభించుట కష్టము. మఱియు నుపాధ్యాయవృత్తివలె న్యాయవాది వృత్తిగూడఁ బాడగుచున్నది. ఇతరశాఖలం దుద్యోగము పడయ నవకాశములేని వారందఱకును న్యాయవాదివృత్తియే గతి యగుచున్నది. న్యాయవాది జనసంఖ్య దినదినాభివృద్ధి నొందుచుండ ధనదేవత కన్నెత్తి యెందఱను జూడఁగలదు. ఇంతేకాక యంగళ్ళ హెచ్చినకొలఁదిని గొనువారి సంఖ్య పలచనగుచుండును. అది తఱిగినకొలఁదిని ధనాదాయముగూడఁ దఱిగిపోవుచుండును. అది తక్కువయైనపుడు తదనుగుణముగా వ్యవహరించుకొని క్లుప్తముగాఁ గాలక్షేపము చేయుట న్యాయవాది వృత్తికిఁ బనికిరాదు. అద్దె హెచ్చైనను న్యాయవాది గృహము పలువురు రాకపోకల కనుకూలముగునట్లు రాజవీధిలో నుండకతీఱదు. అవసర మున్నను, లేకున్నను ధర్మశాస్త్రగ్రంథములచే నిండిన యొకటి రెండు బీరువా లుండవలెను. ఒక కచ్చేరీ చావడియు, దాని నడుమ నందమైన యొక బల్లయు, దానిచుట్టును గుంటివయినను గొన్ని కుర్చీలును నుండవలెను. నాదాయ మున్నను లేకున్నను నెల కధమపక్షము పదునేను, లేక యిరువది రూపాయల జీతము పుచ్చుకొను గుమాస్తా యొకఁ డుండవలయును. మఱియు

వేశ్యావృత్తికివలె న్యాయవాది వృత్తికిఁగూడ డాబుదర్పము, గోఁటు,
సీటు, వేషము, భాష మొదలగునవి యుండవలయును. ఇవన్నియు
న్యాయవాదికి ముఖ్య పరికరములు. ఇట్టివన్నియు జనాకర్షకములై
యుండినఁగాని ధనమలనడదు. ఆకారణమున శ్రీనివాసరావు మాసా
దాయము తనకుఁ దక్కువ యయినను నద్దె హెచ్చైనను నెట్లో
భరించుచు రాజవీధిలో నొక గృహమున నివసించుచుఁ దక్కిన పరి
కరములనుగూడ సమకూర్చుకొనెను. తన మాసాదాయము తన
కుటుంబపోషణమునకుఁ జాలకపోవుటచే శ్రీనివాసరావు తన చదువు
నకై యున్నగా మిగిలిన భూమిసిస్తుగూడఁ దెచ్చుకొనవలసి వచ్చు
చుండెను.

ఇది యిట్లుండ శ్రీనివాసమునకు మఱియొక చిక్కు తటస్థించినది.
అతఁడు పట్టపరీక్షకుఁ జదువునప్పటి కిరువురు పిల్లలు పుట్టిరి. ప్రస్తుత
మున నతని కెనమండ్రు పిల్లలు. అందు మొదట నాఁడుపిల్లలు
పుట్టిరి. తరువాత మగవారు. అందుచే నితఁడు న్యాయవాది బల్ల
కట్టినప్పటికిఁ బెద్ద పిల్లకు వివాహముచేయక తప్పినదికాదు. అప్పటి
కేమియుఁ దనకు ధనార్జనము లేకపోవుటచే భూమిని కుదవయుంచి
ధనము తెచ్చి వివాహము చేసెను. దానికి వడ్డీయైనను జెల్లింప నవ
కాశము లేకపోవుటచే నసలును వృద్ధియును గలిసి ఋణము దిన
దినాభివృద్ధి చెందుచుండెను. ఇట్లుండఁ దన రెండవ కుమారి వివా
హార్హ యయ్యెను. ఇప్పుడు దానికి వివాహము చేయవలెను. ఇది
వఱలో నతఁడు గొప్పగా బ్రదికినవాఁ డగుటచేతను, బ్రస్తుతమునఁ
గూడఁ దానొక న్యాయవాదియై యింతో యంతో గౌరవము గల
వాఁ డగుటచేతను దన తనయకుఁ గౌరవమునకుఁ దగునట్లు తగిన
సంబంధము చేయవలసియుండెను. మంచి సంబంధము నభిలషించి
నచో దగిన వరశుల్క మియ్యకతీఱదు. ఇచ్చుట కతనియొద్ద నేమియు

ధనము లేదు. అట్లని సామాన్యులకుఁ దన పిల్ల నిచ్చినచోఁ దన గౌరవమున కెక్కుడ భంగము వచ్చునో యని భయము. తుద కతఁ డాలోచించి యేవిధమున నైనను ధనమును జతపఱిచి తన కూతునకుఁ దగిన సంబంధమును జేయుటకే నిశ్చయించుకొనెను.

శ్రీనివాసరావు మిక్కిలి బుద్ధిమంతుఁడు. చక్కఁగాఁ జదువుకొన్నవాఁడు. లౌకికప్రజ్ఞయం దసమానుఁడు. వ్యవహారదక్షుఁడు. ఇట్టివాఁడయినను సదృష్టము చాలనివాఁ డగుటచే ధనదేవతా కటాక్షమును బడయఁజాలకుండెను. అతఁ డొకనాఁ డుదయకాలమున దంతధావనాదికృత్యము లొనర్చుకొని వీధియరుఁగుపై నిట్టటు పచారు చేయుచుండెను. అప్పు డొక రైతు గుమ్మపు మెట్లెక్కివచ్చి నిలువఁబడి 'బాబూ! దండాలు, దండాలు!' అని మ్రొక్కెను. శ్రీనివాసమతని నిదానించి చూచియుఁ బోల్చుకొనలేక యెఱుఁగని విధమున నటించిన బాగుండదని "ఓహో! నాయఁడా? నిన్న నాళ్ళకుఁ జూచితిని. పోల్చుకొనలేకపోయినాను. చూచితివా? కాల మెంతపనినైనను జేయునుసుమీ! రా. కూర్చుండు"మని మర్యాద చేసెను. కాని యతఁడిప్పటికిని గుఱితింపలేక ప్రసంగమువలన నతని వృత్తము కనుగొనవలెనని నిరీక్షించియుండెను. అంతట నా రైతు శ్రీనివాసము మర్యాదకు సంతసించి "చిత్తము బాబూ, నిన్న మీరు మా బావమఱఁదితో "వెంకునాయనిఁ బంపు"మని సెల విచ్చిరట! అందుచేఁ దమ దర్శనమున కయి వచ్చినా" నని చేతులు జోడించికొని నిలువఁబడెను.

శ్రీనివాస మా ప్రసంగమువలన వృత్తాంత మంతయు గ్రహించి "వెంకునాయఁడా! నీ వమాయకుఁడవు. మంచివాఁడవు. మంచి మోతుబరివి. మన కుటుంబములకుఁ జిరకాలానుబంధము గలదు. మన యిరువురకును జాలినంత పరిచయము లేకపోయినను మానాయన

గారు సర్వదా నిన్ను గుఱించియే చెప్పుచుండువారు. లోకము పాప భూయిష్ఠమైనది. సాధుజనులు జీవించుటకుఁ దగిన కాలము కాదు. తలలు దీసి తలలు మార్చినవారికే గాని తక్కినవారికిఁ దిండిగూడ దొరకదు. నిన్న మీ బావమఱంది నాచెంత కేదో పనికై వచ్చి నాఁడు. అప్పుడు నీ ప్రసంగము వచ్చినది. హార్బరువారు నిన్నుఁ జాల చిక్కులు పెట్టుచున్నారని చెప్పినాఁడు. అది విన్నప్పటినుండియు నా గుండె జాలివహించి నిన్ను రప్పించినది. నీవంటి సాధువునకుఁ జేసిన యుపకారమే యుపకారము. ఆ సమాచార మంతయుఁ నాకుఁ దెలియఁజెప్పుమా? విందును." అని పలికెను.

వెం—బాబూ! అవును. వారు చదువుకొన్న ప్రభువులు. మే మేమియును దెలియనివారము గదా!

శ్రీ—అవును. అది నే నెఱుఁగుదును. నీవంటి యమాయికులను మోసపుచ్చుటకే వారు చూచుచుందురు. జరిగిన దేదో ముందు చెప్పుము.

వెం—బాబూ! నాకిరువది యెకరముల పంటనేల గలదు. తక్కిన భూములవలె నాది చవుటినేల కాదు. మా కుటుంబమంతయుఁ బిల్ల మేక గలసి పదిహేనుమంది యున్నాము. రాత్రింబవలు దానినే కనిపెట్టుకొని యుండి పని చేసుకొని బ్రదుకుచున్నాము. దానిని మే మమ్మమని గట్టిగాఁ జెప్పినాము. కాని మే మియ్యకపోయినచో బోలీసువారిని దెచ్చి మమ్ములను వెళ్ళగొట్టించి భూమి స్వాధీనము చేసికొందురంట.

శ్రీ—అవును. దొరతనమువారు కోరినప్పు డియ్యమని చెప్ప వలనుపడదు. తక్కిన భూములకంటె నీదానికి ధన మెచ్చుగా నీయ వలసియుండును. నీదాని కెంత యిచ్చెద మన్నారు.

వెం—ఏమున్నది బాబూ! రెండు వేలు.

శ్రీ—(ఆశ్చర్యముతో) ఆఁ, ఏమీ! ఎకరమునకు వంద రూపాయలా యిచ్చెదరు. ఇది చాల ఘోరము ఘోరము. నీ వాసొమ్ము పుచ్చుకొనకుము.

వెం—పుచ్చుకొనక పోయిన సొమ్ముగూడఁ బోవునని కొందఱనుచున్నారు బాబూ!

శ్రీ—భయపడకుము. అట్లన్నవారు తెలివితక్కువ వారు. ఆ సొమ్మెక్కడికిఁ బోవును. ముక్కు నులిమి పుచ్చుకొనఁగలము. దానికేమి? కాని వ్యవహారము నేర్పుతో నడిపినచో నెకరమున కధమపక్షము నాల్గేసివందలు వారిచేఁ గ్రక్కింపవచ్చును.

వెం—(ఆశ్చర్యముతో) నాలుగేసి వందలే?

శ్రీ—కాక మఱేమి?

వెం—ఎవ్వరి భూమికిఁగూడ నంత సొమ్మియ్యలేదు బాబూ!

శ్రీ—వారెవరైనను న్యాయవాదిని బెట్టుకొని వాదించినారా?

వెం—లేదు. బాబూ!

శ్రీ—ఇఁక నేమి? రౌతునుబట్టి గుఱ్ఱము నడుచును. వ్యవహారము నడుపువారిలోనున్నది. నీ భూమికి వారు రెండువేలు గదా యిచ్చెదమన్నారు. దానికే నే నెనిమిదివేల రూపాయ లిప్పించెదను. నాకు బహుమాన మేమిచ్చెదవో చెప్పుము.

వెం—(సంతోషించును) మీకష్టమూరక పోవునా? ఒక వేయి రూపాయి లిచ్చెదను.

శ్రీ—(నవ్వుచు) సరి. సరి. అమాయకుఁడ వగు నీ రూపాయిలు నా కెందుకు? ఊరకే నీ మనస్సెట్టిదో కనుగొన వలెనని యన్నాను. నాకక్కఱలేదు గాని యీ వ్యవహారము నడిపించుటకుఁ గొంతసొమ్ము కావలయును. అది జతపఱచి తెచ్చినఁ జాలును.

వెం—ఎంత సొమ్ముకావలయును బాబూ?

శ్రీ—(ఏవో కొన్ని లెక్కలు వేసి కన్నులుమూసి కొంచె మాలోచించి) అధమపక్ష మయిదు వందలు కావలయును.

వెం—(గుండెబాదుకొనుచు) అమ్మ బాబో! అంతసొమ్మే? నా చేతఁ గాదు బాబూ! నే నెక్కడఁ దేఁగలను?

శ్రీ—నేను మొదటఁ జెప్పితిని గాదా? దీనికి సొమ్ము కర్చగు నని వెనుదీయరాదు. ఇంతకును మనము పెట్టిన కర్చులు మనకుఁ దిరిగి వచ్చును. ఇందు నీకు నష్టమేదీ?

వెం—నే నంత సొమ్మెట్లు తేఁగలను బాబూ!

శ్రీ—అట్లన్న లాభములేదు. ఎట్లో తేవలయును. ముందు కర్చులు లేకుండ దావాయెట్లు? ఇంతయేల నీవు గింజలు చల్లకుండఁ బంటపండునా? అట్లే లాభ మపేక్షించినచో ముందు మదుపుపెట్ట వలెను. ఎనిమిదివేలో పదివేలో వచ్చినప్పుడు మూటఁగట్టుకొనఁ గలవు కాని యిప్పు డయిదువందలు కర్చుపెట్టలేవా? పోని మొక్కటి సేయుము. కర్చులు నేను భరించి దావా గెలిపించెదను. ఆ వచ్చిన మొత్తములో సంగోరు నాకిచ్చెదవా? నీ కిప్పుడు నా రిచ్చెద మన్న రెండువేలకు మఱియొక రెండు వేలిప్పించెదను. నీ వేమియు సొమ్ము తే నక్కఱలేదు. నీవు నిలువఁబడి యుండినఁ జాలును. అందులకు సమ్మతింతువా? సమ్మతించినట్లు నా కొక యుత్తరమిమ్ము-పనియంతయు నడిపించెదను. తరువాత నే నేదో ధన మపహరించితినని యేడువరాదు.

వెం—(ఆశతో) మన కంతసొమ్ము వచ్చునని తమకు నమ్మకమున్నదా?

శ్రీ—వెంకునాయఁడా! నా మాటలు పరిహాసము లనుకొనుచున్నావా! కాదు...శిలాక్షరము లని నమ్ముము. పాపము. నీవమాయకుఁడవు. లోకజ్ఞానము లేనివాఁడవు. నీ వంటి బీదవానికి రావల

సిన సొమ్ము నడుమ నాయుద్యోగి పిశాచము లపహరించుచుండఁ జూచి సహింపలేక నీకు సాయము చేయవలెనని యిట్లు చెప్పుచున్నాను. నాలుగు ముక్కలు చదువుకొన్నందులకు ఫలమేమి? మీ వంటి సాధువుల కుపకారముచేయుటకే యని నమ్మెదను. నీకు సొమ్ము గావలసియున్నచో నేఁ జెప్పినట్లు చేయుము. లేనిచో వారిచ్చినదేదో పుచ్చుకొని యదే పదివేలని సంతసింపుము. కందకు లేని దురద బచ్చలికేల?

వెం.—(ఆలోచించుచు) బాబూ! మొదటనే యంత సొమ్ము గావలయునా?

శ్రీ.—ఓయీ! మీ రమాయికులు. మీ కేమియును దెలియదు. ఏమిచేయవలయునో చెప్పెదనా? నీది పంట భూమియనియు, అది సంవత్సరమునకు రెండువేల రూపాయిల విలువగల పంటపండుచున్నదనియు, దెలియఁ జేయుచు నీ భూములకుఁ బదివేల రూపాయిల విలువగట్టి మొత్తమునకు దావా తేవలయును. ఆ మొత్తమునకుఁ దగిన పత్రములు గొని గ్రంధము నడిపింపవలయును. అందులకై నే నన్ను మొదువందలును గావలయును. అంతకుఁ దక్కువైన లాభము లేదు.

వెం.—(అనుమానించుచు) బాబూ! మీకుఁ దగినంత ధైర్యముండినప్పుడే నన్నిందు లోనికి దింపండి: అంతే కాని నన్ను వ్యర్థముగా గోతులోనికి దింపవద్దు బాబూ!

శ్రీ.—(నవ్వుకొనుచు) చాలు.చాలు.ఆలోచించి యాలోచించి నీ వంటి యమాయికునా గోతిలోనికి దింపుట? ఓయీ! నీ వెంత మాత్రమట్లు భయపడనవసరము లేదు.

వెం.— బాబూ! అట్లయిన సొమ్ము జతపఱిచికొని వచ్చెదను.

శ్రీ—ఎప్పటిలో వచ్చెదవు?

వెం—ఒక నెలలో—

శ్రీ—సరి, సరి. అట్లయిన లాభములేదు. ఈలోపున హార్బరు వారు సొమ్మంతయు గర్చుపెట్టి వేసినచో మనము చేతులు నలుపు కొనుచుఁ గూర్చుండవలయును.

వెం—బాబూ! ఏఁబది లక్షలఁట. అంత వేగముగఁ గర్చ గునా?

శ్రీ—ఓయీ! అట్లనకుము. అధికారులు తలంచిన నెంత సేపు. దినము నాల్గయిదులక్షలకుఁ దక్కువ గాకుండఁ బంచిపెట్టుఁ చున్నారు. అట్లయిన నింతధనము పదిదినములలోఁ బూర్తియగును. మన మాలసించిన లాభములేదు.

వెం—బాబూ! ధాన్యము నూర్చు చున్నాము. తోట మొక్కలు గూడ నాటుకొని వచ్చెదను. అట్లుండ వీలులేదా?

శ్రీ—చెప్పితిని గాదా! రేపు సాయంకాలమున కయిదువంద లును గావలయును, లేనిచోఁ గార్యము మించిపోవును.

వెం—ఇంత వేగముగా నాకు సొమ్ము జతపడదే?

శ్రీ—(ఆలోచించుచు) ఓయీ! నీ యమాయికత్వము చూడ నాకు జాలియగుచున్నది. పోనిమ్ము. నే నప్పిప్పించెదను. పత్రము వ్రాయుదువా:

వెం—వడ్డీ యెట్లు బాబూ?

శ్రీ—మిక్కిలి యవసరమున్నప్పుడు వడ్డీ హెచ్చని యాలో చింపరాదు. రూపాయివడ్డీకిఁ దగ్గదు.

వెం—ఎవ్వరిచ్చెదరు? బాబూ!

శ్రీ—ఎవ్వరో తరువాతఁ జెప్పెదను. తెల్లవాఱు నప్పటికి నీ కొడుకులను గూడఁ దీసికొని రమ్ము.

వెం—చిత్రము బాబూ!

శ్రీ—మఱి నీవు వెళ్లుము. ఉదయమునఁ దప్పక రమ్మని చెప్పి పంపి యతఁడు కొంచెము సేపు దీర్ఘాలోచనపరుఁడయి యుండెను.

౯

"కుటుంబపోషణార్థమై యిదివఱకు దొరకినచోట్ల నెల్లను ఋణము చేసితిని. చేయుటయే కాని దాని దీర్చెడి పద్ధతి నా కలవాటు గాలేదు. అందుచే నొకమా ఱిప్పిచ్చినవారు రెండవమాఱు నా మొగము చూడకున్నారు అప్పిచ్చుట కెవ్వరును నమ్మకున్నారు. అప్పటికిని మొండివాఁడను గాన యెట్లో నలుగురలోఁ దలయెత్తుకొని తిరుగుచున్నాఁడను. మఱియొకఁడైనచో నీ పాటికి సర్వసంగత్యాగము చేసి జందెము త్రెంచి పాఱవైచి యెక్కడికో పోయియుండును. నా వేషభాషలకు భ్రమిసి, నా శాంతవచనములకు సంతసించి ఋణదాతలు నన్ను నిర్బంధింపమానిరి కాని వా రందఱును గలిసి యొక్కమా ఱడిగినచో నా గతి యేమి కావలయును? ఈపాటి గౌర మర్యాద లున్నప్పుడే నేను జాగరూకతతో వర్తించి పిల్లలకు వివాహము లెట్లో చేసిన నింక బాధ వదలిపోవును. మగపిల్లలు విషయమై నా కంత చింతలేదు. కాని యాడుపిల్లల పెండ్లిండ్లకే నాకు భయము గల్గుచున్నది. మన గౌరవమునకుఁ దగని సంబంధముచేయు నా కెంతమాత్ర మిష్టములేదు. మంచిసంబంధమున కాసించినచో సంచులతో ధనము మూటఁగట్టి పెట్టవలెను. ధనవిషయ మాలోచింపనాకుఁ దుదకప్పుపుట్టు వైఖరిగూడఁ గన్పడకున్నది. ఇట్లుండ భగవంతుఁడు నేఁటి కేదోయొక మార్గమును జూపినాఁడు. నేవైచిన పాచిక పాఱినది. వెంకు

నాయఁడు నిజముగా నమాయికుఁడు. నా వాక్యములు శిలాక్షరము లని నమ్మినవాఁడు. తేపు వాఁడు, కొడుకులును వత్తురు. వారిచేత నీ యూరి వారికెవ్వరి కయినను బత్రము వ్రాయించి కర్చుల కనిచెప్పి యా రూపాయిలు నా జేబులో వేసికొన వలయును. ఈ వ్యవహారము గూఢముగా ద్వరితముగాఁ గావలయును. ఇతరు లెవ్వరయినను బసి పట్టినచో వెంకునాయని మనస్సు విఱిచి నా కార్యమునకు భంగము గలిగింతురు. ఈయూర నప్పిచ్చెడివా రెవ్వరు? ఈయూరివర్తకులున్నారు. కాని వారు సామాన్యముగా బ్రరిపత్రములపై నప్పియ్యరు. బంగా రమో, వెండియో, భూమియో వారికిఁ గుదువ యుంచవలయును. ఈ మాటజెప్పినచో వెంకునాయఁడు వెనుకదీయును. ఆపద్ధతి మనకు సరిపడదు. మార్వాడీలు సొమ్మిత్తురేమో, కాని వారికి గొంతుముడి లేదు. నూటికి రెండో మూఁడో రూపాయిలు వడ్డీ కావలెనందురు. ఆరైతు దీని కంగీకరింపఁడు. ఈ మార్గము కూడ మన కనువయినది కాదు. ఇఁక నెట్లయిన, నాలోచించి వెంకునాయనివలె నమాయికుఁ డును నామాటలకు లొంగువాఁడును నగు ఋణదాతనుగూడఁ జూడ వలయును. (అని కొంచెమాలోచించి) ఎటుచూచినను రమణమ్మ తప్ప మఱెవ్వరును గనఁబడరు. ఆమెకు నాయం దధి కాదర గౌరవ ములు గలవు. ఇంతవఱకు నా లోగుట్టా మెదాక వ్యాపించియుండ లేదు. నే నీ యూరఁ బేరొందిన యొక గొప్ప న్యాయవాది నన్ను నమ్మక మామెకుఁ బూర్తిగాఁగలదు. ఈనడుమనే యామెకు హార్బరు వా రిరువదివేల రూపాయిలు చెల్లించియున్నారు. ఆ సొమ్ములోఁ గొంతయిచ్చి భూమిగొన్నను నింకను నామెయొద్ద ధనము నిలువ లేక పోలేదు. నచ్చికబుచ్చిక లాడి యెట్లయినను మన కార్యమచ్చటనే సాధింపవలెను. కాని దానిసోదరుఁడు నరిసిగాఁడు కర్కోటకవుముండ కొడుకు. వానికిఁ దెలిసినచో నీ కార్యమును భంగపఱుచును. కావున

వాఁడులేని సమయమునఁ బోయి కార్యము సాధింపవలెను. ఆ రెండు వందలు చేతిలో వేసికోఁగల్గినచో నిక్కడికి ధన్యుఁడనే. ఇవి పయి కర్చులకుఁ జాలును. ఎట్లో గాలిప్రోవుచేసి వరాలచెట్టిచే నభియోగము తెప్పించితిని. వానికి నాయందు విశ్వాస ముదయింపఁజేసి నయముననో భయముననో నాల్గుబస్తాలనూకలు లాగితిమా, ఇఁక వివాహము నెఱవేఱినట్లె............ఇఁక నొక్క సంశయము. సంబంధము విషయమై మన తంత్రము ఫలించినదో లేదో! ఆలోచింప మన శాఖలో శ్యామలరావింత పచ్చిగలవాఁడు. అట్టిచోటఁ బడినచో పిల్ల సుఖించును. అట్టి సంబంధము సాధారణముగా దొరకదు. రామావధాని యది యాలోచించియే వారడిగి నంత సొమ్మిచ్చుటకు సిద్ధపడినాఁడు. అతని కేమి? ఇంత భూమి బుట్ర యున్నవాఁడు. అతనివలెఁ గట్నమిచ్చుటకు మనకు శక్తిలేదు. లేకపోయినను నేదో యుపాయమున మన పిల్లకా సంబంధమే చేయవలెనని నిశ్చయించియే కదా మన మాధవరావును బంపితిని. వాఁడు వెళ్లినకార్య మేమయినదో! ఈ పాటికి రావలసినది. వాఁడెందుచేత రాలేదో తెలియకున్నది. ఏమయినను నామూఁడు వేలుగాక మఱియొక వేయి రూపాయిలిచ్చెదనని కబురంపినప్పుడు శ్యామలరావు రామావధాని చుట్టఱికమున కంగీకరింపఁడు. శ్యామలరావునకు ధనమే ప్రధానము. నేను రామావధాని యిచ్చు దానికంటె నెక్కువ యిచ్చెదనన్నాను. ఇంతేకాక రామావధాని శుద్ధశ్రోత్రియుఁడు. నేను లౌకికాగ్రేసరుఁడను. రామావధానిభార్య యుపదేశమును బట్టి కుర్చీలు బల్లలు మొదలగు నాగరకతా సూచకవస్తువులతో నిల్లు నింపినను, నుదయాస్తమాన సమయములందుఁ గాఫీ టిఫెను లలవాటుచేసికొన్నను నతఁడు నాగరకుఁ డనిపించుకొనునా? మావంటి లౌకి కావతంసులనుబోలునా? ఈ కారణములచే నాయత్నము విఫలము కాఁగూడ''దని యాలోచిం

చుచుఁ జావడిలో సుఖాసనాసీనుఁడయి నిమీలితలోచనుఁడయి శ్రీనివాసరావు కూర్చుండియుండెను.

అంతట నొకపురుషుఁ డా చావడిలోనికి వచ్చెను. అతని జోడు చప్పుడువలన భగ్నసమాధియై శ్రీనివాసము కన్నులు దెఱచిచూచి మొగమునఁ జిఱునగ వంకురింప "ఏమోయీ! మాధవరావు! వచ్చి యెంతసేపయినది? నీ రాకకే యెదురుచూచుచున్నాను. మనకార్యమేమయినది? కాయా; పండా? అని యత్యాతురుఁడయి పలికెను. ఆవచ్చిన పురుషుఁడు శ్రీనివాసము గుమాస్తా.

"అయ్యా! అద్వితీయ మేధావంతులు తలంచిన కార్యములు విఫలమగునా? కార్యము ఫలించిన" దని మాధవరావనెను.

శ్రీ—(సంతోషముతో) ఓహో! నెఱవేఱినదా? సంతోషము. కాని నీ వట్లు సంగ్రహముగాఁ జెప్పిన నామది తనివిచెందదు. నీవిట నుండి వెళ్లినది మొదలు జరిగినదంతయును బూర్తిగాఁ జెప్పుము.

మా—నిన్న తెల్లవాఱు జామునఁ దమయొద్ద సెలవు పుచ్చుకొని రైలు ఎక్కి అనకాపల్లియొద్ద దిగి యొకబండి గట్టించుకొని తిన్నగా రావూరున కరిగితిని.

శ్రీ—నీవు వెళ్లునప్పటికి రెండు జాములయినది కాఁబోలును.

మా—రమారమి యొంటిగంటయైనది. అప్పుడే శ్యామలరావుగారి కుమారునకు స్నాతక వ్రతాచరణమైనది:

శ్రీ—రావూరులోనా స్నాతకము?

మా—అవును. రామావధాని తమ యింటియొద్దనే స్నాతకము కావలెనని కోరెనఁట. కాని శ్యామలరా వందుల కంగీకరింపక మేము స్నాతక మిక్కడఁ గావించుకొనియే తరలివచ్చెదమని చెప్పి స్నాతకము తన యింటి యొద్దనే జరిపించెను.

శ్రీ—మగపెండ్లి వారందఱును రావూరిలోనే యుండుట మశ

కార్యమునకుఁ గొంత యానుకూల్య మలవడినది.

మా—అట్లని చెప్పలేము. రామావధాని సోదరుఁడు వారి వారి భార్యలు గూడ రావూరులోనే యున్నారు.

శ్రీ—కాఁగల యల్లుని స్నాతకము చూడవచ్చిరి గాఁబోలు.

మా—అవును. అందుచే నేను రామావధానిగారి పక్షము వారు భుజించి స్వగ్రామమునకుఁ బోవునంతవఱకును నే నీప్రసంగ మెవ్వరితోను జెప్పలేదు.

శ్రీ—మంచిపని చేసితివి. హాయుత్తరము శ్యామలరావున కెప్పుడు చూపించితివి?

మా—మాభోజనములయిన పిమ్మట రహస్యముగా శ్యామల రావును మేడమీదకుఁ గొనిపోయి మీరు చెప్పిన మాటలు చెప్పి యుత్తరమిచ్చితిని.

శ్రీ—చూడగానే యతఁ డద్భుతపడియుండవచ్చును.

మా—అవును.నిజముగా నాశ్చర్యచకితుఁడై యొక నిమిషము మౌనియైయుండెను.

శ్రీ—తరువాత.

మా—"శ్రీనివాసరావు చేసెడిపనులన్నియు నిట్టివే! అతనికిఁ గార్యాంతమునఁ గాని మెలకువరాదు. (నన్నుఁజూచి)ఓయీ! చూచి తివా! వివాహమునకు సర్వము సన్నద్ధమయినది. స్నాతకము గూడ నయినది. ఉభయపక్షములవారి బంధుగులును వచ్చియున్నారు. ఈ రాత్రియే శుభముహూర్తము. శుభముహూర్తమునకు వేగముగా రమ్మని పిలిచి యాఁడుపెండ్లివా రిప్పుడే వెళ్ళినారు. నీవును జూచితివి గాదా! ఇట్టి సమయమున నేమి చేయుదును?" అనిపలికెను. అందు లకు నే నతనిఁజూచి "అవును, మీరు చెప్పిన దంతయును సత్యము. కాని మీ కే సంబంధమునం దెక్కు డభిలాషయున్నదో ముందా

మాట చెప్పు" డని నే నతని నడిగితిని.

"శ్రీనివాసరావుగారి సంబంధ మత్యుత్తమమైనది. దానియందున్న యభిలాషము మఱిదేనియందును లేదు. మొదటనే యతఁడింతకట్న మిచ్చునట్లు చెప్పినచో రామావధాని పేరెత్తకయే యుందును. నా కిప్పుడేమి చేయుటకును దోఁచకున్నదని యతఁడుపలికెను.

"తోఁచుట కేమున్నది? సంబంధమా మీకు నచ్చినది. ధనమా వేయిరూపాయిలు హెచ్చుగా వచ్చుచున్నది. కార్యతంత్రమా మీ చేతిలోనున్నది. మీ కెట్లుతోఁచిన నట్లు చేయవచ్చును. మి మ్మడ్డు పెట్టు వారెవ్వ" రని నేనంటిని.

"సత్యమే. కాని యింతవఱకు వచ్చిన కార్యమును జెఱిచినచో నలువురు నన్ను నిందింపక మానుదురా? యని యతఁడనెను.

"నిందించిన నిందింపవచ్చును గాని వేయిరూపాయి లిచ్చువా రెవ్వరయినను గలరా?" యని నేనంటిని.

"అవును. నీమాట సత్యమే. లోకులమాటలకు లెక్కచేయ రాదు. లోకులను మెప్పింపఁదుద కీశ్వరుఁడు కూడ శక్తుఁడు కాఁడు. మన మన స్పష్టపడినచోఁ జాలు" నని యతఁ డనెను.

"అట్లు చేయుటయే ధీరుని లక్షణము. శ్రీనివాసరావుగారి సంబంధమునందు మీ కెక్కుడు గౌరవముగలదు. కాని మీభార్య యుద్దేశ మెట్లుండునో" యని నే నడిగితిని.

"ఆసంబంధమునందు నాభార్య కధికాదరము. మాయుభయులకుఁ గూడ నచ్చినదే" యని యతఁ డనెను.

"అట్లయినఁ గార్యయంత్రపు మర మీచేతిలోనున్నది. ఆ మర మీ రెట్లు త్రిప్పిన నట్లే కార్యయంత్రము నడుచు" నని నే నంటిని.

"ఆమాట సత్యమే కాని వివాహవిధు లారంభించిన పిమ్మటఁ గూడ వివాహమున కంతరాయము కల్పించుట అధర్మమేమో యని

నా సందేహ" మని యతఁ డనెను.

"ఇం దధర్మమున కేమున్నది? వివాహవిధు లారంభమయినను ముఖ్యవిధియగు మంగళసూత్రధారణ మగునంతవఱకును నవి లెక్కింపఁ దగినవి కావు. పాణిగ్రహణవిధి యగునంతవఱకును మన మేమి చేసినను జేయవచ్చును. ఇం దధర్మ మేమియును లే" దని నేను బ్రోత్సాహించితిని. ఈవిధముగ మాకుఁ గొంతవఱకు సంభాషణము జరిగినది.

శ్రీ—తరువాత.

మా—మఱియొక గంటలో వచ్చి యతఁడు నన్నుఁ జూచి "మీ శ్రీనివాసరావు ఉత్తరములో వ్రాసిన ప్రకారము కట్నము విషయమై నడిచినచో వారి సంబంధము చేసికొనుటకు మా యభ్యంతరము లే"దని చెప్పెను.

శ్రీ—నీ వేమన్నావు?

మా—ఉత్తరములో వ్రాసిన ప్రకారము నడుచుట కెంత మాత్రము సందియము లేదంటిని.

శ్రీ—తరువాత.

మా—అతఁ డందుల కంగీకరించెను.

శ్రీ—శ్యామలరావు మఱి తరలి వెళ్ళలేదా యేమి?

మా—వెళ్ళ కేమి?

శ్రీ—వెళ్ళుటలో నతని యుద్దేశ మేమి!

మా—మీకుఁ గల్గిన సందియమే నాకును గల్గి యడిగితిని. అతఁ డందులకు "రామావధాని మన నిమిత్త మెంతో సంభారము సంగ్రహించి యున్నాఁడు. దానిని మన మొకనాఁడయిన ననుభవింపవలదా? కావున నీరాత్రి మనము రామావధాని యింట విందు గుడిచియే మరలి వత్త" మని పలికినాఁడు.

శ్రీ—తరువాత నేమి చేసినారు.

మా.—చేయుట కేమున్నది? రాత్రికి రామయ్యగ్రహార మునకుఁ దఱలి వెళ్ళినారు. రామావధాని యింటఁ దృప్తిగా భుజించి నారు. మహావైభవముతో నూరేగినారు. మంగళస్నానము లయినవి. వధూవరు లొకరికొక రభిముఖముగాఁ గూర్చున్నారు. రామావ ధానియు భార్యయు స్నాతులయి శుభ్రవస్త్రధారులయి కన్యాదాన మొనర్ప సిద్ధపడియున్నారు.

శ్రీ—(ఆశ్చర్యముతో) ఆఁ. కార్యము పూర్తి గావచ్చినదే మఱి యెట్లు విఘ్న మొనర్చితిరి.

మా.—అప్పుడు శ్యామలరావుగారు లేచి తమ కిచ్చెడి వర శుల్కము మూఁడువేలరూపాయిల రొక్కము నిచ్చువఱకును గన్యా దానము వలనుపడదనిరి.

శ్రీ—బాగు. బాగు. శ్యామలరావు మంచి యుపాయమే యోజించినాఁడే. తరువాత నేమయ్యెను?

మా.—ఆ సమయమున నా పల్లెటూరిలో నంత రొక్క మెట్లు జతపడును? ఎవ్వ రెంత చెప్పినను వినక కర్ణాటకలహము పెంచి పెండ్లిపీటపైఁ గూర్చున్న కుమారుని లేవదీసి వెంటనే రావూ రునకు వెడలి వచ్చినారు. ఎట్లయినను గార్యమునకు భంగము గల్గింపఁ బెండ్లిపెద్దయే నడుము గట్టుకొన్నపు డది విఫలమగుటలో నాశ్చర్య మే మున్నది?

శ్రీ—శ్యామలరావు మైరావణునివలె నున్నాఁడే. శుభ ముహూర్తమునకు ముందుగాఁ జెప్పినచో రామావధాని రొక్కము జతపఱచి యుంచునని గ్రహించియే కన్యాదాన సమయమువఱకును శుల్కము విషయమై మాటాడ మానివేసెను. అప్పటి కప్పుడు రామావధాని యంత రొక్కమును జతపఱుపలేఁడనియు నా నెపమునఁ

గార్యమునకు విఘ్నము గల్గింపవచ్చుననియు, శ్యామలరావుయొక్క యుద్దేశము.

మా—అవును. నిశ్చయమే

శ్రీ—తరువాతి సమాచార మేమి?

మా—శ్యామలరావు నన్నుఁ జూచి "ఓయీ! శ్రీనివాస రావుతోఁ వియ్య మందవలెనని యింత చేసినాను. నీవును జూచియే యున్నావు. స్నాతకవ్రత మవలంబించిన వరుఁడు దేశము దాటరాదు. కావున నీ వివాహము రామయ్యగ్రహారములోనే చేయుమని శ్రీనివాసముతోఁ జెప్పుము. మూడురాత్రులు దాటకుండగనే పాణిగ్రహణము కావలెను. వెంటనే వివాహసంభారములను బట్టుకొని యగ్రహారము వచ్చునట్లు చేయుము. అగ్రహారములో నతని కిల్లు వాకిలియు గలవు. అతఁడు వచ్చులోపల నిల్లు బాగుచేయించి పాక పందిరి మొదలగు నేర్పాటులను జేయింతునని చెప్పుము. వెంటనే శ్రీనివాసమును గుటుంబముతో వచ్చునట్లు చేయు'' మని చెప్పెను.

శ్రీ—సరియే. మంచిది. నీ వెట్లయినను గార్యమును సాధించుకొని వచ్చితివి. చాల సంతోషము. నీ వీరాత్రియే బయలుదేరి వెళ్ళి శ్యామలరావునకుఁ దోడ్పడి యిల్లు శుభ్రపఱిచి పందిరి పాక వేయించి సిద్ధముగా నుండుము.

మా—పెండ్లి జరుగుట నిశ్చయమన్నమాటయే. కాని నాల్గు వేలు కట్న మిచ్చెదనని వ్రాసినారు. సొమ్ము జతపఱిచినారా?

శ్రీ—ఓయీ! మన వ్యవహార మంతయుఁ దెలిసియు నిట్లు మాట్లాడెద వేమి? మన కప్పయినను బుట్టదుగదా?

మా—మఱి కట్న మెట్లిచ్చెదరు?

శ్రీ—పెండ్లికొడుకునకుఁ బెండ్లికూతురే కట్నము.

మా—రొక్కమిచ్చినఁగాని వారు మీపిల్లను జేసికొనరేమో?

శ్రీ—చేసికొనక యేమి చేయుదురు? శ్యామలరావు కొడుకు నకు స్నాతకవ్రతమయినది. మూఁడు రాత్రులు వెళ్ళకుండ వివాహాము గావలెను. ఇప్పటి కొకరాత్రి గడచియేపోయినది. అందుచే నిప్పుడు మనకంటె వారికే యవసరము హెచ్చయినది. ఈ చుట్టు పట్ల మన సంబంధమును మించినది మఱియొకటిలేదు. అందుచేవారు మనము చెప్పినట్లు సమ్మతింపకమానరు.

మా—అట్లయిన నాల్గువేలు కట్న మిచ్చెదనని వార్త పంపినారే?

శ్రీ—అవును. అట్లయినఁగాని లుబ్ధాగ్రేసరుఁడగు శ్యామల రావు నిశ్చయించుకొన్న సంబంధము వదలి మన వంకకుఁ దిరుగఁడు.

మా—అక్కడవలెనే రొక్కమిచ్చిన గాని కన్యాదానము వలను పడదందు రేమో.

శ్రీ—అట్లనలేరు. చెప్పితినిగాదా? మనకంటె వారికే మిక్కిలి యవసరము సంభవించినదని. కన్యాదాన సమయమువఱకు మన మూరకుండి యప్పుడు వారు శుల్క మడిగినచో "అయ్యా! వివాహ మాకస్మికముగా సంభవించుటచే రొక్కము జత పడినదికాదు. రెండు దినములలోఁ బూర్తి చేయుదు"మని చెప్పుదును.

మా—వా రంగీకరింతురా?

శ్రీ—అంగీకరింతురు. ఏమన, ఇదివఱ కొకచోట నిదే విధ మున జరుగుటయు, కార్యభంగ మొనర్చి వెడలిపోవుటయు సంభ వించినది. నే డిక్కడఁకూడ నట్లే చేసినచో శ్యామలరావు పేచీల కోరని నిందింతురని భయపడి మనము చెప్పిన ట్లంగీకరింపకమానఁడు. అప్పటికిని మొండివాఁడయి వెడలినచో శ్యామలరావు తన కొడుకు నకుఁ ద్వరలో వివాహము చేయవలదా! మఱియొక సంబంధ మంత త్వరగా నెట్లు జతపడును? ఈ యంశములు చక్కగా నాలోచించియే

శ్యామలరావున కవ్యవధిగా వార్త పంపితిని.

మా.—ఇంతవఱకు మీ రుపేక్షించుటకుఁ గారణ మిదియా? అట్లయిన శ్యామలరావు కొడుకునకు కట్నము కానుక లేదన్న మాటయే.

శ్రీ.—లేదనే యనవద్దు. కార్య మగునంతవఱకు నున్నదనియే యందము.

మా.—వరశుల్క మీయకుండుటకు మంచి తంత్రమే పన్నినారే!

శ్రీ.—ఒక్క వరశుల్కము లేకపోవుటయే కాదు. మగపెండ్లి వారికిఁ దెగనీల్గులు హెచ్చు. బాగుగాఁ గాచినగాని లోహములు చెప్పినట్లు లొంగవు. అట్లే మగపెండ్లివారిని దగిన త్రిప్పులఁ బెట్టక పోయినఁ బాకమునకు రారు. ఇప్పు డేమగునో తెలిసినదా? వివాహ మాకస్మికముగా సంభవించుటచే సంభారములు చక్కఁబెట్టుకొనుట కవకాశము లేకపోయినదని మంచిమాటలు చెప్పి మగపెండ్లివారి కప్పడములు, ఒడియములు, మిఠాయిలు, ఫలాహారములు మొదలగు నవి సున్న చుట్టవచ్చును. మనము పంపిన వార్త యొక్క శ్యామల రావునకుఁ దప్ప నితరులకుఁ దెలియదు. తన కుట్ర బయలుపడునని యతఁ డీసంగతి యితరులతోఁ జెప్పలేఁడు. అందుచేఁ బరుల కందఱ కును శ్యామలరావే ప్రయత్నించి శ్రీనివాసము కూతును దన కొడు కున కిమ్మని యడిగి పెండ్లి చేయుచున్నాఁడని తట్టకమానదు. అందు వలన మనల నెవ్వరును నిందింపలేరు.

మా.—సరియే. కాని మన మిట్లు చేయుట తరువాతఁ జిక్కు లకుఁ గారణ మగునేమో?

శ్రీ.—ఎవ్వరి కా చిక్కులు. బుద్ధిహీనులకు. తరువాతమాట చూచుకొందము. కాని నీ వొక్కమాటు వెళ్ళి మా రమణమ్మప్ప

యేమి చేయుచున్నదో చూచి రమ్ము.

మా—ఇప్పు డామె యవసర మే మున్నది?

శ్రీ—ఇప్పుడే యామెయవసరము. కట్నముమాట యెట్లయి నను బెండ్లి కర్చున కయిన సొమ్ము వలదా?

మా—కట్నము విషయమై మగపెండ్లివారి కంట దుమ్ము గొట్టినట్లు పెండ్లికర్చుల కయి యీామె కంటిలో దుమ్ముగొట్టి యేమయిన లాగుదురా యేమి?

శ్రీ—లేకున్న మావంటివారు బ్రదుకుట యెట్లు? వెళ్ళుము. వేగముగాఁ బోయి యామె యేమి చేయుచున్నదో చూచి రమ్ము. ఈ సాయంకాలమే బయలుదేరి నీవు రామయ్యగ్రహారమునకు వెళ్ల వలెను సుమా.

## ౬

హార్బరు విశాఖపట్టణములోఁ బెక్కండ్రను ధనవంతులనుగా నొనర్చినది. దేశమునకు దాని యుపయోగానుపయోగములును లాభాలాభములును, నెప్పు డెటులుండ నున్నను, ముందుగాఁ దదీయ లాభము గన్నవారు విశాఖపురివారు. కాని యీలాభము వారి కెంతవఱకు సుభోదర్క మగునో చెప్పఁజాలము. లోకములో సామాన్యముగా భూములు మిక్కిలి సారవంతము లయినచో నను కొన్నంతకంటెను హెచ్చుగా ధాన్యాదులు ఫలించును. కాని యీ విశాఖపురిభూము లూషరక్షేత్రములయినను, ననుకొన్నంత కంటెను, కాదు. స్వప్నమునం దెన్నఁడును దలంచుకొన ననువుపడని యంత కంటెను నెక్కుడుగా ధనమును బండించినవి. సారవత్తరమగు నొక

భూమిని గాంచి "ఇది భూమిగాదు బంగార"మని దాని యుత్కృష్టతను దెలుపఁ బెద్ద లనుచుందురు. అది యతిశయోక్తిగా భావింప వలసియుండును. కాని యిప్పు డది సార్థక మయినదని చెప్పవచ్చును. ఇట్లు హఠాత్పరుమూలముగా ధన సంపన్నము లయినవానిలో విశ్వనాధరావుగారి కుటుంబ మొకటి.

విశ్వనాధరావు మొదటనుండియు బీదవాఁడుగానే యుండెను. తండ్రితాత లార్జించిన ధన సంపదలు నిరావరణ ప్రదేశమునం దుంచిన కప్పురమువలెఁ దెలియకుండఁగనే వ్యయ మగుటచేఁ విశ్వనాధరావునికిక నన్నవస్త్రాదులకు లోపము కల్గునేమోయని భయపడ వలసిన సమయము వచ్చెను కాని యీ ధనవర్షమువలన నతని దారిద్ర్య సంతాపము యథాయథలై పోయెను. అయినను బాప మతఁడాధనము ననుభవించుచుఁ బట్టుమని పది సంవత్సరములపాటు సుఖించు సదృష్టవంతుఁడు కాకపోయెను. ధనసంపద లబ్బిన కొంత కాలములోనే యతఁడు దుస్సహ రోగపీడితుఁడై పరలోక గతుఁడయ్యెను. అతనికిఁ బుత్త్రిలు గలరు కాని వారు తమ వ్యవహారములు చక్కపెట్టుకొన గల్గినంత యర్హత గలవారు కారు. ఆ కారణమున నతని భార్యయగు రమణమ్మయే సకల వ్యవహార భారమును భరించి యుండెను. బీదతనమునఁ గల్గిన విశేష ధనలాభ మెట్టివారి నైనను మిట్టిపడఁజేయకమానదు; తలకుఁ దగని మార్గమునఁ బ్రవర్తింపఁ జేయక మానదు. కాని యది రమణమ్మవిషయమై యట్లు కాలేదు. ఆమె లక్ష్మీకటాక్ష వీక్షణములకుఁ బాత్రురా లయినను, గృహకృత్యములను స్వయముగానే నెఱవేర్చుకొనుచు, దేవతాభక్తి విదూరురాలు గాక గతించినపతినే హృదయపీఠమున నిలిపి పూజించు కొనుచు నుండెను. ఆమె స్నానముచేసి, దేవతాపూజా గృహమునకు ముందుగా వాకిటను గూర్చుండి మహాలక్ష్మి సింహాసనమును గంగ

గిండీలను శుభ్రపఱచుచుండెను. ఆ సమయమున శ్రీనివాసరావచ్చ టికి వచ్చెను. అతనిఁ జూచి రమణమ్మ ససంభ్రమయై చటాలున లేచి చేతులు దోలఁచుకొని యొకపీటఁ దెచ్చివేసి “రా! అన్నయ్యా! కూర్చుండుము. చాలా కాలమునకు వచ్చితివి. వింత లేమియు లేవు గదా! వదినెయుఁ బిల్లలును బాగున్నారా?” యని కుశల మడిగిన తన యద్వితీయప్రేమను వెల్లడించెను. శ్రీనివాసరావు మందహాసము తోనే వాని కన్నింటికిని బ్రత్యుత్తర మిచ్చుచు నా పీటపై గూర్చుం డెను.

ర—అన్నయ్యా! ఈయేడు పిల్లదానికిఁ బెండ్లి చేయుదువా?

శ్రీ—చేయవలెనమ్మా!

ర—సంబంధము కుదిరినదా?

శ్రీ—కుదిరినది.

ర—(ఆనందమును సూచించుచు) ఆఁ, ఏమీ! మా వదినె చెప్పినదే కాదు. చూచితివా? ఎవరి దా సంబంధము?

శ్రీ—శ్యామసుందరరావుగారిది.

ర—(చేతిపని విడిచి యాశ్చర్యముతో) అదేమి? అన్నయ్యా! అట్లనుచున్నావు. మన యవధాన్లన్నయ్య కుమార్తెను వారు చేసి కొనలేదా యేమి? నిన్న పెండ్లియని విన్నానే. శ్యామసుందరునికి మఱియొక కొడుకున్నాడా?

శ్రీ—లేఁడు. ఆతని కొక్కఁడే కొడుకు.

ర— ఆ సంబంధము తప్పిపోయినదా ఏమి?

శ్రీ—అవును. కట్నమువిషయమై తగవుపడి వా రా సంబంధ మును వదలుకొన్నారఁట!

ర—ఎవ్వరు? శ్యామసుందరరావుగారా?

శ్రీ—అవును.

ర—(ఆశ్చర్యముతో) ఇంతకును దైవఘటన భగవంతుఁడే స్త్రీ నేపురుషునకు గూర్చ నెంచెనో! మన మెఱుఁగము.

శ్రీ—సత్యము. మన ప్రయత్న మేమియు సాగదు. అంత వఱకును వచ్చిన పెండ్లి విఘ్నమగుట యెక్కడను జూడలేదు.

ర—ఏ దుర్మార్గులో పుణ్యము గట్టుకొన్నారు. ఇట్టివానిని నవ్వుచుఁ జేసి యేడ్చుచు ననుభవింతురు. పాపము మన యన్నయ్య ప్రాణ మెంత చివుక్కుమన్నదో కదా!

శ్రీ—(తనలో) ఈముండ మెట్టుశాపములు పెట్టుచున్నదే? ఇదంతయు మన ప్రభావమని యెఱుఁగదు కాఁబోలును. అయిన నింతమాత్రమునకు జంకేల? (ప్రకాశముగా) అమ్మాయీ! సత్యము. నిజముగా రామావధాని మంచివాఁడు.

ర—అన్నయ్యా! నీ వది విని యూరకుండుట మంచిది కాదు. శ్యామసుందరు నెట్లో చీవాట్లుపెట్టి కార్యమును సంఘటించుట నీవంటివానికిఁ దగును.

శ్రీ—అవునమ్మా! మొన్న రాత్రి, నిన్న పగలు గుండ కొట్టి కొట్టి వదలితిని. ఏమి చేయుదును? శ్యామసుందరుఁడు వారి సంబంధము చేసికొనననని భీష్మించుకొని కూర్చున్నాఁడు.

ర—అతఁ డంత పట్టుదలతో మన యన్నయ్య నట్లు పరాభవించినందులకు మీ రతనికిఁ దగిన శిక్ష చేయవలసినది.

శ్రీ—ఏమి చేయఁగలము?

ర—నీవు వారి సంబంధమునకు సమ్మతింపక కులమర్యాదలను బట్టి వెలివేయవలెను.

శ్రీ—(నవ్వుచు) అమ్మా! మన సంఘములో నంత కట్టుబాటెక్కడ? మనము మన పిల్ల నియ్యకపోయిన మఱియొకరు తమ పిల్ల నిచ్చుటకు సిద్ధముగా నున్నారు. శ్యామసుందరుని కొడుకునకుఁ

బెండ్లియే కాదా?

ర—కాకుండునట్లు చేయవలయును.

శ్రీ—మనలోఁ గట్టుబాటు లేదు. మన ప్రాంతమున వర శుల్కము లిట్లు పెచ్చుపెరిగిపోవుటకు హేతు వెవ్వరో తెలిసినదా? మన రామావధాని. కొంచెము పచ్చియున్న సంబంధ మున్నఁ జాలును, అతఁడు భార్య ప్రోత్సాహముచే నొక రిచ్చు కట్నము కంటె హెచ్చిచ్చెదనని పల్కి వివాహములు చేయుచున్నాఁడు. అతఁడు స్థితిమంతుఁడు గనుక సరిపోయినది. కాని తక్కినవారిగతి యేమి కావలెను. వారికి మంచి సంబంధము లభింపనే లభింపదు. వా రొకవేళ వెళ్లి తమ పిల్లను జేసికొండని చెప్పగా మగపెండ్లివారు బిఱ్ఱబిగిసికొని కూర్చుందురు. ఇంతకును రామావధాని కారకుఁడు.

ర—పాప మతఁ డేమి చేసినాఁడు? మంచి సంబంధమయిన చోఁ బిల్లది సుఖపడునుగదా యని యతఁ డట్లు చేసియుండును.

శ్రీ—పిల్లది సుఖపడునని యిల్లు గుల్లచేసికొని యల్లునికి దార వోసినచో నీకఁ దక్కినవా రేమి కావలయును?

ర—(నవ్వుచు) నీ కేమి? అన్నయ్యా! నీవు నెలకు వేలకు వే లార్జించుచున్నావు. నీ కిది యొక లెక్కా? మావంటి సంసారుల మాట చెప్పవలెను.

శ్రీ—(తనలో) ఈమె మాయింటి వైభవమును మా వైభవమును జూచి నెలకు వేనవేలు రాఁబడి గలదని యనుకొనుచున్నది. అంతియకాని లోపలి గుట్టెఱుఁగదు. అదియు మనకు మంచిదే? (ప్రకాశముగా) అమ్మాయీ! నీ వన్నది సత్యమే. సొమ్మునకై నే ననలేదు. ఒక్కకేసులో వచ్చినది నాది కాదనినఁ జాలును. నామాట చెప్పలేదు. ఆడుపిల్లలు గల సామాన్య సంసారుల మాట చెప్పుచున్నాను. వారల కెంత కష్టమో యోజింపుము.

ర—(నవ్వుచు) నీ కంద ఱాఁడుపిల్లలే కావున నిట్లు సదయ హృదయుఁడవై మాట్లాడుచున్నావు. నీకే యొక కుమారుఁ డుండి, వాఁ డే పట్టపరీక్షకో చదువుచున్నచో, నీ వెన్నివేలు కట్నము తెమ్మందువో? ఎవ్వరు చెప్పఁగలరు? ఇది లోకపరిపాటి యై పోయినది.

శ్రీ—ఎవ్వ రేమన్నను నేను మాత్ర మట్టివాఁడను కాను. వరశుల్కములను ఖండించువాఁడనని పూర్తిగా నమ్ముము.

ర—శ్యామసుందరరావు కూడ వరశుల్కములు కూడదని సభలలో దీర్ఘోపన్యాసము లిచ్చినవాఁడే కాఁడా?

శ్రీ—అవును. అతనికిఁ గట్నమున్న నిష్టమే లేదఁట! అదం తయు నతని భార్య పట్టుదలయఁట!

ర—(నవ్వుచు) ఇట్టి వన్నియు నెత్తిపైఁ బెట్టి పులుముట కింటిలో నాఁడువాం డ్రున్నారు. లేనిచో సభలలో నిట్టి గంభీరోప న్యాసము లిచ్చు నయ్యల పస బట్టబయలగును. నిజముగా వరశుల్కమే యక్కఱలేదని శ్యామసుందరరావు గట్టిగాఁ జెప్పిన భార్య యేమి చేయఁగలదు?

శ్రీ—అవును. సత్యమే. వివాహాదికార్యములపట్ల నాఁడుది మెత్తనిదైనప్పుడు మగవాఁడును, మగవాఁ డట్లయినప్పు డాఁడుదియుఁ బట్టుదల వహించుట సహజము. ఎవ రేమి యడిగి పుచ్చుకొన్నను మూఁడువేలరూపాయీలు. ఇం దేమి గొప్ప? ఇంతకు నవి వయికిఁ బోవునవియు కావు. తన కూతురు నల్లుఁడు ననుభవింపవలసినవి.

ర—సా మ్మనిన నంత లక్ష్యము లేనివాఁడవు కావున నిట్టి శ్రీరంగనీతులు చెప్పుచున్నావు. సాధారణ సంసారులో?

శ్రీ—అమ్మాయీ! లోకములో నందఱును ధనవంతులే యున్నారా? ఇంత శుల్కము కావలెనని భీష్మించుకొని యున్న

వారే యుందురా! ఏదో యంతకుఁ దగిన బొంత దొరకక మానునా? ఈ ప్రసంగమున కేమి గాని నీచెంత కొక పనికై వచ్చితిని.

ర—(చిఱునవ్వుతో) ఏమిపని? అన్నయ్యా! నావలన నగు పని యేది?

శ్రీ—ఏమియును లేదు. లెక్క యనసరము వచ్చినది.

ర—నీకా?

శ్రీ—అయ్యో! నా కెందులకమ్మా నే నొకరికిప్పిచ్చువాఁడనే కాని శ్రీరాములు చుట్టి యొకరియొద్దను దెచ్చువాఁడను కాను. నా పద్ధతి నీ కంకను బూర్తిగాఁ దెలియదేమో!

ర—అన్నయ్యా! నామాట తప్పు పట్టుకొనకు. అవ్యవధిగా వివాహము కుదురుటచే సొమ్మవసరమేమో యని యన్నాను. మ రెవ్వరికిఁ గావలెను?

శ్రీ—వెంకునాయఁడను నొక రయితునకు.

ర—ఎంత కావలయును?

శ్రీ—ఏడువందలు.

ర—పద్దుపై నంత సొమ్మిచ్చిన భయము లేదుగదా?

శ్రీ—భయమా! అ దెప్పుడును లేదు. అతని కేడువందలు గాదు ఏడువే లిచ్చినను భయము లేదు. అర్ధరాత్రమప్పుడు వెళ్ళి తలుపు గ్రుద్దినచో మన సొమ్ము మనకుఁ బాఱవేయును. అట్టి మోతుబరు కానిచో నతని కిప్పిమ్మని నేను జెప్పుదునా? అతనికి నేనే బదు లిత్తును. కాని మా పార్టీలకు నే నప్పిచ్చుట వ్యవహార ధర్మము కాదు.

ర—వడ్డీ యెట్లన్నయ్యా!

శ్రీ—(తనలో) అసలు వచ్చినప్పుడుగదా వడ్డీ. (ప్రకాశముగా) నీయిష్ట మెట్లో యట్లే కానీ!

ర—మొన్నటిది వడ్డీ తక్కువ. రూపాయివడ్డీని వ్రాయింపుము. మా కింతకంటె నితరాధారము లేదుగదా?

శ్రీ—అవును. సత్యమే అట్లే కానీవమ్మా!

ర—మొన్నటి మైదు వందలకును బద్దు వ్రాయించినావా?

శ్రీ—(నొచ్చుకొనుచు) ఆఁ. ఏమీ! దానికి సంబంధించిన నోటు నీకుఁ జేరనేలేదా! ఆగుమాస్తా గాడెద నేమి చేసినను బాపము లేదమ్మా! ఆవేళ నా సొంతపనిగూడ మాన్పించి యణాబిళ్ళ నిచ్చి నీ కతనిచే నోటు వ్రాయింపుమని పంపితిని. వాఁడు వ్రాయించి తెచ్చి నీ కియ్యనేలేదా? వాని పని పట్టింతు నుండుము.

ర—పనితొందరచే వ్రాయింపలేదేమో! నీవు మధ్యవర్తివయి యుండఁగా నాకు భయమేమి?

శ్రీ—(గంభీర స్వరముతో) అదేమిటమ్మా! వేయి పను లుండుఁగాక. ముందువెనుక లాలోచించుకొనవలదా? ఒకరిచే నని పించుకొనుటగాని యడిగించుకొనుటగాని నాకుఁ బనికిరాదు. వెనుకటి దానికిని, దీనికిని గూడఁ బ్రత్యేకముగా నోట్లు వ్రాయించి పంపెదను లెమ్మా.

ర—అట్లే కానిమ్మా. ఇంతలో భయమేమి?

అని లోపలి కరిగి సొమ్ము తెచ్చి యతని కందించెను.

శ్రీనివాసరావు—"ఒహో! అన్నియు నూఱు రూపాయల నోట్లే. లెక్కించుకొనుటకుఁ జాలసులభము." అని పుచ్చుకొని వానిని జేబులో పెట్టుకొనెను.

ర—అన్నయ్యా! జేబులోఁ బెట్టుచున్నావు. ప్రమాదము సుమా?

శ్రీనివాసరావు—"భయము లేదమ్మా! నా జేబులోఁ బడ్డది పయికిఁ బోవుటయే!" అని యామె యనుమతి నింటికి వచ్చెను.

# ౭

సాయంసమయమున శ్రీనివాసరావు సుఖాసనాసీనుఁడయి చల్లగాలి ననుభవించుచుండెను. అప్పుడు వెంకునాయఁడచ్చటికి వచ్చు చుండెను. శ్రీనివాస మతనిని జూచి తనలో “కచ్చేరిలో నీ ముదుసలి ముండకొడుకుఁ బిశాచమువలెఁ బీకుకొని తిన్నాఁడు. అది చాలక మరల నిచ్చటికి వచ్చుచున్నాఁడు. వీని నచ్చటఁ గసరి యెట్లో విడిపించుకొన్నాను. ఇక్కడ వీడు నన్ను సామాన్యముగా వదలఁడు. అయినను వీని నిట మంచి మాటలాడి నచ్చఁజెప్పి పంపివేయవలెను. అంతియకాని విపరీతములాడినచో వీఁడిప్పుడే నడివీధిఁబడి నాపరువు దీయు”నని యనుకొనుచుండ నాయఁడు వచ్చి నమస్కరించి చేతులు జోడించి నిలువఁబడెను.

శ్రీ—(చిఱునవ్వుతో) ఓయీ! వచ్చితివా? రా, కూర్చుండుము. కచ్చేరిలో నిన్నుఁ గసరి కొట్టితినని చిన్నపుచ్చుకొనకుము. మీరు వట్టి యమాయకులు. లౌక్యధర్మము లెట్లుండునో మీకుఁ దెలియదు. ఎవ్వరిచెంత నెప్పుడేరీతిగా మాటాడవలయునో మీరెఱుఁగరు. ఆ నలువుర వకీళ్ళయెదుటను నీ వొకదాని కొకటి చెప్పి మన యత్నమెక్కడ విఫలము చేయుదువోయని నాకంత కోపము వచ్చినది. వ్యవహారములు రహస్యముగా సాగింపనిచో నెవ్వరయినను గిట్టని దురాత్ములేదో విధమున నంతరాయము కల్పింపకమానరు. మనము మంచివారమని లోకమంద ఱట్లే యుండరు. తమ కనవసర మయినను జోక్యము కల్గించుకొని కార్యము చెఱుతురు. అప్పుడు నీవు నాపయిఁ బడి యేడ్తువు. అందులకని నిన్నచట నెంత మందలించినను నీవు గ్రహింపలేకపోయితివి. కసరితినైనను నా ప్రసంగము

మాన్పింపనిచో నీకుఁ గార్యము చెడునని కసరితిని. అంతియకాని మఱియొకటికాదు. నీ వడుగఁదలచిన దేదో యిప్పు డడ్డుగుము. నీకు మఱెట్టి భయమును లేదు.

వెం—చిత్తము. బాబూ! ఎఱుఁగనివాఁడము గాదా! ఎక్కడ నెట్లు మాటాడవలయునో మా కేమి తెలియును? గుమస్తాగారు మాచేత నేనువందల రూపాయలకు నోటు వ్రుట్టించుకొన్నారు. మీరు నాతోఁ నయిదువందలని సెల విచ్చినారు. మరల నిప్పు డెక్కువగా నెందులకుఁ బుచ్చుకొనవలసి వచ్చినదో యని యా సొమ్మంతయుఁ దమకుఁ జేరినదో లేదో యని తెలిసికొనవలెనని కచ్చేరీకి వచ్చినాను.

శ్రీ—ఓహో! అదియా! నీ సందేహము. సొమ్మంతయు నాకుఁ జేరినది. గుమస్తా యేదో మాయ చేసెనని తలంచియుందువు. నీవు కేవల మమాయికుఁడవు. అందుచే నట్లు సంశయించుట న్యాయమే. కాని మా గుమాస్తా కాదు, తుదకు మాయింటి దాసియైనను గపటము చేయునని నమ్మకుము. ఒకవేళ నట్లు చేసినచో వారిని మారణహోమము చేయకుండ వదలువాఁడను కాను. నే నన్నచో మా యింటివా రందఱును గడగడ వడఁకిపోవుదురు. మఱి వెళ్లుము. సొమ్మునకు భయములేదు.

వెం—బాబూ! దావాకర్చు లయిదువందలకంటె నెక్కువ కావన్నారే! తక్కిన రెండువంద ..............

శ్రీ—అదియా నీ సంశయము? మొత్త మయిదు వందలును జాలునని మదింపు వేసితిని. కాని చాలకపోయిన నేమి చేయగలము? మనము మరల నెవ్వరినో బతిమాలవలసి వచ్చును. అందుచే నెందుల కయినను మంచిదని తక్కిన రెండువందలు కూడఁ దెచ్చితిని. అవన్నియు జిత్తాలో వ్రాసికొన్నాము. మిగిలినది నీకే యిచ్చి

వేయుదుము.

వెం—బాబూ! సొమ్ము మా పెట్టెలోనున్న యెంతో మీ చెంత నున్నను నంతే. ఆ భయము నాకు లేదు. కాని ప్రస్తుతము మిక్కిలి యవసరము వచ్చినది. ఆ పయిరెండువందలును నాకిప్పింపుఁడు. వర్షము కురిసినది. ఎడ్లను............

శ్రీ—ఇఁక అందులోని విద్య్యా వలనుపడదే!

వెం—బాబూ! ముందుగా నీ యయిదు వందలును గర్చు పెట్టండి. ఇంతలో సొమ్ము జతపఱిచి తెచ్చి మీ కిచ్చెదను.

శ్రీ—ఓయీ! అట్లు చేయ వీలులేదు. లేనిచో నీసొమ్ము నీ కిచ్చుటలో నభ్యంతర మేమి?

వెం—బాబూ! అట్లనవద్దు. నా యవసరము తీర్చండి. అన్న దానికంటె మఱి రెండువంద లెక్కువ పుచ్చుకొని నా గొంతుకుఁ గోయకండి బాబూ!

శ్రీ—ఓయీ! ఇందు గొంతుక గోయ నేమున్నది? దావా గెలిపించినచో నాకు రెండు వంద లిచ్చెదనంటివా లేదా?

వెం—గెలిపించిన పిమ్మట నట్లే చేయుదును.

శ్రీ—గెలుపున కేమున్నది? శ్రీనివాసము చేతిలోఁ బడిన దావా గెలువకపోవుటయే. ఆ సందియము నీ కెప్పుడును వలదు.

వెం—సందియము నా కెప్పుడును లేదు. ఉన్నచో నన్ని రూపాయలును మీ కెందు కిత్తును? అయిదువందలును దీసికొని తక్కినవి నా కిండు. మిక్కిలి యవసరము వచ్చినది.

శ్రీ—నాకును నట్టి గట్టియవసర ముండియే తీసికొన్నాను. అదియైనను నా కష్టమునకుఁ దగినది మాత్రమే తీసికొన్నాను. రేపు వేలకొలఁది ధనము చేతిలోఁ బడినప్పుడు మే మగపడుదుమా?

వెం—అమ్మ! ఎంతమాట సెల విచ్చినారు? బాబూ!

అప్పుడు మఱి రెండువంద లదనముగాఁ బుచ్చుకొండి.

శ్రీ—అప్పు డవి యెట్లును దప్పదు.

వెం—అప్పుడును, ఇప్పుడును గూడఁ బుచ్చుకొందురా?

శ్రీ—ఎన్నిమాఱులు పుచ్చుకొన్నను నాల్గువందలే కాదా? అయిదాఱువందలు చేతిలోఁ బెట్టి తగిలివేయఁబడిన నీ కయిదాఱు వేలిప్పించుచున్నప్పుడు నేను నాల్గువందలు తిన నోచుకొనలేదా?

వెం—పోనిండు. పిమ్మట నా నాల్గువందలును దీసికొందురు గాని యీ రెండువందలును నా కిప్పు డివ్వండి. మీ పాదాలు పట్టుకొందును. కటాక్షింపుఁడు.

శ్రీ—నాకుఁ గూడ నట్టి యవసర ముండుటచేతనే ముందుగాఁ బుచ్చుకొన్నాను. లేనిచో నీ వన్నట్లే చేయుదును.

వెం—బాబూ! మీ కేమి? ధనవంతులు. ఎట్లయినను సొమ్ము జతపఱుచుకొందురు. నా యవసరము కనిపెట్టుఁడు.

శ్రీ—ఓయీ! నీవు బతిమాలిన లాభము లేదు. అమాయి కుఁడవగు నీయందు దయఁదలచి యింత కష్టపడుచుండ నీ వది యెఱుఁగఁజాలవు. నీ సొమ్ము నే నపహరించితినని తలంపకుము. ఇదిగో నీవు వ్రాసిన నోటు. (అని జేబులోని యొక కాగితము తీసి బల్లపై గొట్టి) ఇదిగో యిప్పుడే చింపి పాఱవైచెదను. నీవు నాకు సొమ్మియ్య నవసరమును లేదు. నేను నీ దావాను గెలిపింప నవసర మును లేదు. వెళ్లు వెళ్ళు. కందకులేని దురద బచ్చలికేల? కష్టపడి వేలకొలఁది సొమ్ము తెచ్చి నీ యొడిలోఁ బోయకపోయిన నా కేమి? వెళ్ళు వెళ్ళు.

వెం—(చేతులు జోడించి) బాబూ! కోపము వద్దు మీరు తండ్రులు. మేము పిల్లలము. మీ రంత యాగ్రహించిన మేము మాటాడఁగలమా?

శ్రీ—ఓయీ! నీమీఁద నాకుఁ గోప మెందులకు? ఒకవేళ వచ్చినను నీకుఁ బోవున దేమి? ఎట్లయినను నిది మంచికాలము కాదు. నిన్ను నిర్బంధించి సొమ్ము లేదనిన నప్పిప్పించి నీచేత దావా తెప్పింపకపోయిన నాకేఁ గల్గెడు నష్ట మేమి? నీ దురదృష్ట మిట్లుండ నే నేమి చేయుదును? సొమ్ము. ఈ నోటు చింపి పాఱవేయుదును.

వెం—బాబూ! మీరు రక్షింపకపోయిన మాకు దిక్కేది? తెలియక పలికితిని. మన్నించి కాపాడవలెను బాబూ!

శ్రీ—బాబూ లేదు, గీబూ లేదు. ఆ సొమ్మంతయు నా యొడిలోఁ బోసినట్లు మాటాడుచుండ నెవ్వరు సహింపఁగలరు? ఆ దిక్కుమాలిన సొమ్మెవరికిఁ గావలెనోయి! పాడుముండ, పాకేది గడించును. మాకు గౌరవమే ప్రధానముకాని డబ్బుకాదు.

వెం—బాబూ! తెలియక పలికితిని. క్షమించి నా దావాను గెలిపింపుఁడు. నే నిట్లన్నానని కోపించి నా కార్యమునకు భంగము చేయకుఁడు.

శ్రీ—(కొంచెము శాంతించినట్లగపడి) అట్లెప్పుడును జేయము. చేసిన పని గట్టిగాఁ జేసి తీఱుదుము. మాపట్టిన దావా పోయిన మాకు లాఘవము కాదా! ఇఁక నా భార మంతయు మా పయి పెట్టుము.

వెం—చిత్తము. చిత్తము. వెంటనే దావా దాఖలు చేయవలెను బాబూ!

శ్రీ—అది నీవు చెప్పవలయునా?

వెం—(దండము పెట్టి) సెలవు బాబూ!

శ్రీ—మంచిది. వెళ్ళుము.

వెంకునాయుడు వెళ్లుచుండును.

శ్రీ—వెంకునాయుఁడూ!

వెం—చిత్తము. చిత్తము. (అని తిరిగి వచ్చును.)

శ్రీ—నీవు బెల్ల మమ్మివేసితివా ?

వెం—లేదు. ధర కుదురలేదు బాబూ !

శ్రీ—(అనుమానించుచు) అట్లయిన నీ వొకటి చేయవలసియున్నది.

వెం—సెల వియ్యండి బాబూ !

శ్రీ—ఆకస్మికముగా మా పిల్లదానికి వివాహము కుదిరినది. మీవైపు బెల్లము పంచదారకంటె బాగుండునఁట. ఒక బెల్లపుదిమ్మ పంపవలెను. దాని సొమ్ము వెంటనే యిచ్చివేయుదును.

వెం—అందులోఁ జిల్లరగా నమ్మిన నా కొడుకు లొప్పుదురో లేదో !

శ్రీ—వకీలుగారికిఁ గావలెనని చెప్పుము. నేను మీ కింత లాభము గల్గించుచుండ నా కాపాటి సాయము చేయలేరా ? నే నిట్లంటినని నీ కొడుకులతోఁ జెప్పుము. మఱియుఁ గూర లేమయినను బంపలేవా ?

వెం—సెల వయినచో వంకాయలు పంపెదను.

శ్రీ—పనసకాయ లేమియు దొరకవు కాఁబోలు.

వెం—లేతకావు. కూరకుఁ బనికిరావు.

శ్రీ—పోనిమ్ము. ఆ వంకాయలును, బెల్లపుదిమ్మయును గూలివాంద్రచేఁ బంపుము. ఆ కూలి నే నిచ్చివేయుదును.

వెం—ఆ కూలిడబ్బులు మీ రియ్యవలయునా ? ఆఱులు పోవునా ? నూఱులు పోవునా ?

శ్రీ—అవును. మీ రట్టి యౌదార్యసాహసము గలవారని నే నెఱుఁగకపోలేదు. చూడు. బెల్లము మంచిది పంపెదవుకాదా ?

వెం—చిత్తము. నమస్కరించి వెడలిపోయెను.

# ౭

"ఎట్లో యీ పిశాచమును వదల్చుకొందు నప్పటికి నా తాతలు దిగి వచ్చినారు. నిన్నటినుండియుఁ బాతాళహోమము చేసి యెన్నో యసత్యము లాడి యెన్నో డంబములు పలికి, యమాయికురాలగు రమణమ్మను, నంతకంటె నమాయికుఁడగు వెంకునాయుని నమ్మించి మోసపుచ్చినగాని యీ రూపాయిలు నా జేబులోఁ బడినవికావు. ఆహా! ధనార్జన మెంత కష్టము! వేయి మాట లాడవచ్చును గాని యొక్క దమ్మిడి సంపాదించుట యెంతో కష్టము. ఇట్లుండ నాల్గు వేల రూపాయలు మూటగట్టి యల్లునికి దారపోయవలెనఁట! ఆహా! ఏమి న్యాయము! ఎంత కష్టము! తమ కన్యల కన్యాత్వము వదలించినందులకు సంతోషపూర్వకముగాఁ గన్యాదాత లింతో యంతో వరదక్షిణ యిచ్చుట న్యాయము. అంతియకాని మగపెండ్లివారు గొంతెమ్మకోర్కెలు కోరి కన్యాదాత యిల్లు గుల్లచేయుట తగునా? వేలకొలఁది రొక్కమును గ్రుమ్మరించుటయే కాక వరునకుఁ జేతులకు మురుగులఁట! వ్రేళ్ళ కుంగరాలఁట! పట్టుపంచెలట! వెండికంచములఁట! బైసికిళ్ళఁట! చేతి గడియారములఁట! వాండ్ర వల్లకాఁడఁట! ఇట్లొకటియా! రెండా! ఇవన్నియు వరుని కియ్యవలసినవే. ఇవిగాక యాఁడుబిడ్డ లాంఛనములఁట. ఆపైని వియ్యపురాలి లాంఛనములఁట! ఇట్లయినఁ గన్యాదాత లెంతలోఁ బకీర్లు గావలయును? కన్యాదాతలను బకీర్లనుగాఁ జేయుటయే వారి ముఖ్యోద్దేశము. ధర్మశాస్త్రములు వ్రాసిన మునిముచ్చు లాఁడువాండ్రకుఁ గూడ వివాహ వయః కాల నిర్ణయము చేయనియెడల నప్పు డేమగునో? మగవాండ్రు నానావిధముల నాఁడువాండ్రను బతిమాలుకొని పెండ్లి

యాడకపోవుదురా! ఇంత వయస్సులోనే బాలికలకు వివాహము కావలెనన్న నిర్బంధ ముండుటచే మగపెండ్లివారి కిన్ని తెగసీల్గులా? ఇంత కండకావరమా? ఇట్టివారి పెడసర మెట్లయిన నడఁచివేయ వలెను" అని యిట్లు శ్రీనివాసరా వాలోచించుచున్న సమయమున నొక యువతీలలామ వచ్చి చెంతను నిలువఁబడెను. సుఖాసనమున వెలికిఁగాఁ బరుండి యూర్ధ్వప్రసారితలోచనుండయి యుండుటచే శ్రీనివాస మామెను జూడనేలేదు. ఆమె యొక్కింత తడ వట్లె యుండి మృదుమధుర కంఠస్వరముతో "నాయనా!" అని పిలిచెను.

శ్రీ—(కన్నులు తెఱచి చూచి) అమ్మాయీ! కమలా! ఏమమ్మా! ఎందుకుఁ బిలిచితివి?

క—నాయనా? వంటయైనది. భోజనమునకు లెండు.

శ్రీ—మంచిది. అట్లే లేచెదను.

క—నాయనా! మీ రెల్లప్పుడును దీర్ఘచింతా నిరతులయి యుండిన మీ యారోగ్యము చెడిపోదా?

శ్రీ—లేదు. చింత కేమి యున్నది? ఆయాసముగా నుండుటచే నిట్లిచ్చట విశ్రమించినాను.

క—నాయనా! పెండ్లికి మన ప్రయాణ మెప్పుడు?

శ్రీ—ఈ రాత్రియె.

క—వివాహ మెప్పుడు?

శ్రీ—రేపుదయము వృషభలగ్నమున.

క—అంతయు సిద్ధమైనదా?

శ్రీ—అవును. ఏ మట్లడుగుచున్నావు?

క—ఈ సంబంధమును దప్పించివేయరాదా?

శ్రీ—(ఆశ్చర్యముతో) విశ్వప్రయత్నములు చేసి యెట్లో శ్యామసుందరరావుగారి సంబంధము నిశ్చయించి యిట్టిది లభించి

సంతోషముల కమితానందము నొందుచుండ నీ విట్లందువేమి?

క—ఆ సంబంధము మా కెవ్వరికి నచ్చలేదు.

శ్రీ—(తీవ్రముగఁ జూచుచు) నీకా? మీ యమ్మకా?

క—నాకు, మా యమ్మకు, అందు ముఖ్యముగా భ్రమర కును నచ్చలేదు.

శ్రీ—మీయమ్మ తెలివిమాలిన ముండ. దానికి మంచిచెడ్డలు తెలియవు. నీవు లోకజ్ఞాన మెఱుఁగనిదానవు. నీకంటెను లోకజ్ఞాన హీనురాలు భ్రమరాంబ. మీ కేమి తెలియును? అయిన మీ కా సంబంధ మేవిషయమున నచ్చలేదు.

క—అన్ని విషయములచేతను గూడ నచ్చలేదు.

శ్రీ—(గంభీర స్వరముతో) అన్ని విషయముల—అనగా? వరుఁడు బాగుండలేదా?

క—రూపరేఖలలో లోపము లేదు. బాగుండ కేమి?

శ్రీ—వారి వంశము మంచిది కాదా?

క—కా కేమి? అగ్రగణ్యమైనది.

శ్రీ—ధనవంతులు కారా?

క—మనవారిలో నిజముగా వారు ధనవంతులే? కాని,

శ్రీ—(కోపముతో) కాని, ఏమిటి? కానీ లేదు, ఏగాణీలేదు.

క—కాదు. నాయనా! కోపింపకుము. చనవుచే నిట్లను చున్నాను. శ్యామసుందరుఁ డెంత ధనవంతుఁ డయినను, నతఁడు మిక్కిలి పిసినిగొట్టు. ధనవిషయమై యంతటి కర్కోటకుఁడు లోకమున లేఁడు. అతని ప్రాణముకంటె ధనమే ప్రియము. అతని భార్య భర్త గుణము లన్నిటియందును సమానురాలు. ఆ తల్లిదండ్రుల గుణసమూహ మంతను బునికి పుచ్చుకొన్నఁవాడు వారికుమారుఁడు.

శ్రీ—అయిన, నీ యభిప్రాయ మేమి? వా రట్టు లుండఁ

బట్టియే ధనవంతులయి యున్నారు.

క—జనకా! నాది కాదు. మా యభిప్రాయ మే మందువా? అట్టివారి యింటఁబడిన యాఁడుదానికి సుఖ ముండదు.

శ్రీ—సరి. సరి. బాగు బాగు. ధనము సర్వార్థ సాధనము. అది యున్నవారికి సుఖ ముండదందు వేమి? వా రెంత పిసినిగొట్టు లయినను గోడలికిఁ దిండి పెట్టరా?

క—అత్తింటి కోడలికిఁ గావలసినది తిండియేయని నీ తలంపా యేమి!

శ్రీ—తిండి కాకపోయిన మఱొకటి. అదియుఁ గాకపోయిన మఱొకటి. ఇదంతయు నేల? నా ప్రాణము పుచ్చుకొనక ముఖ్యాంశ మును జెప్పు.

క—ముఖ్యాంశ మే మున్నది? వారి సంబంధము తన కిష్టము కాదని భ్రమర యనుచున్నది.

శ్రీ—చిన్నపిల్ల, దాని కేమి తెలియును? నీవును మీయమ్మయు ననుకొన్న మాటలు విని యది య ట్లనవచ్చును. మీ రా సంబం ధము మంచిదని యందు రేని నదియు మంచిదే యనును.

క—జనకా! నీవు పొరపడుచున్నావు. భ్రమర చిన్నపిల్ల యని తలంచుచున్నావు. అది వయసునఁ జిన్నది యయ్యును, విద్యా బుద్ధులందుఁ బెద్దదియే. దాని కిప్పుడు పదునాఱవయేఁడు. ఉన్నత్న పాఠశాలలో నయిదవ తరగతి చదువుచున్నది. మా మొదుట ముందుగా నదియే తన కాసంబంధము వలదని నొక్కి చెప్పినది. దాని మాట లాలోచింపఁగా మాకును న ట్లే తోఁచినది.

శ్రీ—మీ రందఱును దెలివిమాలిన పశువులు. వారి సంబం ధము నిమిత్తము మెందఱో సంచులతో రూపాయిలు పట్టుకొని తిరుగు చున్నను వారి కది లభింపకున్నది. అట్టి సంబంధము మన కనా

యానముగా లభ్యమగుచుండ మీ రిట్లందు రేల?

క—జనకా! వారి సంబంధము సంచులతో ధనము గ్రుమ్మరించువారికే తగునుగాని మనవంటి సామాన్యులకుఁ దగదు. మన భ్రమర చెప్పిన విషయ మిదియే.

శ్రీ—ఏమని.

క—అంత ధనము వెచ్చించి తనకుఁ బెండ్లి చేయవలదని.

శ్రీ—చిన్నపిల్ల దాని కేమి తెలియును. ఇంతకును ధన విషయ మాలోచింప మీ కేల? ఆ భారమంతయు నాది.

క—జనకా! మన కుటుంబ స్థితిగతులు నాకును దెలియును. భ్రమరకును దెలియును. నా పెండ్లికిఁ జాల ధనము వెచ్చించినారు. ఈ భ్రమర పెండ్లి కింత మొత్తమును వ్యయము చేసిన నిఁక మీరు నిలుచు టెట్లు? తక్కినవారికి వివాహము చేయు టెట్లు?

శ్రీ—అదియా! మీ యాలోచనము? మే మెట్లయినను మా పిల్లలు సుఖించినఁ జాలును. ఇంత యన్నవస్త్రములు గలవారి లోపల మిమ్ములను బడవేసినచో నింత ముద్దుగా మిమ్మును బెంచిన మేము కృతకృతుల మగుదుము.

క—జనకా! మీది సదుద్దేశమే. పిల్లలమగు మాయందుఁ దమ కమితప్రేమము గలదని మే మెఱుఁగుదుము. కాని మే మధిక ధనసంపన్నుల యిండ్లలోఁ బడినను, మా యదృష్టవశమున నచ్చట దేహసౌఖ్యము లొందఁగల్గినను, మా పుట్టినిల్లు పచ్చగా నున్నపుడే మా కా సౌఖ్యము, ఆనందము గల్గును. మీ రిట్లు మా సుఖముల కయి యప్పులపా లగుట మా కెంతమాత్రమును నిష్టము లేదు.

శ్రీ—ఇంతమాత్రమున ఋణములపా లయిపోనులే.

క—ఈ నాలుగువేలును మ రెట్లు తేఁగలరు?

శ్రీ—అమ్మాయీ! అదంతయు నాఁడువాండ్ర కెందుకు?

ధన మక్కఱలేకుండఁగనే కార్య మెట్లో నెఱవేర్పింతును.

క—అది యెట్లు పొసఁగును నాయనా?

శ్రీ—దాని కొక తంత్ర మున్నది. ధనవిషయ మెత్తకుము. ధనావసరము లేనిచో...

క—లేకపోవుట యెట్లు? పెదనాన్నగారు మొదట వారు కోరినప్రకారము దివ్యమగు భూఖండము వ్రాసి యిచ్చినను బుచ్చుకొనక పెండ్లిపీటపై గూర్చుండిన వరుని లేవఁదీసికొని వెడలిపోయినారు. ఆ విషయ మాలోచింప వా రెంత లుబ్ధులో, యెంత కఠిన హృదయులో, యెంత మర్యాదాహీనులో స్పష్టమగుచున్నది. వా రెంతమాత్రమును గట్నమును మానరు. ఆ కట్నములోను నను కొన్నదానికంటె నొక దమ్మిడి తక్కువయినను బుచ్చుకొనరు.

శ్రీ—కట్నమే యవసరము లేకుండ నేను జేసెదను కాదా?

క—(సాలోచనయై) ఎట్లు?

శ్రీ—దాని కొక తంత్ర మున్నది. అది యిప్పుడు చెప్ప రాదు. కార్యము కానిమ్ము.

క—తండ్రీ. వివాహములపట్లఁ దంత్రములును, గపటము లును బనికిరావు. అవి ముందు ముందు బాధాకరము లగును. భ్రమరయం దెంతో ప్రేమగల మీరు మీ చేతితోనే దాని కుత్తుక ను త్తరించినవా రగుదురు. అంత ధనము గ్రుమ్మరింప మనకు శక్తి లేదని మే మెఱుఁగుదుము. మీ రా సంబంధమును మాని భ్రమర నొక బీదవాని కిచ్చి పెండ్లిచేయుఁడు. వాఁ డాయవారముచేసి తెచ్చి యైనను దాని కింత పెట్టి యెంతో ప్రేమించును. మగనాలికిఁ బతి సహవాసభాగ్యమును మించిన భాగ్యము లేదుగదా?

శ్రీ—చాలు. చాలు. బాగుగ జెప్పితివి. నీ వట్లు సులభముగా నన్నావు గాని నే నట్లు చేయఁగలనా? బీదవారితో సంబంధమును

చేసి నల్వురలోఁ దలయెత్తుకొని తిరుగఁగలనా? నా కెంత పరువు తక్కువ! నా హోదాకుఁ దగిన సంబంధమునే చేయవలెను. కాని నీ వన్నట్లు చేయఁజాలను.

క—హోదాకుఁ దక్కువయని భావించి మీకుఁ బ్రాణతుల్య మగు భ్రమరను విపదలపాలు గావింపకుఁడు. దాని సౌఖ్యమును జెడఁ గొట్టకుఁడు.

శ్రీ—(కమలను నిదానించి చూచి) ఇదేమి? ఇట్లసందర్భము లాడెదవు. ఇంత ప్రయత్నమును జేసి భ్రమర కీ సంబంధమును గల్గించుట యది సుఖించుననియే కదా! నీ మాటలు నా కేమియును బోధపడకున్నవి.

క—(సంకోచముతో) జనకా! తమరు పెద్దలు. నిదానించి చూచినఁ దమకుఁ దెలియని యంశము లేమున్నవి? మీరు ధనావసరము లేకుండఁగనే శ్యామసుందరుఁడుగారి సంబంధము చేయఁగల మనుచున్నారు. సూక్ష్మదృష్టితో నాలోచించిన వారి స్వభావము మీరును గ్రహింపఁగలుగుదురు. వారు ధనమునకును బ్రాణమునకును లంకెపెట్టి వర్తింతురు. వారికి మాన మర్యాద లక్కఱ లేదు; మంచిచెడ్డ లక్కఱలేదు. కీర్తి యక్కఱలేదు. సౌఖ్య మక్కఱలేదు. వారికి ముఖ్యముగాఁ గావలసినది ధనము. ధన విషయ మేపాటిలోపము గల్గినను వారు మనసంబంధము చేసికొనరుఁ ఒకవేళఁ బ్రస్తుతావసరమును బట్టి చేసికొన్నను, పిల్లను దమ యింటికి దీసికొని వెళ్లరు. మగనితోఁ గాపురము చేయనీయరు. ధనవంతులని యాసించి యిట్టి దుస్స్వభావుల సంబంధమును జేయుటకంటె, భ్రమరను సర్వవిధముల నరకకూపమువంటి వారి యింటఁ బడవేసి పలు బాధల పాలుచేయుటకంటెఁ, గుటుంబమువా రందఱు నల్లారు ముద్దుగాఁ జూచుచుఁ బ్రేమించుచుఁ 'దమయింటి కోడలు కోడలని

యధిక సంతోషముతోఁ గనఁబడినవారి కందఱకును జూపి నెత్తి పయిఁ బెట్టుకొని వర్తించు నొక బీద కుటుంబమున మన భ్రమరను జేర్చితిరా! యది మిక్కిలి సుఖించును. సంతసించును.

శ్రీ—ఓహో! నీ యభిప్రాయము మహాగత మయినది. వివాహమైన తర్వాతఁ బిల్లను దీసికొని వెళ్ళరేమో యనియా నీభయము! అట్లు తీసికొని వెళ్ళకుండ వారేచెరువు నీళ్ళు త్రావఁ గలరు? శ్రీనివాసరావున కపకార మొనర్చి శ్యామసుందరుఁడు బ్రదికిపోఁ గలఁడా?

క—జనకా! నిజమునకు వచ్చిన మన మేమి చేయఁగలము? నిర్ణీతమగు ధన మంతయు నిచ్చినఁగాని పిల్లను దీసికొని వెళ్ళమనిన మన మేమి చేయఁగలము? లేక తీసికొనివెళ్ళి కోడలిపయిఁ గుటుంబమువా రందఱును రవరవ లాడుచుఁ గోరచూపులఁ జూచుచు వర్తించుచుండిన మన మేమి చేయఁగలము? అట్టిచోటఁ గాపురము చేయుటకంటె భగభగ మండుచున్న దావాగ్నిహోత్రమధ్యమున నుఱుకుట యుత్తమురాలికి సౌఖ్యముగదా? నే నిట్లనుచున్నానని కోపింపకుఁడు. మీరు నా విషయ మేమి చేయఁగలిగినారు? అత్తింట నుండి నే నిచ్చటికి వచ్చి రమారమి రెండు వత్సరము లయ్యెను. వారు వచ్చి నన్ను..................

శ్రీ—ఓహో! తెలిసినది. నీ యత్తవారు వచ్చి నిన్నుఁ దీసికొని వెళ్ళలేదనియా! నీ యభిప్రాయము! ఇఁకఁ గొంచెము దినము లోర్చుము. నీ మామగారికి బుద్ధి చెప్పింతును. అతఁడు వట్టి మూర్ఖుఁడు. వాని ప్రాణము లన్నియు నా చేతిలోఁ జిక్కియున్నవి. వియ్యంకుఁడు గదాయని నేనే వెనుక దీయుచున్నాను. లేనిచో వాని నీపాటికి నా పాదములు పట్టుకొనునట్లు చేయకయుందునా?

క—జనకా! అవి వ్యవహార విషయములు. ఒకప్పు డవస

రము వచ్చి నా మామగారు మీ పాదములు పట్టుకొన్నారే యను కొనుడు. అ దెంతవఱకు? వ్యవహారము తీఱినంతవఱకే కదా? తరువాత నెప్పటివిధముననే వర్తింతురు. మన మేమి చేయఁగలము?

శ్రీ—నిన్నుఁ దీసికొని వెళ్ళునంతవఱకును నా వ్యవహారము అట్టిపెట్టి యుంచెదను.

క—జనకా! మీ కొక నమస్కారము. అంత నిర్బంధము చేయవలసి వచ్చినప్పుడు నే నత్తింటికి వెళ్ళనే వెళ్ళను. వారు నన్ను దాసిదానికంటె నధమాధముగాఁ జూచుచు నెత్తిపొడుపు మాటలాడుచుండ నేను బ్రాణములను భరింపఁజాలను. మర్మచ్ఛేదకములగు నా దురుక్తులను వినుచు సంతతము నిగూఢ దుఃఖ మనుభవించుట కంటె నాయం దత్యంత వత్సలులగు మీ నీడను బ్రదుకుట నాకు మేలు గాదా? నేను నా విషయమై చెప్పలేదు. భ్రమరవిషయమై చెప్పుచున్నాను. నా మామగారివలె శ్యామసుందరుఁడును బరమ లుబ్ధుఁడు. అతఁడు వివాహకాలమున నిర్ణయించిన ధన మంతయును బుచ్చుకొనకుండ విడువఁడు. మన మాధన మిచ్చుటలో నేమాత్రము కక్కుఱితి పడినను భ్రమర కష్టముల పాలగును. ధనమందే కాని సంబంధమందు గౌరవము లేనప్పు డవతలవారు కోటీశ్వరు లయినను మన కా సంబంధము వలదు. జనకా! నా యత్తింటివారికి లేదా? పోదా? మన మీయవలసిన నాలుగువందల రూపాయలును వారు పెట్టుచున్న వ్యయములలో దేనితోఁ బోలును? నా వివాహ సమయమున మీరు వారి కిచ్చెదమన్న వరశుల్కముతో నా కలంకారములు చేయింప వా రేర్పఱచిరి. ఆవిధముగా మీరు చాలవఱకు నగలు చేయించి నా కిచ్చినారు. ఇఁక మీరుచేయించి నా కియ్యవలసిన నగలు నాల్గువందల విలువగలవి. అవియైనను నాకుఁ జెందునవి కాని నా మామగారి భోషాణములలోఁ జేరునవికావు. ఇట్లుండ వారి కింత

పట్టుదల యేల? మిగత నగలు మీరు చేయించి యిచ్చిన నన్నుఁ గొనిపోవుదురా? లేనిచో మానెదరా? నా బ్రదు కంతయు నాల్గు వందల రూపాయలలో నిమిడిపోయెనా? మానవతి కింతకంటె నెక్కుడు దుఃఖముండునా? నాకును నా యత్తవారికిని గల్గు సంబంధము ధనమునుబట్టియా? ఇది తలంచుకొనుటకే సిగ్గగుచుండ నిఁక నోటితోఁ జెప్పుకొనఁగలమా? కావున నేనుఁ దమ్మును బ్రార్థించుచున్నాను. రూపముగాక, గుణములుగాక, సుశీలముగాక, మానమర్యాదలుగాక, కులీనత్వముగాక, కేవలము ధనముమాత్రమే ప్రధానముగా నెంచుకొను ధనమదపిశాచ మత్తులతోడి సంబంధము వలదు. ఒక సంబంధము చేసికొని మన మనుభవించుచున్నాము. ఇంకను నట్టి సంబంధమే కావలయునా? నా మామగారు మూర్ఖులని తమ రన్నారు. శ్యామసుందరుఁడు మూర్ఖాగ్రేసరుఁడని చెప్పవచ్చును. నా పతి తండ్రికంటె నెన్నోవిధముల మంచివాఁడు. తల్లిదండ్రుల కోపమునకుఁ జంకి వెనుకదీయుచుండెను గాని నాయందుఁ బ్రేమలేక కాదు. ఇఁక భ్రమర మగఁ డట్టివాఁడు కాఁడు. తండ్రికంటెను మిక్కిలి మూర్ఖుఁడనియు, లుబ్ధుఁడనియుఁ జెప్పవచ్చును. వట్టి శుష్క హృదయుఁడు. చదువరి యయినను రస మించుకంతయును గ్రహింపలేనివాఁడు. విద్యావతియగు మన భ్రమర కతఁ డెంతమాత్ర మర్హుఁడు కాఁడు. కావున నీ సంబంధము మానుఁడని కోరుచున్నాము. పిమ్మట మీ యిష్టము.

శ్రీ—అమ్మాయీ! నీకంటె నేనన్నివిధములను బెద్దవాఁడను. నాకును లోకానుభవము గలదు. నీ కెట్టి గతి పట్టినదో నే నెఱుఁగక పోలేదు. కాల మెప్పుడు నొక్కరీతిగా నుండదు. సంయోగ వియోగము లెప్పుడును నియతములు గావు. మన మనస్సు లెప్పుడును నొక్కరీతిగా నుండవు. మన కష్టసుఖములు మన చేతిలో లేవు. అవి

దైవమున కధీనములు. ప్రస్తుతమున మంచిచెడ్డలు గమనించి కార్యము లొనర్పఁగలము. అంతియ కాని భావిస్థితిని బరిశీలింప సర్వజ్ఞులము కాదు గదా? అతి కష్టపడి సిద్ధపఱచిన కార్యమునకు విఘాతమొనర్పకుఁడు. కన్నవుత్త్రికల మేలునే కోరుచుందును గాని విపరీతముగా వర్తింపనుగదా? భ్రమర విషయమై యెట్టి చిక్కును సంభవింపనీయను. అప్పో సప్పో చేసి నాల్గువందల రూపాయల నగలను జేయించి నీకుఁ పాఱవేసినచో సర్వము సమకూడినట్లే! ఎంతో కష్టపడినఁ గాని ధన మార్జింపలేము. నేను నా పిల్లల కధికముగా ధనమొసంగలేకపోయినను వారిని లక్షాధికారుల యిండ్లలోఁ బడవేయఁ గల్గినచో కృతార్థుఁడ నగుదును. చెరువులో నీరున్నచోఁ బ్రస్తుతము గాకపోయినను మఱియొకప్పు డయిన నుపయోగించుకొని సుఖింపవచ్చు నను నాశయైన నుందును. పట్టి మరుభూమి నాశ్రయించిన నేమి లాభము? మానవుల మనఃకుసుమములను బంధించి యుంచునది యాశావృంతమని పెద్దలు చెప్పుదురు. కావున మీరు భిన్నాభిప్రాయులు గాక త్వరగాఁ బ్రయాణసన్నద్ధలు కండు. భ్రమర నా మాట నతిక్రమింపఁజాలదు. చిన్నపిల్లయగు భ్రమర మానసమును గలంత పెట్టకుఁడు. నీవును మీ యమ్మయు నొక్కి చెప్పిన నదియు నంగీకరించును. లేనిచో మీ రూరకుండుఁడు. ఆ పని నేనే చేసెదను. ఒక్క నిమిషములో దాని నంగీకరింపఁ జేసెదను.

కమలమ మేమియును జెప్పలేక లోపలికి వెళ్లిపోయెను. శ్రీనివాస మల్లె మఱి కొంచెముసేపు కూర్చుండి భోజనమున కరిగెను.

## ౬

రామయ్యగ్రహారమున రెండు వీధు లున్నవని యింతకుఁ బూర్వము వ్రాసియున్నాను. అం దెగుదలవీధియం దొక గృహమున శ్రీనివాస రావు గత రాత్రి కుటుంబసహితుఁడై వచ్చి విడిసెను. ఆ యిల్లు పరులది కాదు. అతని మాతామహార్జిత మైనది. అతనికిఁ బిత్రార్జిత మగు నొక గృహము దిగువవీధిలో రామావధాని మందిరము నంటి యుండెడిది. కాని యది శ్రీనివాసరావు తన చదువునకై చేసిన యప్పును దీర్చుటకై యమ్మవలసి వచ్చెను. దానిని రామావధానియె యుక్తధన మిచ్చి పుచ్చుకొనెను.

శ్రీనివాసము విశాఖపురినుండి వచ్చునప్పటికి మాధవరావు సాయమున శ్యామసుందరుఁడే యిల్లు బాగుచేయించి పాక పందిరి వేయించి యతని రాక కెదురు చూచుచుండెను. లోకములో నాఁడుపెండ్లి వారు మగపెండ్లివారి కడుగులకు మడుఁగు లొత్తుచు తదాజ్ఞాను వర్తులయి మెలఁగుట యాచారము. ప్రస్తుత మట్లు జరుగలేదు. మగ పెండ్లివారే యాఁడుపెండ్లివారి నట్లు చేయవలసి వచ్చెను. మఱియు శ్యామసుందరరావే విడిదికయి తమకుఁ గూడ నొక యిల్లు సిద్ధము చేయించి యుంచుకొనెను. శ్రీనివాసము బండి దిగునప్పటి కా వీధివా రందఱును, శ్యామసుందరుఁడును వచ్చి యతనిని బరివేష్టించి, కుశల ప్రశ్న మడిగి, యుచితమర్యాద లొనర్చిరి. పిమ్మట శ్రీనివాసము శ్యామసుందరుని చేయి పట్టుకొని "బావగారూ! మీకుఁ జాల శ్రమ యియ్యవలసి వచ్చినది. మాకు మేము చేయవలసిన యుపచారములు మీరే మాకుఁ జేయవలసి వచ్చెను. ఈ వివాహము మీ కుగ్రామ ములోఁ గాక విశాఖపురిలో నైన పక్షమున మిక్కిలి యుత్సాహ

పూరితుఁడ నగుదును. అచ్చట నేవస్తువునకును దడవుకొన నక్కఱ లేదు. మఱియు మీ కింత శ్రమయు నక్కఱ లేకపోవును. కాని యేమి చేయఁగలము? స్నాతకవ్రత మవలంబించిన పెండ్లికొడుకు నది దాట రాదను ధర్మశాస్త్రవచనముచే మీరును మేమును గూడ శ్రమపడ వలసి వచ్చెను. కానిందు, దైవయత్నమును మార్ప నెవ్వరికశక్య" మని, తా మతి కష్టపడి యపారకారుణ్యము వహించి విగతాశ్రముఁడయిన శ్యామసుందరరావు కొడుకు నుద్ధరించుటకే వచ్చినట్లు సంభాషించెను. కాని యా గూఢాభిప్రాయ మచ్చటివా రెవ్వరును గ్రహింపలేక పోయిరి. అందులకు శ్యామసుందరుఁడు "సరి సరి యింతమాత్రమున మా కేమి శ్రమ" యని వినయమును సూచించెను. తక్కిన యా వీధివారు "ఓయీ! శ్రీనివాసరావు! నీ వెక్కడనో విశాఖపట్టణములో వివాహ మొనర్చిన మే మందఱమును జూచి యానందించుట యెట్లు? మీ యిరువుర బాంధవ్యమును జనక దశరథుల బాంధవ్యము వలె సత్త్యుత్తమయినది. మా కెంతయు సంతోషకరముగా నున్నది" అని శ్యామసుందరునితో "ఓయీ! చూచితివా? శ్రీనివాసరావు చూపు మర్యాదయు, ఘనతయు, బంధుప్రీతియు, నాదరమును మ ఱొకరు చూపలేరు. చేసిన సిట్టివారితోనే చుట్టఱికము చేయవలెను. ఇంతకును నీకొడుకు కదృష్టవంతుఁ" డని తమ సంతసమును వెలిబుచ్చిరి. అది విని శ్రీనివాసము అయ్యా! మీ రనునది నే నంగీకరింపను. నిజముగా మా పిల్ల నోచిన నోములను బట్టియే యీ శ్యామసుందరుఁడు గారి సంబంధము లభించినది. ఈపాటివాఁడు మన శాఖలో నెచ్చటను లేఁడు. అయిన నేమి, లగ్నమునకు వ్యవధి లేకపోయినది లేనిచో మహేంద్రవైభవముతో నీ వివాహము చేసి బాగు బాగని మా బావగారిచేఁ బొగడ్తను గాంచి యుందును. తక్కిన దెట్లయినను నయిదు దినములును వచ్చిన బంధుగులకును, బెండ్లివారికిని నింత

పప్పు, అన్నమయినను బెట్టవలదా? అతి కష్టముచే నీ స్వల్పకాలము లోనే వివాహ సంభారములు జతపఱుచుకొని వచ్చితిని. ఏ లోపము లున్నను బావగా రనుగ్రహించి మమ్ములను నల్వురలోను బడవేయ వలదని కోరుచున్నాను. బావగారివంటి లక్షాధికారి మనయింటికిఁ దరలివచ్చినప్పుడు మన మెంత వైభవముతోఁ గార్యము జరుప వలెను? కాని యేమి చేయుదు"నని తన మృదుమధుర సంభాషణ ముచే శ్యామసుందరరావు నేనుఁగు నెక్కించెను. అది విని యందఱును బరమానంద భరితు లయిరి. అంతియకాని శ్రీనివాసరావు ముందఱికాళ్ళకు బంధములు వేసి మాటాడుచున్నాడని శ్యామ సుందరుఁడు గుర్తింపలేకపోయెను. కొంతసేపు సంభాషించుకొన్న పిమ్మట నచ్చటివారు తమ తమ గృహముల కరిగిరి. శ్యామసుంద రుఁడుగూడ వియ్యంకుని యొద్ద సెలవు గైకొని వెడలిపోయెను. శ్రీనివాసము మొదలగువారు భుజించి పండుకొనిరి.

మఱునాఁ డుదయము పది గంటలకు శుభముహూర్తము. తెల్ల వాఱునప్పటికి బాజా బజంత్రీలు మొదలగునవి వచ్చెను. పల్లకీబోయీ లును వచ్చిరి. బంధువులును, మిత్రులును దమ తమ కుటుంబము లతో వచ్చి తమ కేర్పఱిచిన విడుదులలో విడిసిరి.

పురోహితులు బ్రాహ్మణులు వచ్చి వివాహమునకుఁ గావలసిన సంభారములను జతపఱిచిరి. ఇఁక శుభముహూర్తమున కొక గంట మాత్రమే గడు వుండెను. అప్పుడు శ్రీనివాసము శ్యామసుందర రావును రప్పించి రహస్యముగా నొక గదిలోనికిఁ గొనిపోయి "బావ గారూ! మనము తలంచినట్లు కార్యము ఫలోన్ముఖము కానున్నది. మీరు కోరిన నాల్గువేల రూపాయలును గట్న మిచ్చుటలో నభ్యం తరము లేదు. కాని కార్యము మిక్కిలి వ్యవధి లేకపోవుటచే నాకు వచ్చెడి సొమ్ము రాలేదు. వడ్డీ హెచ్చయినను సరియే మార్వాడి

యొద్ద తేవలయునని యనుకొన్నాను. వాఁడు సమయమున కూరలేక పోయెను. తుదకు నేఁ దలంచిన దేమనఁగా మే మిచ్చిన రూపాయిలు మీ రయినను నొకరికి ఋణ మీయవలసినదే కదా? ఆ మార్వాడి కిచ్చెడి వడ్డీ బావగారికే యిత్తును. ఆ వడ్డీసొమ్ము పయివాండ్రకుఁ బోవుటకంటె మనవాండ్ర కుండిన మేలుగాదా! ఇంతకును మఱి యొకటి. మీ రీ రూపాయలు వ్యవహారము కుదురునంతవరకు బెట్టిలోఁ బెట్టుకొని యుండినచో వడ్డీ కొంత నష్టమగును. ఆ నష్టము గూడ మీకు లేకుండుట కయి యిప్పుడే మీ కొక నోటు వ్రాయఁ దలంచి అణాబిళ్ళలను గాగితమును దెచ్చితిని. ఈ యంశము వివాహ కాలమునఁ జెప్పిన సముచితముగా నుండదని యిప్పుడే చెప్పితిని. మనము చేసికొనెడి సంబంధములు మైత్రికేఁగాని కలహమునకుఁ గాదుకదా! మీరు బుద్ధిమంతులు, విద్వాంసులు, వ్యవహారజ్ఞులు. ఆలోచించి నాచెప్పినట్లు చేసి కార్యక్రమము జరుగనిండని పల్కెను.

శ్యామసుందరుఁడు కార్యాలోచన నిమగ్నుఁ డయ్యెను. కాని యతఁడు చాలసేపటివరకు కార్యనిశ్చయము చేయలేకపోయెను. అతఁడు తనలో "రామావధాని భూములను వ్రాసియిచ్చెద ననెను. లేనిచో నిర్వదినాల్గు గంటలలో మూఁడువేల రూపాయల నిచ్చెద ననెను. ఇతఁడో నోటు వ్రాసియిచ్చెద ననుచున్నాఁడు. అయినను నితఁడు మఱొక వేయి రూపాయిలు హెచ్చుగా నిచ్చుచున్నాఁడు. అయినను నంత సొమ్ము మన కెట్లు రాఁగలదు? ఇతఁడు చెప్పినట్లు లొక దినము వడ్డీయైనను నష్టము రాదు. ఇతఁడు కట్నము సొమ్మియ్యకపోవునా?.........ఇయ్యక యే చెరువు నీరు త్రాగఁ గలఁడు? ఇతని ప్రాణము లన్నియు నా చేతిలో నుండ నేమి చేయఁ గలఁడు? ఇతనికి బ్రాణపదమగు కుమార్తె మానప్రాణ సుఖసంపద లన్నియు మన చేతిలో నుండఁగా నెక్కడికిఁ బోఁగలఁడు? ఇంతకును

మనము గట్న మిప్పుడే యీయవలయునని పట్టుపట్టినచో కార్యము విఘ్న మగుటయే కాని యితఁడీ పల్లెటూరిలో నింత సొమ్మెట్లును జతపఱుపఁజాలఁడు. కార్యము విఘ్న మయినచో లోకు లందఱు నన్నుఁ జెడఁదిట్టకమానరు. ఈ సంబంధముకూడఁ దాటిపోయినచో మన కింత స్వల్పకాలములో నింత మంచి సంబంధము లభింపదు. ఇంతే కాక నేఁడు నా కుమారునికి వివాహము చేయనిచో మరల నుపనయన సంస్కారము చేయవలయునేమో! కావున నీ బాధలు పడుటకంటె నెట్లో సమ్మతించుటయే మే*లని శ్రీనివాసముతో నిట్లు సంభాషించెను—

శ్యా—బావగారూ! గట్టిచిక్కు తెచ్చిపెట్టినారే!

శ్రీ—ఏమి? అంత చిక్కేమియు నాకగపడలేదు.

శ్యా—కట్నము లరువుపెట్టుటయా?

శ్రీ—అరువున కేమున్నది? కార్యము కానిండు. మీకు సొమ్మే కావలసినచో మూఁడునిమిషములలోఁ దెప్పించి యిచ్చెదను.

శ్యా—అదికాదు. మీయొద్ద సొమ్మున్న మాకేమిభయము? మా పెట్టెలో నుండిన నెంతో మీయొద్ద నున్నను నంతే. కాని నలువురలో నింత సొమ్ము కట్నము పుచ్చుకొన్నారన్న గౌరవ ముండదు గదా?

శ్రీ—లేకేమి? ఆ సమయమున నే నందఱ యెదుటను గట్నము విషయమై చెప్పి ముహూర్త మవ్యవధి యగుటచే సొమ్ము జతపడ లేదనియుఁ జెప్పి మీ కా గౌరవమం దెట్టి లోపమును గల్గకుండఁ జేయుదును. మీ రంగీకరించిన నంతయుఁ దీఱును.

శ్యా—వడ్డీ యెట్లు?

శ్రీ—అయ్యో! దానికా విచారించుచున్నారు? మీ యిష్ట మెట్లో యట్లే కానిండు. ఇంత సొమ్ము వెచ్చించి పెండ్లిచేయ నున్న

ప్పుడు మఱి పది రూపాయల వడ్డీ యీయలేనా? మీకిష్టము వచ్చిన వడ్డీని గోరుఁడు.

శ్యా—నేను బుచ్చుకొనుచున్న వడ్డీలో రూపాయి వడ్డి మిక్కిలి తక్కువ. అట్లు వ్రాయుఁడు.

శ్రీ—ఇదియా మీకోర్కె? అట్లే కానిండు.

శ్యా—నోటులో వరశుల్కమని యెత్తుకొనిన బాగుండ దేమో? మ రెట్లు వ్రాయుదురు?

శ్రీ—దానికి సందేహ మేల? మీయొద్ద బదులు పుచ్చుకొన్నట్లు వ్రాయుదును.

శ్యామసుందరుఁ డంగీకరించెను. శ్రీనివాసము నోటు వ్రాసి పెద్దమనుష్యుల సన్నిధి నుంచెను. శ్యామసుందరరావు భార్య మొదట సమ్మతింపక మోము ముడుచుకొన్నది. కాని పతిబోధనవలన నంగీకరించినది. దైవవశమువలన నెట్టి యాటంకమును గల్గక శుభలగ్నమున మంగళసూత్రధారణ మయినది. వివాహతంత్ర మంతయు నడపఁబడెను. మనస్సులలో నెవ్వరి కే మున్నను దమ తమ యభిప్రాయములను మాత్ర మెవ్వరును వెల్లడింపలేదు. ఆ దిన మను కూలముగఁ గడచిపోయెను.

మఱునాఁడు సాయంకాలము నాల్గు గంటలప్పు డూరిలోని ముత్తైదువలు పసుపు కుంకుమ కయి వచ్చిరి. శ్రీనివాసరావు భార్య రామలక్ష్మి వారి కందఱకును దగిన మర్యాదలుచేసి, చాపపైఁ గూర్చుండఁబెట్టి, చందన కర్పూర తాంబూలాదు లొసంగి యుచిత మర్యాదలు గావించెను. అనంతరము వా రేదో ప్రసంగించుకొను సమయమున శ్యామసుందరరావు భార్య తన బలఁగముతో భోజనమునకు వచ్చెను. ఆమె యంత యాలస్యముగా భోజనమునకుఁ రాఁ గారణము లేకపోలేదు. ఆమెతో నెవ్వరో కాని కట్న మేమియుఁ లేకుండఁ

గనే పెండ్లి జరిగినదనియు, వ్రాసిన నోటామె కను దుకుచుటకే కాని ఫల మేమియు లేదనియు, జెప్పిరఁట. అందుపై నలిగి యామె భోజనమునకు వెళ్లనని పట్టు పట్టెను. ఆమె వెళ్ళకపోవుటచేఁ దక్కిన యాఁడువారుగూడ మానివేసిరి. ఎట్లయిననేమి శ్యామసుందరుఁ డామెను బతిమాలి నోటు చూపి నచ్చఁజెప్పి యెంతో కష్టముమీద భోజనమునకుఁ బంపించెను.

ఇట్లు వచ్చిన శ్యామసుందరరావు భార్య సుబ్బమ్మను, దదనుచారిణులగు స్త్రీలను గౌరవించి శ్రీనివాసము భార్య రామలక్ష్మి కూర్చుండఁబెట్టెను. ఈవిధముగా నచ్చట స్త్రీజనమహాసభ కూడెను. వియ్యఁపురాం డ్రిద్దఱును సమీపముగాఁ గూర్చుండిరి. మొదట నేమేమో ప్రసంగించుకొనిరి. ఆ ప్రసంగములకుఁ గ్రమ మేమియును లేదు. ముత్తైదువగా వచ్చిన యామె సుబ్బమ్మను జూచి "వదినె! చూచితివా? ఏ పురుషునికి, నే స్త్రీకిని భగవంతుఁడు సమకూర్పఁ దలంచెనో యెఱుఁగము. మీ విశ్వంభరునకు ఈ పిల్ల భార్యయై యుండఁగా రామావధాని కూతు రెట్లగును? పాప మనసూయ మీ సంబంధము తప్పిపోయినదని మిక్కిలి విచారించుచున్నది. ఏమయినను వదినెగా రందులోఁ గొంచెము తొందఱపడినా" రని పలికెను.

సు—మా దేమి తొందఱమ్మా! ఇచ్చెదమన్న కట్న మిమ్మనుట తప్పా?

ముత్తై—తప్పని యెవ్వరు ననలేదు. మొదట నొకటి గోరి పిమ్మట మఱియొకటి గోరుట మీకు మాత్రము మంచిదా? అయినను రూపాయలు జతపఱిచి యిరువదినాల్గుగంటలలో నిచ్చెద మన్నారు కారా?

సు—ఇచ్చెద మననేల? ఇయ్యవలెను. కట్నము లరువేమిటమ్మా!

ము త్తై—పోనిమ్ము. ఇప్పు డా ప్రసంగ మెందుకు? ఏదో వారి పిల్లకు స్వల్పకాలములో నైనను మంచి సంబంధమే లభించినది. ఇంత కును దైవఘటన.

సు—అదియు మంచిదే. వారికిని మంచి సంబంధము దొర కినది మాకును మంచిదే లభించినది. అది తప్పిపోవుట మాకును సంతసముగానే యున్నది. మఱొక విశేషము. అంతకంటె మఱొక వేయిరూపాయలు మాకుఁ గట్నము హెచ్చు వచ్చినది.

ము త్తై—(శ్రీనివాసము భార్యను జూచి) చెల్లీ! మీ రేమాత్ర ము కట్న మిచ్చినారు?

రామ—సంసారులకుఁ గట్నము లేమిటమ్మా? పెండ్లికొడు కునకుఁ బెండ్లికూతురే కట్నము.

రామలక్ష్మి వియ్యపురాలు వినునట్లుగ బలికెను.

సు—ఆపిడ వేళాకోళము చేయుచున్నది. నాలుగువేలు కట్న మిచ్చినారు. కావుననే వీరి సంబంధ మంగీకరించినాము.

ము—అవునటే? రామలక్ష్మి! నాతోఁ బరిహాసమఁటే?

రా—కా దక్కయ్యా! పరిహాసము కాదు. వదినెగారు గొప్పకై చెప్పుకొనుచున్నారు. కాని కట్న మిచ్చుటకు మా కంత ధన మెక్కడిది?

సు—ఎదిగిన కూతురు లోపల నున్నప్పు డెట్లయినను దెచ్చె దరు. కూతురు కట్టు దప్పినచో నల్వురు వెలివేయుదు రన్నపుడును, మంచి సంబంధము కావలె నన్నపుడును, ఏమి చేయుదురు వదినే?

రా—ఏమో నమ్మా! మాపిల్ల కీయేఁడు వివాహము చేయఁ దలఁచుకొననే లేదు. మా బావగారి సంబంధము తప్పిపోయినదనియు, స్నాతకవ్రతుఁ డగు వరునికి మూఁడు రాత్రులలోఁగా వివాహము కాక తీఱదనియు, వీరికిఁ దగిన పిల్ల యెక్కడ దొరకక మాపిల్ల

నడుగ వచ్చిరనియు, మా వారు నాతోఁ జెప్పినారు. గామం బావగారి సంబంధమును దిరస్కరించి వచ్చినవారితో మనము సంబంధము చేసికొనుట మర్యాద కాదని యెంతయో చెప్పితిని. కాని మీ మఱఁది "ఏమయినను గట్నము కానుక లేకుండ ధనవంతుల సంబంధము మనకు లభించుచున్నపుడు మానరాదు. ఇంతకును శ్యామసుందరరావు నాకు మిత్రుఁడు. అతని కొడుకునకు మన పిల్ల నిచ్చి యతనికి సంభవించిన చిక్కు వదల్పుకున్న బాగుండు" దని యన్నారు. ఆయన మాట కెదురాడ వెఱచి సమ్మతించితిని. లేనిచో నింత యనవకాశముగాఁ బెండ్లి చేయుదుమా?

ఈ మాటలు సుబ్బమ్మ చెవిని బడెను. అదివఱకు శాంతింప నున్ముఖ మగు నామె క్రోధాగ్ని మరల రవులుకొనఁ జొచ్చెను. ఆమె ముఖము ధుమధుమలాడ దొడఁగెను. నేత్రములు నిప్పులు గురియుచుండెను. "ఆహా! వదినెగారి మాటలు కడు చిత్రముగా నున్నవే? మేము వచ్చి మీ పిల్ల నిండని బతిమాలి ప్రాకులాడినామా? బాగు! బాగు! ఎవ రెవ్వరు బతిమాలినారో మా యన్నగారి నడిగిన తెలియఁగల"దని గంభీరస్వరముతో సుబ్బమ్మ పలికెను.

"వదినే! ఒకరి నడుగ నవసర మే మున్నది? ఒకరి కవసరము వచ్చినప్పుడు రెండవవారిని బతిమాలుకొనుట లోకస్వభావము. ఇందుఁ దప్పేమున్న"దని రామలక్ష్మి యనెను.

"అది సత్యమే. కాని మేము వచ్చి మిమ్ము బతిమాలుకొన్నామా? చాలు. చాలు" అని సుబ్బమ్మ యనెను.

"అట్లు కాకపోయినచో మే మింత యనవకాశముగా మా పిల్లకుఁ బెండ్లిచేయ నవసర మే మున్నది?" అని రామలక్ష్మి మాఱు పలికెను.

"వదినెగారు తెలుఁగరు. ఒక రిచ్చు గట్నముకంటె మఱొక వేయి

రూపాయలదనముగా నిచ్చెద మని బతిమాలుచు నుత్తరము వ్రాసిన వారెవరో! అట్లు మా యన్నగారిచే నుత్తరము వ్రాయించి, యిప్పు డిట్టి మాటలాడుచున్నారా? గడుసువారు. గడుసుమాటలాడు దురు."

సుబ్బమ్మ మాటలు వినఁగానే రామలక్ష్మికిఁ గూడఁ గ్రోధ మధికమయ్యెను. క్రమముగాఁ బ్రసంగములు మర్యాద నతిక్రమించెను. కంఠధ్వనులు రూక్షము లయ్యెను. దేహలతలు కంపింపఁ జొచ్చెను. వేఁటగాని బాణపుదెబ్బ దినిన నాఁడుపులులవలె వియ్యపురాండ్రు భీకరరూపములఁ దాల్చినవారైరి. తక్కినవారు వారిని వారించుచుండిరి. కాని కోపావిష్టమానసులగువారి కవి చెవి కెక్క లేదు. తన వాదము గెలువవలయునని సుబ్బమ్మ యూహ. పల్లెటూరి స్త్రీలపాటి మాటలు నాగరకులగు వారికి రావా? కావున నల్వుర యెదుటను దనకే జయము గల్గవలెనని రామలక్ష్మి యుద్దేశము. ఈ కోలాహలధ్వనులు శ్రీనివాసము చెవిని బడెను. అతఁడు పరువు పర్వున వచ్చి, ముందుగాఁ దన భార్యను వారించి, "ఇఁక నీయింట విస్తరి వేయ" నని కోపముతో వెడలిపోవుచున్న సుబ్బమ్మను నిలువఁబెట్టి "అక్కయ్యా! ఇదేమమ్మా! ఇంత కోపము! నీవంటిదానికి తగదు. ఇంటిపెద్దను నేను. ఏలోపము వచ్చినను నాతోఁ జెప్పవలెను. లోపములు దీర్చుకొనవలెను. అంతే కాని యిట్లు కోపించి వెడలిపోయిన మేము భరింపఁగలమా? మన లోపములు మనము దిద్దుకొనక పోయిన నెట్లు? నీవు కోపమును దిగవిడిచి కలహకారణ మేమో చెప్పు" మనెను.

సుబ్బమ్మ కొంచెము శాంతి వహించెను. "అన్నయ్యా! మరేమియు లేదు. కట్నముపిషయమై మాట మాట వచ్చినది. అందులో మా వదినెగారి మాటలు విన్నచో నెట్టి శాంతులకును గోపము రాక

మానదని పలికెను.

"అది చిన్నది. దాని కేమి తెలియును? మనవలె దానికి లోక జ్ఞానము చాలదు. మీకుఁ గట్న మిచ్చువాఁడను నేను గాని యది కాదు."

"మీ పిల్లను మా పిల్లవాని కిమ్మని మిమ్ము బతిమాలినామా? చెప్పు."

"బతిమాలుట కేమున్నదమ్మా! మగపెండ్లివారి కాఁడుపెండ్లి వారు సర్వవిధములచేతను లొంగి వర్తింపక తీఱదు."

శ్రీనివాసము తన వాక్చాతుర్యముచే వియ్యపురాలి కోపమును జల్లార్చి వచ్చినవారి కందఱకును భోజనము పెట్టించెను. ఎట్లో యైదు దినములును గడచినవి. వివాహము పూర్తియయ్యెను.

౧

గ్రహఁ మనఁగాఁ బన్ను. అది చెల్లించు నూళ్ళ గ్రహారము లనిపించు
కొనును. గ్రహారములు కాని వగ్రహారములు. రాజులు తమ సంస్థా
నములం దితర వృత్తులు లేక, కేవలము వేద శాస్త్రాధ్యయనము
మాత్రమే చేసి, యందపార పాండిత్యము సంపాదించి, తన్నాశ్ర
యించు శిష్యకోటికి ఫలాపేక్షారహితమగు వాత్సల్యాతిశయమున
నహోరాత్రము లోపికతో నధ్యయనము చేయించుచు పండిత తల్లజు
లకును, దదీయ శిష్యులకును గ్రాసార్థమై యొక్కొక గ్రామ మిచ్చు
నాచారము కలదు. ఆపండితు లా గ్రామాదాయమువలనఁ దామును
శిష్యులును జీవించుచు వేద శాస్త్రాభివృద్ధి గావించుచుండిరి. అగ్ర
హారము లనున వన్నియు నిట్లేర్పడినవే.

ఇట్లు సదుద్దేశముతో నేర్పడిన యగ్రహారములు రాను రాను
విపరీత ఫల ప్రదములు కాఁజొచ్చెను. క్రమముగా నా పండిత వంశ
ములందు సదాచార సంపద లేక, వేద శాస్త్రాధ్యయనమునందు
విషబుద్ధులై, యశ్రద్ధధానులయి, వర్తించు సోమరిపోతు లుదయింపఁ
దొడఁగిరి. ఆ కారణమున సాధారణముగా సనాతనధర్మము లడు
గంటెను. వేదశాస్త్రాధ్యయనము లంతరించెను. యజ్ఞయాగాదుల
మాట యట్లుండ, నిత్యములగు సంధ్యావందనాదికర్మములు గూడ
వెనుకఁ బడియెను. సత్కార్యాసక్తి యున్మూలిత మయ్యెను. సంత
తము పవిత్రములయి, వేదఘోషలతో నిండి బ్రహ్మతేజోవిరాజ
మానములై, శమదమాదిగుణములకు నిలయములై యొప్పు నగ్ర
హారము లిప్పుడు విపరీతములయి మాలపల్లెలన నొప్పుచున్నవి. అయి
నను దొల్లింటి మహానుభావుల పోలిక లిప్పటి యగ్రహారవాస్తవ్యు

లందు లేకపోలేదు. పూర్వులు ప్రాతస్స్నానసంధ్యాదికృత్యనిరతులు. వీరో సంధ్యావందనాదులడుగంటిననుమధ్యాహ్నస్నానపరాయణులు. వారు సంతతహూయమానాగ్నిహోత్రులు. వీరో సంతతము ధూమపత్రాగ్నితత్పరులు. వారు నిరంతరము వేదశాస్త్రాధ్యయనసంపన్నులు. వీరో నిరర్థకవాక్కలహాభిరతులు. వారు యజ్ఞాదులనిమిత్తము భూమి దున్నుచుండెడివారు. వీరో సస్యాదులకై భూములు దున్నుచున్నవారు. వారు శమదమాదిగుణసంపన్నులయి యంతర్ముఖులై వర్తించెడివారు. వీరో యెల్లతగవులందును బాలుగొని బహిర్ముఖులయి మొనగాండ్రయి వర్తింతురు. వారు రాజసభాంతరములఁ గూర్చుండెడివారు. వీరో రచ్చసావిడులందును, రథ్యావృక్షమూలములందును గూర్చుందురు. వారు తమవంటి విద్వద్వరులతో వాదించెడివారు. వీరో యక్షరజ్ఞానశూన్యులగు రైతులతో వాదములు సల్పుదురు. వారు వాదించునవి తర్కవ్యాకరణాది శాస్త్రవిషయములు. వీరు వాదించునవియో ఎడ్లు, బండ్లు, గోవులు, బఱ్ఱెలు, భూములు, తోటలు, దొడ్లు, మొదలగు విషయములు. వాదములందుఁ బ్రతివాదులను గెల్చి రాజులవలన ధన కనక వస్తు వాహనాదులను బహుమతి వడసి తెచ్చుకొనుచుండెడివారు. వీరో శుష్కకలహములఁ బెంచుకొని తుదకుఁ బ్రతివాదులతోఁ హస్తాహస్తి, కచాకచి, దండాదండిని బోట్లాడి తుదకుఁ దమ ధనములను రాజసభలకుఁ గొనిపోయి యచ్చటివారికి లంచము లిచ్చుకొనుచుందురు. అగ్రహారికుల శీలములు, వృత్తములు, కృత్యములు, రానురా నిట్లు మాఱిపోయినవి. ఆంగ్లేయవిద్య ధర్మమాయని వారు స్వగ్రామములు వదలి యప్పటికి మిగిలియున్న భూము లమ్ముకొని, యిండ్లు వాకిళ్ళు మంటఁ గలిపి, పుర ప్రదేశంబు లొనర్చి వచ్చియు గాని నా ల్గింగ్లీషు ముక్కలు నేర్చుకొని, కచ్చేరీలయందు సేవకులు గాఁ

జేరి, యింటికి వచ్చునప్పుడును, గచ్చేరికిఁ బోవునప్పుడును నొక గాడిదె మోయఁజాలినంత బరువుగల కాగితపు కట్టల మోసికొని పోవుచు నిరువదినాల్గు గంటలును బనిచేసినను, బూర్వ సంచిత పాప కర్మములవలెఁ దఱుగకపోవుటచేఁ బై యధికారి వర్గముచేఁ బలు రక ములగు చీవాట్లు దినుచుఁ దాము తెచ్చుకొనుచున్న నెల జీతములు తమ పొట్టపోషణమునకుఁ జాలమిచే నాహార నియమము గల్గి క్రమ ముగా జవసత్వము లుడిగి, జీవచ్ఛవములవలె నిట్లు వర్తించుచుండిరి కాని, లేనిచో వార లింద్రునికైనను, లేక వానిని సృష్టించిన బ్రహ్మ కయినను లొంగి తిరుగుదురా? రామయ్యగ్రహార వాస్తవ్యులు చాలవఱకీ తరగతికిఁ జెందినవారే. అయినను నది పెద్ద యగ్రహార మగుటచేఁ దక్కినివాసవలె నామ మాత్రావశేషము కాలేదు. అం దింకను పూర్వమువలె వేదశాస్త్రాధ్యయన సంపన్ను లయి, భూములపై ధనాదాయము గలవారు కొందఱుగలరు. మఱికొందఱు వ్యవసాయాదివృత్తులతోఁ జీవించుచు నందే కాలము పుచ్చువారు గలరు. ఈ రెండవ తరగతివారు ధనమందు మాత్రమే దరిద్రులు గాని మూర్ఖత్వమందును, మచ్ఛరమందును, వృధా వాక్కలహ మందును, నెంతమాత్ర మట్టివారు కారు. ఇదివఱకే యా యూరి బ్రాహ్మణులలోఁ బెక్కండ్రు కొకరితో నొకరికిఁ బ్రబల ద్వేషము గలదు. ఆ కారణమున వారు దమ పగ సాధించుకొనుటకై స్వల్పాం శములనుగూడ గొప్పవారినిగాఁ బరిగణించుకొనుచు, నితరుల పశు వులు తమ పొలమును మేసివేసిన వనియో, తమ పొలమునకుఁ బాఱు నీటి నితరు లన్యాయముగా వారి పొలములకుఁ బాఱించు కొనిరనియో, తమ పాలికాపు నవతలవారు నిష్కారణముగాఁ గొట్టి రనియో, లేక తమ్ము వారనరాని మాటలాడి తమ గౌరవమునకు భంగము కల్గించిరనియో, మిష కల్పించుకొని యెదుటివారితోఁ

గలహించి, వీ రయినప్పు డెల్లఁ దమ తమ బలాబలములను బట్టి
దేహశుద్ధి గావించుకొని, యభియోగములు తెచ్చుకొనుటకై కచ్చే
రీలకుఁ బోవుచు నెలలకొలఁది నచ్చటనే పూటకూళ్ళమ్మ యింట
భుజించుచు, ధనము కాక, యమూల్యమగు తమ కాలమునే కాక,
తమ యారోగ్యమునుగూడఁ జెడఁగొట్టుకొనుచు నుండిరి. ఆ యూర
నెగువదిగువ వీధులవారి కెప్పుడును వైరమే. అందులోను మొన్నటి
వివాహము పూర్తి యైనప్పటినుండియు, నా వైరాగ్ని దీపింప నారం
భించెను. ఇప్పుడు కేవల మెగువవీధివారందఱు మాత్రమే యొక్కటి
కాలేదు. దిగువవీధివారిలోఁ గొన్ని కుటుంబములవారుగూడ వీరి
తో నేకీభవించిరి. ఇదివఱలో శత్రుత్వము వహించినవా రిప్పు డెట్లు
సఖ్యము వహించిరని యనుమానింపఁ బనిలేదు. ఆగ్రహారిక జనులు
సామాన్యముగా నాకాశభాగమున వాయు సంచాలితములగు మేఘ
ములవంటివారు. క్షణములోఁ గూడుకొందురు. క్షణములో విడి
పోవుదురు. క్షణములో నతి కలుషవంతులు. క్షణములో నతి నిర్మ
లులు. వారి చిత్తములును, చిత్త వృత్తులును క్షణక్షణ భిన్నములు.
మఱియు, నట్టు లెగువవీధివారితో సఖ్య పడినవారిలోఁ గొందఱకు
రామావధాని తమవలెఁ గాక ధనసంపన్నుఁడై యుండెనని కోపము.
కొందఱ కతఁ డవసరముల ధన మిప్పియ్యలేదని కోపము. ఏటేటఁ
దాము సిస్తు చెల్లింపకపోయినంత మాత్రమున నతఁడు తమకుఁ
భూములు సాగుబడి కీయలేదని కొందఱకుఁ గోపము. ఇట్లు వీ రంద
ఱేకీభవించి యెట్లయినను రామావధానినిఁ గచ్చేరీ కీడ్చించి యేడ్పిం
చుటయే కాక యతనిని దమవలె దరిద్రునిగాఁ జేయ సంకల్పించు
కొనిరి. వీ రవకాశము లభించినపు డెల్లను నెగువవీధియం దున్న
రామ మందిరమందో, లేక సోమరిపోతుల కయి నిర్మింపఁబడిన
రథ్యావృక్ష మూలస్థిత వేదికలందో కూర్చుండి పలు పలు విధముల

నాలోచనములు చేయుచుండురు. "జ్ఞాతిశ్చేదనలేనకి"మ్మనెడి లోకోక్తి ప్రకారము, తన పెదతండ్రి కుమారుఁడగు రామావధానియందు సంత తద్వేషము వహించు శ్రీనివాసరావు వీరి కందఱకును నాయకుఁడు. శ్రీనివాస రామావధానులకు జ్ఞాతిమూలక వైరమేకాక, మఱియొకటి కూడఁ గలదు.

శ్రీనివాస రామావధానుల జనకు లేకోదరులు. వారు పిత్ర్యము లగు భూములను సమముగాఁ బంచుకొనిరి. ఆదాయవ్యయములు గుర్తించి వర్తింపని కారణమున శ్రీనివాసరావు తండ్రి కొంత ఋణము చేసెను. తదనంతరమున శ్రీనివాసము తన చదువుకై రామావధాని యొద్ద కొంత యప్పు పుచ్చుకొనెను. శ్రీనివాస మప్పెప్పటికిని దీర్చక పోవుటచే వెనుకటి ఋణదాతలు వ్యాజ్యము వేసి శ్రీనివాసరావు భూములను గృహమును వేలము పాడింప నందులో రామావధాని తనకు శ్రీనివాస మీయవలసిన యప్పు దీఱుటయే కాక గృహము తన గృహములోను, భూములు తన భూములలోను గలిసి యుండును గదా యన్న తలంపున నావలవారి కియ్యవలసిన ధనము నిచ్చివేసి యింకను మిగిలినది శ్రీనివాసమున కిచ్చి గృహము భూములు పుచ్చుకొనెను. ఆక్రయధన మైనను నొకరిచ్చుదానికంటె నధికముగానే రామావధాని చెల్లించెను. అయినను, తన గృహక్షేత్రములందలి యాశచేతను, దా నతని కీయవలసిన యప్పు నడుగ మొగమోటమి చేతను, రామావధానియే యా రెండవ ఋణదాతను లేవఁదీసి యింత చేయించెనని శ్రీనివాసరా వూహించి తత్కోపముచే నతనికి శత్రు వయ్యెను. అతని కోపాగ్నికిఁ దమ దురాలాపము లనెడి శుష్కేంధనములు దవిలించి మండింపఁజేసినవా రా యూరివారిలోఁ జాల మంది గలరు.

ఇట్లు వీ రందఱును గూడి చేసిన దురాలోచన ఫలమే, రామావ

ధాని యింట వివాహభంగముగాఁ బరిణమించినది. అయినను వారి కంతటితోఁ సంతృప్తి గలుగలేదు. ఇంకను నవకాశము లభించినపు డెల్లను రామావధానిని మట్టిపెట్టుటకే వారి దృఢసంకల్పము. ఇంకను దమ పక్ష మభివర్ధింపవలెనని తలంచి శ్రీనివాసము శ్యామసుందరుని తోఁ జుట్టఱికము చేసినప్పటినుండియుఁ దానును, దన సహాయులును నతనిని దమలోఁ గలిపికొని రామావధానియం దతనికి ద్వేషమును హెచ్చించిరి. వివాహభంగమునకుఁ దానే కారకుఁ డయ్యెను, శ్యామసుందరుఁడు రామావధాని తన కేదో గొప్ప యవమానము చేసినట్లు భావించి వర్తించువాఁడు గావునఁ దన వియ్యంకునితో సులభముగా నేకీభవించెను. ఏకీభవించుటయే కాదు, శ్యామసుందరుఁడు యూరివారి ప్రోత్సాహముచేఁ గుగ్రామమగు రావూరు కాపురము వదలి యగ్రహారము వచ్చి శ్రీనివాసము గృహమందుఁ గాపురముండెను. ఆ యూరివారు ధనసంపన్నుఁ డగు నతఁడు తమ గ్రామము వచ్చినందుల కమితానందమును సూచించుచు, రాత్రిందివములతని నాశ్రయించి తిరుగుచుండిరి. గర్భదరిద్రులును, సోమరిపోతులును నగు నా యూరి విప్రు లేమిషనైనను నతనివలన ధనము లాగఁ బ్రయత్నించుచుండిరి. కాని సర్వమును రాచుకొని తిను నాకుటాయి వంటి యా లుబ్ధుఁడు వారికిఁ గొఱుకఁబడునా? ధన విషయమునఁ గాక యతఁ డన్నివిధములచేతను వారితోఁ గలసి మెలసి వర్తించి వారి కానందము గూర్చుచుండెను. ఇట్లతని వియ్యంకుఁ డగు శ్యామసుందరుఁడు తమ యింట విడిసి, తనకు మాఱుగాఁ దన సహచరులకు నాయకుఁ డయి, తన శత్రువగు రామావధానిపై పగ సాధించుటకు నడుము గట్టుకొన్నందులకు శ్రీనివాసము మిక్కిలి సంతసించెను. ఈ యెగువవీధి చర్యలు విన్నప్పుడు రామావధాని కుటుంబమువారా దుష్టులు దమ కెప్పు డెట్టి చిక్కులు సంభవింపఁజేయు

దురో యని భయపడసాగిరి. కాని రామావధాని కట్టి భయ మిం తేనియుఁ గలుగలేదు. ఎగువవీధియే కాదు మఱికొన్ని యూళ్ళు చేరి యైనను సత్ప్రవర్తనగలిగి యితరులతో సంబంధము కల్గించుకొనక యుండెడి తన్నువా రేమి చేయఁగలరని యతని యుద్దేశము. కాని దురాత్ములు నిరపరాధులగు సాధువులను గూడ బాధపెట్టక మాన రన్న యంశ మతఁడు గ్రహించెనో లేదో?

౨

రుక్మిణి—(చిఱునగవుతో) ఏమోయి! రామంబావా! ఎప్పుడు రాఁక?

రామారావు—(ప్రతిమందస్మితముతో) నీవు చూచినప్పుడే!

రు— పరిహాసమున కేమి? కాని నీ వెప్పుడు వచ్చితివి?

రా—ఎక్కడనుండి?

రు—ఇంగ్లండునుండి.

రా—వారముదినములకు ముందే వచ్చితిని.

రు—ఇంతకాలమునకుఁ బెండ్లమును, జుట్టములను, జూడవలె నని బుద్ధి పుట్టినది కాఁబోలు.

రా—కాదు. మా తండ్రిగారికిఁ జాల జబ్బుచేసినది. వెంటనే రావలయునని కేబిలువార్త వచ్చినది. అందులకై వచ్చితిని.

రు—(విచారమును సూచించుచు) ఆఁ, ఏమీ! జబ్బుచేసినదా? ప్రస్తుతము మామగారెట్లున్నారు.

రా—తిరిగి జన్మించినారని చెప్పవలసి యున్నది. ఎట్లయిన నేమి? దైవానుగ్రహమువలనఁ బ్రస్తుతము సుఖులై యున్నారు?

రు—పోనిమ్ము,—నీ యదృష్టము బాగున్నది. దాని కేమి? అక్కడ నందఱకును కుశలమా?

రా—ఎక్కడ?

రు—ఇంగ్లండులో,

రా—(పరిహాసముతో) ఆఁ, దొరలకు, దొరసానులకు నందఱకును—

రు—(తిరస్కారముతో) నీదొరలు, నీ దొరసానులు, ఎవరికిఁ గావలయును?

రా—మఱి యెందఱు ననగా?

రు—(పరిహాసముతో) బావ యెంతచదివినను దెలివి యెప్పటి వలెనే యున్నదన్నమాట నేఁడు సార్ధకమైనది. ఇంగ్లండు వెళ్ళి చదివిన నేమి? అమెరికాకు వెళ్ళి చదివిన నేమి? లోకజ్ఞాన మెట్లు రాఁగలదు?

రా—(నవ్వుచు) మఱి యీ గూఢవచనము లేల? స్పష్టముగా నడుగరాదా?

రు—ఓ వెఱ్ఱిబావా! నీ వంత చక్కగా గ్రహించికొంటె ప్రశ్నము లడుగుచున్నావు. కాని నా యడిగిన దెవ్వరి కర్థము కాదు?

రా—(నవ్వుతో) మా తమ్ముని కుశలము నడుగుచున్నావా?

రు—కాక మఱేమి? నీ దొరలు, దొరసానులు నా కేల? వా రంద ఱేమయిపోయిన నా కేమి? తుదకా యింగ్లండా శాంతి సముద్రములో మునిఁగిపోయిన నా కేమి?

రా—మీ తమ్ముఁడు కుశలియా యని యడుగరాదా? అంత ద్రావిడప్రాణాయామ మెందులకు?

రు—(నవ్వుచు) ఇంగ్లండుదొరల కోమలహృదయములకు నా

ప్రశ్నము కంఠోష్ఠ మగునని నా కేమి తెలియును?

రా—అబ్బ! మాటలాడనీయకున్నావే? అందులకే మన పెద్దలు చదువువచ్చిన యాఁడుది వంట—

రు—ఓహో! ఇంతకాలమును పాశ్చాత్యదేశములం దుండి చదివి నేర్చుకొన్న సారాంశ మిదియా? ఆఁడుది చదువుకొన్నఁ బనికి రాదన్న హైందవచాందసత్వము నీ హృదయము నింకను నంటిపెట్టుకొనియే యున్నదియా? బావా! నీ వంతకాలమునుండి యింగ్లండులో నున్నావు కదా! చదువుకొన్న దొరసానుల నెందఱనో చూచి యుందువు. ఎక్కడనో చూడనేల? నీవు చదువు తగగతిలోనే పెక్కురుండవచ్చును. వారందఱును జెడిపోవుచున్నారనియే నీ యభిప్రాయమా? స్త్రీవిద్య దేశాభివృద్ధికిఁ బ్రధానహేతువని సంస్కర్తలెందఱో ఘోషించుచుండ నీవు కృతయుగపురుషునివలె మాటాడెదవేమి?

రా—ఓహో! చదువు వచ్చినంతమాత్రమున స్త్రీసంఘము బాగుపడుననియు, దేశాభివృద్ధికిఁ గారణ మగుననియు నీవు చెప్పఁగలవా? ఏ దొరసానియో, ఏ సంఘసంస్కర్తయో వచ్చి మీ కిది యుపదేశించినారు కాఁబోలును. రుక్మిణీ! ఇంగ్లండులో స్త్రీసంఘ మంత స్వేచ్ఛాసంచారిణియై వర్తించుటకుఁ గారణము చదువే యని నా తలంపు. వారి ప్రవర్తన మరయుఁగా నిఁకఁ గొన్నిదినములలో వారు పురుషులను బశువులవలెనే యిష్ట మున్నపుడు కొని, యిష్టము లేనప్పు డమ్మివేయు పద్ధతికి వత్తురని నాకుఁ దోచుచున్నది.

రు—పురుషు లిదివఱలో నాచరించినది స్త్రీ లిప్పు డాచరింతురు; తప్పేమి?

రా—స్థూలదృష్టి కది తప్పుగాఁ గనఁబడదు. కాని సంఘాభివృద్ధి కది యెట్టి భంగకరమో యాలోచించితివా? స్త్రీ పురుషు లిరు

పురుసు సంసారరథమునకుఁ జక్రములవంటివారు. ఒం దేచక్రము వెనుకఁ బడినను రథము ముందునకుఁ బోదు. అందుచే స్త్రీపురుషులన్ని విషయములందును—అనగా, గౌరవమునందును, మర్యాదయందును, జ్ఞానమునందును, గార్యనిర్వహణమునందును, సమానులయి వర్తింపవలయును.

రు—చదువునందక్కఱలేదా ?

రా—కావలెను. కాని ప్రస్తుతకాలపు చదువక్కఱలేదు. అది స్త్రీల కనావశ్యకము. కేవలము జ్ఞాననేత్రమును దెఱపింపఁజేయు చదువుండినఁ జాలును. బుద్ధికి సంస్కార మొసంగినఁ జాలును.

రు—ఇప్పటి చదువులు జ్ఞానసంస్కారముల నీయఁజాలవా ?

రా—ఈయకపోవు. ధనార్జనమునకుఁ దోడుపడునట్లు జ్ఞానసంస్కారమునకుఁ దోడుపడవు.

రు—బావా! నీమాట లనుభవమునకుఁ గేవలము విరుద్ధములు. ఇప్పుడు చదువుకొనుచున్న బి. ఎ. లకు, ఎం. ఎ. లకు జ్ఞానసంస్కారము లలవడలేదందువా ఏమి ?

రా—అది కాదు నా యభిప్రాయము. సామాన్యజ్ఞానము గల్గించు చదువు వేఱు. విశేష జ్ఞానము గల్గించు చదువు వేఱు.

రు—బావా! నీవు చెప్పినది తడపేరువలె నున్నది. నా కేమియు నర్థము కాలేదు.

రా—ఇప్పటికాలమున విద్య రెండువిధములని పరిగణింపవచ్చును. ఒకటి సామాన్యవిద్య. రెండవది యుత్తమవిద్య. ఇంకను స్పష్టీకరింపవలె ననినచో సామాన్యముగా లోకవ్యవహారమునకుఁ బనికివచ్చుచు జ్ఞానము నిచ్చు విద్య సామాన్య మనియు, నొక్కొక శాస్త్రమునందుఁ బరిపూర్ణజ్ఞానమును గల్గించి ధనాదాయకమగునది యుత్తమమనియు నిర్ణయింపవచ్చును. పూర్వకాలమున విద్యావిషయ

మున నిట్టి విభేదము లేదా యని యడుగుదువేని, వినుము. ఉన్నను నిట్టి విభేదము లేదు. అప్పటి చదువునకు జ్ఞానమే ముఖ్యఫలము. ఒక శాస్త్రమును బరిపూర్ణముగా నభ్యసింపవచ్చును. లేక తగు మాత్రమే నేర్వవచ్చును. అభ్యాసమును బట్టి జ్ఞానము వృద్ధియగు చుండును. ఎట్లు చదివినను నెంత చదివినను జ్ఞానమే ప్రధానోద్దేశ మగుటచే జ్ఞానము లో మాత్రమే భేదము గాని తక్కినవానిలో లేదు. పూర్వము వైద్యశాస్త్ర మభ్యసించె ననుకొనుము. అట్లభ్యసించిన వాఁ డందు జ్ఞానమును సంపాదించి తనకు వీలగునంతవఱకు లోక మునకుఁ దోడ్పడుచుండెను. పూర్వము లోకసహాయతయే ముఖ్య ముగాఁ బరిగణింపఁబడుచుండెను. ఇప్పు డట్లు కాదు. వైద్య మభ్య సించువారు, తాము సంపాదించిన జ్ఞాన తారతమ్యమును బట్టి యు ద్యోగపదవులను, దాని కనుగుణమగు ధనమును సంపాదించుచున్నారు. ఇప్పటి చదువునకు ధనార్జనమే ముఖ్యఫలము కాని వేఱు కాదు. అందుచే విశేష జ్ఞానము గల్గించి ధనార్జనమునకుఁ దోడ్పడునది మాత్రమే యుత్తమవిద్య యని పరిగణింపఁబడుచున్నది. ఇందువలనఁ దేలిన సారాంశ మేమందువా యుద్యోగముల నాశించి ధన మార్జించు వారికే కాని తక్కినవారి కుత్తమవిద్య యనవసర మనియు, నందుచే స్త్రీలకు ధనార్జనాదులతో నిమిత్తము లేదు కావున వారి కుత్తమ విద్య యనవసర మనియు నా యభిప్రాయము.

రు—ఇదియే పక్షపాతము. పరమేశ్వరుఁడు పురుషులకువలె స్త్రీలకుఁ గూడ బుద్ధి జ్ఞాన బలాదు లొసంగియుండ వీరు మాత్ర ముత్తమవిద్య యేల యభ్యసింపరాదు? ఉద్యోగపదవుల నేల? పొంద రాదు. ధనము నేల యార్జింపరాదు?

రా—ఇందుఁ బక్షపాత మేమియును లేదు. నేను స్త్రీల కనవసర మంటిని గాని వలదని చెప్పలేదు. పరమేశ్వరుఁడు పురుషులకువలెనే

స్త్రీలకుఁ గూడ మనోబలాదుల నొసంగినను నవి గృహపరిపాలన మందు మాత్రమే యుపయోగింపఁదగిననని యతని యభిప్రాయము.

రు—అతని మనస్సులో నీవు చొచ్చి చూచి వచ్చినట్లు మాటాడుచున్నావు. వీ రెల్లప్పుడును వంటయింటిలో నొకమూలఁ బడి యుండవలయు ననియు, నిరువదినాలుగుగంటలును బసరమువలెఁ బాటు పడి యూరుపేరులేక యుండవలయు ననియు, బరమేశ్వరుని యభిప్రాయమా? స్త్రీసంఘము నిట్లు నీచముగాఁ జూచుట పురుషులకుఁ దగునా? అందుచేతనే పశ్చిమఖండములందు స్త్రీ స్వాతంత్ర్యమునకు బహుయత్నములు జరుగుచున్నవి. అట్లే మన దేశమునఁ గూడ స్త్రీ లేకీభవించి పురుషులను ధిక్కరించి స్వాతంత్ర్యమును సంపాదింప వలెను. అంతియ కాని పురుషులు తమంత తాము స్త్రీలకు స్వాతంత్ర్య మిచ్చెదరా?

రా—ఆహా! రుక్మిణీ! స్త్రీసంఘ మెట్టి దురభిప్రాయ పడుచున్నది! కష్టము! కష్టము!

రు—బావా! నీవు మా స్త్రీల దృష్టితోఁ జూచిన నీ కది దురభిప్రాయ మనిపించదు.

రా—ఆఁ. ఏమీ! నేను స్త్రీసంఘము నధోలోకమున కణచి వేయవలెనన్న మూర్ఖుడ ననియే భావించుచున్నావా! రుక్మిణీ! నే నట్టివాఁడను కాను. నే నడిగిన ప్రశ్నములకు సరిగ ప్రత్యుత్తర మిచ్చెదవా?

రు—ఓ! తప్పక. అడుగుము.

రా—పురుషులకంటె స్త్రీ లెందులో నస్వతంత్రలోఁ గొంచెము చెప్పెదవా!

రు—ఒకదానిలోనా! స్త్రీలు సర్వవిషయములలోను నస్వతంత్రలే!

రా—అదియే! వివరముగాఁ జెప్పుము.

రు—విద్యావిషయమున నస్వతంత్రలు గదా?

రా—ఆవిషయమై యిదివరకే చర్చించితిమి.

రు—అవును. అందు నీవాదము సరియైనదికాదు. ఉత్తమ విద్యస్త్రీల కేలవలదు? ఉన్నతోద్యోగము లేలచేయరాదు? ధనమేల యార్జింపరాదు? పురుషునివలె స్త్రీగూడ ధనమార్జించి తెచ్చుచున్నచో కుటుంబపోషణ విషయమై పురుషులకుఁ గొంతభారము తగ్గునుగదా? స్త్రీలకుఁగూడ నట్టి గౌరవమును బురుషులేల కలిగింపరాదు?

రా—ఆహా! ఎంత యవివేకము. రుక్మిణీ! భారతదేశమున నుత్తమజాతి స్త్రీలు పురుషులవలెఁ గాయకష్టములపడి పొట్టపోషణకయి ధనమార్జింప వలసినంతి దౌర్భాగ్యస్థితి యింకను రాలేదు. ఆదుస్థితి రాకపోవుటచేతనే మనపవిత్ర భారతదేశమింకను గొనయూపిరితో నున్నది. సత్యమాలోచింపఁ బ్రపంచమునఁ గల యన్ని తెగలవారికంటెను భారతీయులు స్త్రీల విషయమై చూపుచున్న మహాగౌరవ మిదియే. ఆంగ్లేయు......

రు—చాలు. చాలు. గొప్పగౌరవమే? పొయిమూలఁగూర్చుండఁబెట్టుటయే స్త్రీలకుఁజేసిన మహోపకారము (అని వికటముగా నవ్వును)

రా—రుక్మిణీ! నీ యవివేకమునకు నాకు నిజముగా నవ్వువచ్చుచున్నది. స్త్రీని పొయిమూలఁ గూర్చుండఁబెట్టుటయని హీనముగా మాటాడితివి. దానినిబట్టి యాలోచింప స్త్రీలుగూడఁ బురుషులవలె వీథులలోను, కచేరీలలోను, సభలలోను, నుద్యోగములలోను, విచ్చలవిడిగాఁ దిరుగవలెనన్న యభిప్రాయము వ్యక్తమగుచున్నది. అది సత్యమే కాదా?

రు—అవును. కాకేమి?

రా___నిజమాలోచింప స్త్రీపురుషవ్యక్తులలో స్త్రీవ్యక్తి యమూల్యమైనది. వంశస్థితికి మూలమైనది. పూజ్యమైనది. అమూల్యమగు రత్నమును నీవు చిల్లపెచ్చువలె నిర్లక్ష్యముగాఁ జూచి పాఱవేయవు. పెట్టెలోఁబెట్టి దాతువు. పూజ్యమైన దేవతాపీఠమును, మైలబట్టలతో నపరిశుభ్రముగా వీధులందుఁ ద్రిప్పవు. అమూల్యరత్నము పాఱవేయఁదగినది కాదు. దేవతాపీఠము వీధులందుఁ ద్రిప్పఁ దగినది కాదు. అట్లే స్త్రీలమూల్య వస్తువులు. పూజ్యురాండ్రు. వారు కేవలము గృహదీపికలు. నాల్గాశ్రమములలో నొకదానికి హేతుభూతలు. కావుననే శ్రీరాముఁడు తనభార్యనుజూచి “ఇయంగేహేలక్ష్మీః” యని వచించినాఁడు. రుక్మిణీ! స్త్రీలెప్పుడును గృహమందు కైదీలవలె బంధింపఁబడుచున్నారని వాదించు వారు గూడఁ గలరు. కాని యది కేవలము భ్రాంతియని నామతము. గృహస్థాశ్రమము నిజముగా నొకచిన్న రాజ్యమంటిది. ఆరాజ్యమునకు గృహమే రాజధాని. స్త్రీయే దానికధికారిణి. రాజ్ఞి. పురుషుఁడామెకు మంత్రివంటివాఁడు. మంత్రి రాజ్యాంగములను జక్కఁపఱిచి రాజునకెట్టి కొఱతయు లేకుండఁ జేయుచుండును. అట్లే గృహమేధి గృహమునకుఁ గావలసిన సకలసంభారములను సంపాదించి గృహిణి (రాజ్ఞి) కెట్టిలోపమును రాకుండఁ గాపాడుచుండును. ఆగృహిణి పురుషుఁడు గొనివచ్చిన వస్తువులను యథోచితముగా నుపయోగించి వలసిన పదార్థములను సిద్ధముచేసి తనపరివారమును, భర్తను, గృహమునకు వచ్చిన బంధువులను, నతిథులను బోషించును. పరిపా......

రు___బావా! చాలు. చాలు. నీయుపన్యాసము. ఈరీతిగా నుపదేశించి పురుషులింకను నిట్లెంతకాలము స్త్రీలకన్నులలో దుమ్ముగొట్టెదరో తెలియదు. బావా! ఆవిషయమై నేనుజెప్పెద వినుము. స్త్రీలు నీవన్నట్లు రాణులుగారు. వంటలక్కలు. ఇంటనున్న యంద

ఆకును బరిచారికలు. గృహమునందేలోపము వచ్చినను ముందుగాఁ జీవాట్లుదినువారు స్త్రీలు. ఉదయము మొదలాసాయమును వంచిన నడుమెత్తకుండఁ బనిచేసి వండి వడ్డించుట రాజ్ఞీత్వమా? ఇంటివారి కందఱకును బరిచర్యలుచేసి లోపమేదేని గల్గినచో వారిచేఁ జీవాట్లు దినుట గృహాధికారమా? చాలు. చాలు గృహమొక యరణ్యము. అందున్న యాఁడుపడుచులు, మఱఁదులు, బావలు, అత్తలు క్రూర శార్దూలములు. అందు స్త్రీయొక మృగశాబకము......

రా—రుక్మిణీ! ఆగు. ఆగు, నీయల్పజ్ఞానమునకుఁ బరితపించుచున్నాను. మూఢురాండ్రగు స్త్రీలు కొందఱు గృహము నరణ్యముగాఁ జేసికొన్నవారు గూడ లేకపోలేదు. కొందఱు స్త్రీలత్తింటికేగి పలుబాధ లనుభవించినవారును గలరు. అంతమాత్రమున లోకమంతయు నొక్కరీతిగా నుండునని చెప్పవచ్చునా? మఱియు వెనుకటిబాధలు మూఢత్వమువలనఁ గల్గుచున్నవి. ఆమూఢత్వము పోవుటకు విద్యాభ్యాస మావశ్యకము. విద్యవలన యుక్తజ్ఞానము వడసి యెవరిధర్మములువారు గ్రహించి వర్తించినచో నెట్టిబాధలును సంభవింపవు. అప్పుడు గృహ మరణ్యముకాదు. భూలోకస్వర్గము. అప్పుడత్తింటివారు క్రూరశార్దూలములుకారు—స్నేహదయాగౌరవపాత్రులగుహితులు—అప్పుడత్తింటికోడలు నీవన్నట్లు మృగశాబకము కాదు, నిజముగా గృహకమలమున నవతరించిన లక్ష్మీదేవి. ఇట్టిలోపము లెక్కడనున్నవో పరిశీలించితివా?—సంఘమునందుఁ గలవు. ముందుగా సంఘమునందుఁగల యిట్టి స్వల్పలోపములను దొలఁగించి సంఘమును సంస్కరింపవలయును. సంఘసంస్కర్తలని పేరుపెట్టుకొని వర్తించువారు ముందుగా నిందులకు యత్నింపవలయును. సంఘమునిట్లు సంస్కరించి జ్ఞానసంపన్నముగాఁ జేసినపిమ్మట నప్పుడాలోచింపుడు. స్త్రీపురుషులలో నెవరెట్లు వర్తించుట బాగో యోజింపుఁడు. నిజమగు

సంఘసంస్కరణ మనగా నది. అంతియకాని స్త్రీలాచరింపవలసిన పనులు పురుషులును, పురుషులాచరింపవలసినవి స్త్రీలు, చేయవలయు నన్నంతమాత్రమున సంస్కరణ మగునా? స్త్రీలున్నతవిద్యకై రాత్రిం దివములు శ్రమపడి యుత్తీర్ణలై యుద్యోగపదవులను బొందినంత మాత్రాన, సభలకెక్కి పురుషులవలె దీర్ఘోపన్యాసము లిచ్చినంతమాత్రాన, నుదయాస్తమయములందుఁ బురుషులచెట్టఁ బట్టుకొని విశ్రాంతిస్థలముల విహరించినంతమాత్రాన, సంఘమభివృద్ధి పొందునని యెన్నఁడును దలంపకుము.

రు—(నవ్వుచు) బావా! స్త్రీలు వంటలక్కలై వంటయింట నుండుటవలననే సంఘ మభివృద్ధి చెందునని యా నీ యభిప్రాయము.

రా—అట్లని నే నెన్నఁడు ననలేదు. అనను. రుక్మిణీ! మాటి మాటికిని వంటలక్కలు వంటలక్క లనుచున్నావు లోకములో స్త్రీ లందఱు న ట్లున్నారని చెప్పఁగలవా? ప్రజలు ధనికులనియు, సామాన్యులనియు, బీదలనియు మూఁడు తరగతులు గలరు. ఉద్యోగులు గూడ నదే విధముగా నున్నారు. ధనవంతులు గాని యున్నతోద్యోగమువలన నెక్కుడుగా ధన మార్జించువారు గాని తమ తమ భార్యలను వంటలక్కలనుగాఁ జేయలేదు. వారు భర్తలిచ్చు ధనము గృహకార్యములకై వినియోగించుచు, వంటలక్కలచేతనో వంటబ్రాహ్మణులచేతనో వండించి తన పతికిని పరివారమునకు నెట్టి లోపమును గల్గనీయక నిజముగా గృహరాజ్యము నేలుచు సుఖించుచున్నారు. వారల నటుండనిమ్ము. ఇఁక సామాన్యుల నాలోచింతము. ఇట్టివారే దేశమున లెక్క కెక్కువగా నున్నారు. ధనాదాయము తక్కువగుటచే ధనికులవలె సామాన్యులు వైభవముతోఁ గాలము పుచ్చలేరు. సామాన్య ధనాదాయము గలవారు గాని సామాన్యోద్యోగపదవులం దున్నవారు గాని కుటుంబపోషణకై పై తరగతివారివలెఁ గాక

యొక్కడు శ్రమపడవలసి యుండును. చాలినంత ధనము లేకపోవుటచే నింట స్త్రీలు గూడ శ్రమపడవలసి యుండును. పురుషులు కచేరీలకుఁ బోయి నెత్తినచేయి దింపకుండఁ గాగితములు వ్రాసి వ్రాసి విసివి పోయి యధికారులు పెట్టు చీవాట్లను సహించుచు నెట్లో ధన మార్జించి తెచ్చుచుండ నింట స్త్రీలు మాత్రము శ్రమపడి పురుషులు తెచ్చు ధనమును సద్వినియోగము చేసి పతిని బరివారమును, దన్ను ను బోషించుట తప్పగునా?

రు—తప్పే! అట్లు చేయనేల? ఆర్జించువాఁ డొక్కఁడు, తిను వారు పదిమంది యుండుటచే నిట్లు శ్రమపడవలసి యున్నది. మా స్త్రీల వాద మేమనగా, మేమును మీవలెఁ జదువుకొని యుద్యోగ ములను జేసి ధన మార్జించినచో కుటుంబపోషణము విషయమునఁ బురుషులకు శ్రమ యుండదుగదా? ఇంతే కాక స్త్రీ లింట బందీల వలె మూలబడి శ్రమపడ నక్కఅలేకుండ హాయిగా దిరిగి రావచ్చును. స్త్రీ పురుషు లిరువురును దెచ్చు ధనము కుటుంబపోషణమునకుఁ బుష్కలముగా నుండును. ఇన్ని లాభము లుండ......

రా—రుక్మిణీ! నీయభిప్రాయము తెలిసినది. ఉద్యోగములు చేసి స్త్రీలుగూడ ధనమార్జింతు మనుచున్నారు. ఇంటనుండి పనిచే యుటకంటె నుద్యోగములు చేయుట సులభమని నీతలంపుగాఁబో లును. అట్లెన్నఁడును భ్రమపడకుము. మీరు చదువుకొని గుమాస్తా లగాఁ జేరినచో నెత్తినచేయి దింపకుండ దినమునకు బండెడుకాగిత ములు వ్రాయవలసియుండును. ఇంకను గాలముచాలనిచో నింటికిఁ దెచ్చుకొని కూడఁ బాటుపడవలయును. లేక ఉపాధ్యాయినులుగా జేరినచో గొంతుకపగులునట్లు బాలురకో బాలికలకో బోధింపవల యును. శ్రమపడకుండ ధనమెట్లు వచ్చును? చేసిన పొరపాటుల కధి కారులును తలవాచునట్లుగాఁ బెట్టుచీవాట్లుమిగులును. రుక్మిణీ! ఈయు

ద్యోగములు చేసిన స్త్రీల కెట్లు సుఖమబ్బునో చెప్పుము? ఇంతకంటె స్త్రీ లింటనుండియే తగురీతిని శ్రమపడి పలువురనోళ్లలోను బడక, యధికారుల నిందావాక్యములకు గుఱిగాక కాలముగడపుట మేలు కదా? కుటుంబపోషణకుఁ జాలినంత ధనమక్కఱలేదా యని యందు వేమో వినుము. స్త్రీయుఁ బురుషుఁడు నిరువురును ధనమార్జించి తమయింటిని, దమసర్వస్వమును, దమ జీవనోపాధిని నొకవంటలక్క కప్పగించి యామెపెట్టునది తిని పరాధీనజీవన మొనర్చుటకంటె స్త్రీ లింటిపట్టుననుండి పురుషుఁడు తెచ్చిన ధనమును యుక్తముగా విని యోగించి కుటుంబమును బోషింపవచ్చును గదా? నీవు నీయింటిని బాగుచేసినట్లు వంటలక్క బాగుచేయదు నీవు నీధనమును వస్తు సామగ్రిని బొదుపుగా వాడినట్లు వంటలక్క వాడదు. వంటలక్కలకుఁ గాని వంటబ్రాహ్మణులకుగాని గృహాధికార మిచ్చినచో బదిరోజులకు సరిపడు భోజనసంభారము లొక్కరోజునకు సరిపుత్తురు. మీ రెంత తెచ్చిపోసిన నేమిలాభము? దక్షతలేని యింటికి వేఱొకచోటనుండి లక్షలకొలఁది పదార్థములు వచ్చినను మిగిలియుండవు. ఎన్ని నదీప్రవాహములు పాఱినను గండెపడిన తటాకములో నీరు నిలువదు. పైనుండి తెచ్చిన పదార్థములను పొందికగా వినియోగించువారింట నొకరుండ వలెను. ఆగృహనీతి స్త్రీకిఁ దెలిసినట్లు పురుషులకుఁ దెలియదు. రుక్మిణీ! ఇంట స్త్రీలు వంచిన నడుమెత్తకుండఁ బనిచేయవలయునని మాటిమాటికి ననుచున్నావు. ఏపనియుఁ జేయకుండ నుండుట సుఖమని నీయభిప్రాయమా! అట్లయినచోఁ గుంటివారు గ్రుడ్డివారు మిక్కిలి సుఖవంతులని భావింపవలయును. ఱాలు బండలు పడినచోటునఁ గదలకుండ నుండును. అదియు సౌఖ్యమనియె భావింపవలసి యుండును. పరమేశ్వరుఁడు మనకిచ్చిన యవయవములచేఁ దగురీతిని బనిచేసినప్పుడే దేహసౌఖ్యము, ఆరోగ్యభాగ్యము గల్గును. అట్లు పాటుపడి గృహ

మును శుభ్రిపఱిచి తననేర్పుచే భూతలస్వర్గముగాఁ గల్పించుకొని యత్యంతశ్రమపడి వచ్చినపతికిఁ బరిచర్యలొనర్చి సంతసింపఁజేసి యతనివలన గౌరవముపడసి సుఖించి సంసారమునకు ముఖ్యఫలమగు సంతానమును బడసి పోషించుచు దత్సంగతివలను దానును బతియు నపారసౌఖ్యానందములను జెందుచు నుండిన గృహమ్మెప్పుడెట్లుండునో తెలియునా? దీనికంతకును హేతుభూతలు స్త్రీలే కదా?

రు—అవునుగాని స్త్రీలు బిడ్డలను గను యంత్రములనుగాఁ జేయవలయునని నీయూహాయా?

రా—అవునవును. రుక్మిణీ! ఇట్లు వాదించువారు గూడఁ గొందఱున్నారని యెఱుఁగుదును. వారు కేవలము మూఢులని చెప్ప వలయును. స్త్రీలను యంత్రములతోఁ బోల్చు టత్యంతావివేకము. యంత్రములు వస్తువుల నుత్పత్తి చేయుచున్నట్లు స్త్రీ పురుషులే పిల్ల నుద్భవింపఁ జేయుచున్నారని వారి తలంపు. ఆహా! ఎంత యవివేక ము. సంతానము పడయుటకు స్త్రీ పురుష సంగమమమే కారణమని వారి యభిప్రాయము కాఁబోలును. అది కేవలము పొరపాటు. సంతానము పడయుటకు స్త్రీ పురుషసంగమము నిమిత్తకారణము. ప్రధాన కారణము భగవత్సంకల్పము. అట్లే కానిచో స్త్రీ పురుష సమావేశము గల్గినంతమాత్రమునఁ బిల్లలు పుట్టవలసి వచ్చును. పిల్లలు లేని గొడ్డుదంపతులకు సంగమము లేదనియే చెప్పఁగలవా? సంతానము కనుటకును గానుటకును స్త్రీ పురుషుల యిష్టము కాదు. భగవదనుగ్రహ మిళితమగు పూర్వపుణ్యమువలన సంతానము గల్గు చుండనదియు నిప్పటి యల్పబుద్ధులకు వెగటనిపించుచున్నదే. ఆ పాతరమణీయము లగు నిట్టి యుపదేశము లొనర్చి జాతిమతసంఘాభి వృద్ధికి హేతుభూతలగు యువతీమణుల నిట్లు గృహధర్మములకు విముఖులను జేయు మీరు సంఘసంస్కర్తలా? లేక సంఘసంహర్తలా?

లోకమునఁ జెడుగు వ్యాపించినంత వేగముగా మంచి వ్యాపింపదు. పెట్టెలలో నున్న రత్నములవలె మాఱుమూల పల్లెటూళ్ళలో నున్న పవిత్ర హిందూసుందరులను బయిటికిఁ దీసికొని వచ్చు సంఘసంస్కరణ వ్యామోహము నేమనవలెను? రుక్మిణీ! ఇట్టి వ్యామోహములకుఁ లోఁ బడకుఁడు. సనాతనధర్మములను విడిచిపెట్టకుఁడు. గృహధర్మములను త్యజింపకుఁడు. పూర్వులు దూరదృష్టితో నేర్పఱిచిన పద్ధతులన నాలోచితముగా నల్పదృష్టితోఁ ద్రోసి పుచ్చకుఁడు. చదువుకొండు. జ్ఞాన మార్జింపుఁడు. గృహములం దుండు దురాచారములను ముందుగాఁ దొలఁగింపుఁడు. పిమ్మట సంఘదురాచారములను మడియింపుఁడు. అప్పటికిని సంఘమందు లోపము లుండిన సంస్కరించుకొనవచ్చును.

రు—బావా! పూర్వు లేర్పఱిచిన పద్ధతు లన్నియు మంచివనియే నీ తలంపా?

రా—కాక మ తేమి?

రు—కాదు.

రా—ఆ విషయ మిప్పుడు చర్చింప నవకాశము లేదు. (అని లేచును.)

రు—మ ఱెప్పుడు వచ్చెదవు.

రా—రేపు.

రు—కాఫీ కిక్కడికే రావలెను జుమా.

రా—అట్లే.

## 3

రామారావు దా యూరు కాదు. పొరుగూరు. రామయ్యాగ్రహార ములో మెఱక వీధిలో నతని పినతల్లిగారియిల్లు గలదు. రామారావు చిన్నతనమునందే మాతృహీనుఁడై పినతల్లిచేఁ బోషింపబడెను. అతనికిఁ బినతల్లియం దమితభక్తి. తండ్రి దుస్సహరోగపీడితుఁడై మృత్యువునోటఁబడ సిద్ధముగా నున్నాఁడని వార్త వచ్చినందున రామారా వింగ్లండునుండివచ్చి తండ్రి దైవానుగ్రహమువలనఁ గొన్ని దినములకు స్వస్థచిత్తుఁడుకాగా నతని యనుమతినిబొంది తిరిగి యింగ్లండునకుఁ బ్రయాణసన్నద్ధుఁ డయ్యెను. కాని తనతండ్రిని జూడ వచ్చిన పినతల్లి తమ యూరువచ్చి రెండుమూఁడు దినములయినను నుండకతీఱదని పట్టుపట్టుటచే రామారావు చేయునదిలేక రామయ్యాగ్రహారమునకు వచ్చెను. అతఁడును, నతని స్నేహితుఁడగు సుదర్శనరావును గలిసి చదువుకొనుట కింగ్లండున కరిగి రెండుసంవత్సరములయినది. రామావధాని కూతురగు రుక్మిణియే యా సుదర్శనుని భార్య. ఆతఁడు తన భార్యక్షేమోదంతము తెలిసికొని రావలయునని కోరెను. అందుచే రామారావు రామావధాని యింటి కరుగుటయు రుక్మిణితో సంభాషించుటయు సంభవించినది.

ఇదివఱలో రుక్మిణి నాతఁ డెఱుఁగును. కాని యప్పు డామె ముగ్ధ. ఇప్పు డామె యువతి. ఆమె శరీర మిప్పుడు యౌవనవిలాసములతోఁ దొలఁకాడుచు, వర్షాకాలనదివలెఁ గనులకు విందుసేయుచుండెను. ఇప్పు డామె చూపులందుఁ జాంచల్యము, వాక్కులందుఁ జాతుర్యము నెలకొనియుండెను. హిందూసుందరీమణులం దిట్టి సౌందర్యము వాక్చాతుర్యము, విద్యాపాటవము గలదని రామారా వెఱుఁగఁడు. రూప

మందును, చమత్కారమందును, వాక్చాతుర్యమునందును, వివేకము నందును, బాశ్చాత్యస్త్రీలు రుక్మిణిముందు దిగదుడుపునకయినను బనికిరారని రామారావు గ్రహించెను. అతఁడు పినతల్లి యింటికి వచ్చెను. పినతల్లి యతని కత్యాదరముతో సరసపదార్థములు సిద్ధము చేసి యుంచెను. కాని యతఁడు రోగివలె నేమియును భుజింపలేక పోయెను. పినతల్లి చేసిన సరసపదార్థములకంటె రుక్మిణి పలికిన సరస పదార్థములే యతనికి మిక్కిలి యింపుగనుండెను. "నాయనా! అదేమి? ఏమియుఁ దిన్నావు కా" వని పినతల్లి యాత్రముతోఁ బ్రశ్నించెను. రామావధానిగారి యింట నల్పాహారము గుడుచుటచేఁ దన కాకలి లేకపోయెనని యతఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అయి యుండునేమోయని యిఁక నామె యతని బ్రశ్నింపలేదు.

రామారావెట్లో భోజనము ముగించి లేచిపోయెను. చిఱుతిండి తినుటచే నాఁడు తన కొడుకు కేమియు భుజింపలేకపోయెనని పాప మాతని పినతల్లి గొణుగుకొనుచునే యుండెను.

అది వేసవికాలము. శుక్లపక్షము. వెన్నెల ముదిరిన దినములు. చందురుఁడు తనకాంతి సంతతులలో లోకము నోలలాడించుచుండెను. చల్లని మెల్లగాలి ప్రసరించి పగటిపూటఁ జండభానుని తీవ్రకిరణము లచే వాడివత్తిలయిన లోకమునకుఁ బ్రాణము వోయుచుండెను. పినతల్లి కొడుకుఁ బండుకొనుటకై నడివాకిట మంచము వేసి మెత్తని పరుపు నమర్చి దానిపై మల్లెపువ్వువలె మిక్కిలి తెల్లనగు ధౌతవస్త్ర మును బఱచెను. ఆవెన్నెలలో నా మలయమారుతములో నా సెజ్జ శయనించినవారి కధికసౌఖ్యము నీయకపోదు. దానిపైఁ బండినంత మాత్రమున మానవులు నిద్రాదేవత విభ్రమములకుఁ జిక్కి పరవశులు కాకపోరు. భుజించి లేచినవెంటనే రామారావాతల్పమున శయ నించెను, కాని నిద్రాకాంతయాపరమవిరక్తునిఁ గొంచెమైనను వంచింప

లేకపోయెను. అతఁడు మంచమున వెలికిలఁబండుకొని నీలాకాశసరో వరమధ్యమున వెలుఁగొందు తెల్లతామరపువ్వువలెఁ దోఁచు చంద మామ నీక్షింపసాగెను. అతని కాచంద్రకిరణపరంపరామధ్యమున రుక్మిణి సుందరరూపము తాండవమాడుచున్నట్లుండెను. ఆసుందరి తళుకుబెళుకు చూపులును మందహాసలలితవదనారవిందమును, నవమల్లి కాకలికావళిని నిరసించు దశనపంక్తియు నా వెన్నెలలో మాటిమాటికిఁ బొడకట్టుచునే యుండెను. నిమీలితనేత్రుఁడై యతఁ డాజవ్వనిరూప మునే ధారణ చేయుచుండెను. ఊహాలు సముద్రతరంగములవలెఁ బరంపరలుగా వెడలఁ జొచ్చెను. భావనాప్రపంచమున నా మానిని రూపమును వీక్షించుచున్నను దానిని బ్రత్యక్షముగాఁ జూడకుండ నుండుట యతనికి మిగుల దుస్సహమయ్యెను. ఆమెను సందర్శించు టకు మఱునాఁటిదాఁక గడువుపెట్టినందుల కపు డతఁడు మిగుల వగవ నారంభించెను. మఱునాఁడు వచ్చెదనని చెప్పి యీనాఁడే యంత రాత్రివేళ వెళ్ళుట యనుచితమని తలపోయఁజొచ్చెను. అతఁ డిట్లు భావనాతరంగపరంపరాఘాతములచే నలయుచున్న సమయమున నతని పినతల్లి భుజించి యిల్లు సవరించుకొనివచ్చి యతని మంచమునకు సమీపముగా నేలను జతికిలపడి యతనితో "నాయనా! విదేశ ములలో మిక్కిలి కష్టపడుచున్నావు. బాబూ! ఈదేశపు కూరలు దొరకునా? ప్రతిదినము పప్పు వండుదురా! భోజనము బాగుగా నుండునా?" యని యవ్యాజమగు పుత్త్రిప్రేమతో నడుగఁ జొచ్చెను. కాని యీ పలుకులు రామారావునకు వినఁబడలేదు. అతఁ డందులకు సమాధాన మీయకపోవుట గాంచి యీ వృద్ధ, తన కుమారుఁడు నిద్రించినాఁ డనుకొని యచ్చోటు వదలిపోయి శయనించెను. కాని యతఁడు నిద్రింపలేదు. నిద్రాసుఖమున కతఁడు మిగుల యత్నించెను. కాని పంతము పట్టినట్లు నిద్రాకాంత యీతని

చెంత కయినను జేరలేదు. కామపరితప్తుడై విపరీత వర్తనుఁడగు
నతని సమీపింప స్త్రీలు సాహసింపఁగలరా? ఆతఁడట్లే శయనించి
యుండెను. ఊరంతయు మాటు మణఁగెను. ప్రకృతి యంతయు
నిస్తబ్ధమై యుండెను. చంద్రుఁడు క్రమముగాఁ బడమట దిశ నలంక
రించెను. ఎన్నియో నక్షత్ర పరంపర లతని విపరీతావస్థను జూచి
పరిహాసించుచున్న వేమో యన్నట్లు మిక్కిలి ప్రకాశించుచు నీలా
కాశమునఁ బ్రయాణమును సలుపుచుండెను. అవి యన్నియు రామా
రావు చూచుచునే యుండెను. కొంతసేపటికి రాత్రి గంభీరభావ
మును విడిచి వెలవెల పాఱెను. ఇట్లు రామారా వారాత్రి యంతయు
జాగరణము చేసి యతి కష్టమున శయ్యాతలమును వదలి కాల్యకర
ణీయములు నిముసమాత్రము నెఱవేర్చి “ప్రాతఃకాల భోజనము
సిద్ధము చేయుచున్నాను. తిని వెళ్ళు”మని పినతల్లి బతిమాలినను
వినక నాఁడు రామావధానిగారి యింటికిఁ గాఫీ త్రాగుటకు వెళ్ళెద
నని చెప్పి యందుల కామె యిచ్చు ప్రత్యుత్తరమును వినిపించు
కొనకయే వెడలిపోయెను. ఇతఁ డరుగునప్పటికి రుక్మిణి సర్వము
సన్నద్ధముచేసి, వచ్చిన రామారావు నాదరించి, పాలిపోయిన ట్లున్న
యతని ముఖమును జింతనిప్పులకన్నను నరుణారుణములగు నతని
నేత్రములను గాంచి మందహాస కాంతులు కపోళయుగమునఁ దాండవ
మాడుచుండఁ గాఫీయును, తినుబండములు నతని చెంతకుఁ గొని
వచ్చుచు “బావా! నేఁడు నీ ముఖ మేల యంత వెలవెల పోవు
చున్నది? కన్నులు కలు ద్రావిన ట్లంత రక్తము లైనవేమి? రాత్రి
పేకాడుచున్నావు కాఁబోలును. మరల నింగ్లండునకుఁ బోయినచో
నిట్టి వినోదముల కవకాశము లేదని యట్లు చేసితివి కాఁబోలును.
నీవు జాగరణము చేయుచుండఁ జూచి మీ పినతల్లి యూరకుండునది
కాదే” యని పల్కుచుండ రామారా వందులకు సమాధానము

చెప్ప లేక, ప్రసంగాంతరమునకు మార్చవలెనని యెంచి "రుక్మిణీ! ఈ యుపమ నీవే సిద్ధము చేసితివా? బాగు. బాగు. మిక్కిలి రుచిగా నున్నది. ఈ యుపమ నిరుపమానముగా నున్నది. ఈ కాఫీ శంకర విలాసును మించిపోవు చున్న దేయని పల్కుచు నామెను బొగడుచు, దృష్టిగ్రదిని త్రావెను. రుక్మిణి మందహాస శోభిత వదనారవిందయై, తన తళుకు బెళుకు చూపుల నెడిగాలముచే నతని మనోమత్స్యమును బట్టి బయటికి లాగుచున్న ట్లతని దృష్టి పఱపి సమీపమునఁ గూర్చుండెను. రామారావు ద్రేకపూరితుఁడై గాలి తాకున సుడి వడు నెండుటాకు విధమున సంచలించు చిత్తమును గొంతవఱకైనను లొంగదీసికొనలేక ప్రకృతికి మీఱిపోయి యుండెను. అందుచే రుక్మిణితో నేదో చెప్పఁబోయి మెలుగురాల్పడుటచే నిఁక మాటాడ లేకపోయెను. ఇ దంతయు నెఱుఁగని రుక్మిణి యెప్పటియట్లు సమీ పముననే కూర్చుండి "ఏదీ! బావా? నిన్నటి తరువాయి వాదింతువా?" అని పలికెను.

మానసోద్రేకమును గొంత మరలించుకొని గొంతు సవరించుకొని "కానిమ్ము. నీ వడుగదలచిన దేదో అడుగు" మని పలికెను.

రు—పూర్వు లేర్పఱచిన పద్ధతు లన్నియు మంచి వనియే నీతలంపా?

ఆమె యట్లడుగుచున్నపుడు రామారావు రుక్మిణి చేతఁబట్టుకొని యామె తొడపై నుంచుకొన్న యొక మాసపత్రికను వంగి తీసికొనెను. అతఁ డట్లు తీసికొనుట పత్రికాపేక్షచేఁ గాదు. రుక్మిణి శరీర స్పర్శ కపేక్షించి యట్లు చేసెను. రుక్మిణి యే మఱిపాటుతో నుండుటచే నతని మనోరథ మీడేఱెను. దానివలనఁ నతఁ డమృత ప్రవాహమున మునిగినంత సౌఖ్య మనుభవించినట్లు భావించెను. ఆకస్మికముగాఁ బరపురుషస్పర్శ సంభవించినందులకు రుక్మిణి ద్రుళ్ళి

పడెను. కాని యీ వికారము తన చిఱునవ్వు కాంతి సంతతులలోఁ గన్పడనీయక "బావా! చెప్పవేమి? నా యడిగినదానికి సమాధానము చెప్పవేమి?" అని మరల నడిగెను.

ఉద్రేకాతిశయముచే రామారావట్లు రుక్మిణి శరీరమును దాకియు, నకార్యకరణ మాచరించితి నేమోయన్న భయ ముదయించుటచేఁ గొంచెము స్వస్థుఁడై తన చేతిలోనున్న మాసపత్రిక పుటలు తిరుగువేయుచు "రుక్మిణీ! నీ ప్రశ్నమునకు సమాధానము చెప్పుచున్నాను. నీ వట్లు సమూహముగా నడిగిన నెట్లు సమాధాన మీయఁగలను? నీ వడుగఁ దలంచిన దేదో ప్రత్యేకముగా నడుగుము" అని పలికెను.

రు—పూర్వు లేర్పఱిచిన ధర్మనిబంధనలు స్త్రీపురుషుల కిర్వురకును సరిగానే యున్నవా?

రా—కాకేమి?

రు—స్త్రీలవిషయమై పక్షపాతము చేయలేదా?

రా—లేదు. ఏమి చేసియున్నారు?

రు—పసి బాలికలకు వివాహము విధించుట పక్షపాతము కాదా!

రా—నీవు చెప్పిన విషయములలో మహర్షులు స్త్రీపురుషుల విషయమై సమబుద్ధితోనే వర్తించినారు.

రు—పెండ్లియన నేమో యెఱుఁగని పసిపిల్లలకు వివాహము విధించుట చూడ కేవలము స్త్రీలయెడలఁ బక్షపాతము చూపింపఁగా నీ వట్లందు వేమి?

రా—రుక్మిణీ! నీవు పొరపడుచున్నావు. హిందూమత ప్రకారము ప్రతి వ్యక్తికిని జేయవలసిన కర్మజాల మెంతో కలదు. అట్టి కర్మాధికారము గల్గుటకు ముందుగా సంస్కారము లొనర్పవలయును.

పురుషున కుపనయన సంస్కారమువలె స్త్రీలకు వివాహ సంస్కారము విధింపఁబడినది. పూర్వులు స్త్రీ పురుషుల విషయమై సమబుద్ధితో వర్తింపలేదా?

రు——లేదు. స్త్రీల కా సంస్కారమే మహాపదల నొదవించు చున్నది. బాల్య వివాహము స్త్రీల జీవనము నధోలోకమున కణఁచి వేయుచున్నది కాదా!

రా——ఎట్లో, చెప్పగలవా?

రు——నోరెఱుఁగని పిల్లలకు వివాహములు చేయుచున్నారు. ఒకవేళ దాని పతి మృతినొందిన నిఁక నా బాలిక గతి యేమి కావల యునో చెప్పవలయునా? దేశమున వితంతువులసంఖ్య యెంత హెచ్చి పోవుచున్నదో నీకుఁ దెలియదా?

రా——రుక్మిణీ! మఱి యేమిచేసిన యుచితమని నీయూహ?

రు——స్త్రీలకు యువతీవివాహములు——అనఁగా నధమపక్షము పదునాఱు వత్సరములకు లోపున వివాహ మొనర్పరాదు. దానివలన నెన్నో లాభములు.........

రా——రుక్మిణీ! ఆగుము. ఆగుము. అట్లుచేయుటవలన వితంతువులసంఖ్య తక్కువగునని నీయభిప్రాయమా ఏమి? అట్లిప్పుడును కాదు. ఎనిమిది తొమ్మిదేండ్ల ప్రాయము మొదలుకొని యుండవలసిన వితంతువు లిప్పుడు పదునాఱేండ్ల ప్రాయముమొదలుకొని యుందురు. ఇందు తారతమ్య మేమిగలదు?

రు——అది కాదు. బాలికలకు యుక్తవయస్సు వచ్చినప్పుడు వివాహమైనచో, తాము వరింపఁబోవు పురుషుని గుణాగుణములు చక్కగా నాలోచించి యోగ్యతముని నెంచుకొనఁగలరు. దానివలన నిహలోకయాత్ర పరమసుఖముగా నడుచును. వివాహ స్వాతంత్ర్య ము స్త్రీలకు లేనిచో లాభములేదు. అది తల్లిదండ్రులపై విడిచినచో

వారే సామాన్యునికో పెండ్లిచేయుదురు. దానివలన స్త్రీజీవనము దుఃఖదాయకమగుచున్నది.

రా—అయ్యో! ఎంత విపరీతముగా మాటాడుచున్నావు! తమ కుమారికిఁ దల్లిదండ్రు లవగుణుఁడైన వరుని గట్టిపెట్టుదురా? ఎంతమాట యన్నావు! నిజముగా లోకములో స్త్రీకిఁగాని, పురుషునికిఁగాని పరమాప్తులు తల్లిదండ్రులు. వారు తమ బాలికవివాహము విషయమై యామె పుట్టుకనుండియు మంచివరునికై వెదకుచునే యుందురు. విద్య, ధనము, వయస్సు, కులము, సాంప్రదాయము, ప్రవర్తనము మొదలగు నవెన్నియో యోజింతురు. లోకానుభవజ్ఞాతలగువారు పరిశీలించినట్లు యౌవనవతులగు వారు పరిశీలింపనేలేరు. పదునాఱేండ్లు వచ్చినంతమాత్రమున లోకజ్ఞాన మంకురించునా? భావిసుఖదుఃఖములను, సర్థానర్థములను నిర్ణయించుకొనఁగలదా? యౌవనావిర్భావవశమున యుక్తాయుక్తము లెఱుఁగక యయోగ్యునే యెన్నుకొనునేమో! తలిదండ్రుల వరాన్వేషణము విపరీత మెప్పుడును గాదు. నూటి కొకటి కోటి కొకటి యుండినది లెక్కింపఁదగినది కాదు.

రు—బాల్యమునందే వివాహమైనచో స్త్రీల కున్నతవిద్య రాదు.

రా—ఆవిషయము యిదివఱలో చర్చించితిమి.

రు—బాల్యవివాహములవలన మఱియొక పెద్దచిక్కున్నది. స్త్రీవివాహిత కాఁగానే యామె యందు భర్తకేకాని తల్లిదండ్రులకు స్వాతంత్ర్యము లేకున్నది. తగిన వయస్సు రాకమునుపే పిల్లలతల్లియై తన్నును, తన సంతానమునుగూడ మిగుల దుర్బలులనుగాఁ జేయుచున్నది. దుర్బలులగాఁ జేయుటయే కాదు, తనకును దన సంతానమునకునుగూడఁ బ్రాణనాశమును గల్గించుచున్నది. ఇది దేశమున

కెంత నష్టమో తెలుపవలయునా?

రా—నీ వన్నది గొప్ప కారణము కాదు. అది దంపతుల యొక్కయు, బెద్దలయొక్కయు నియమములకు లోఁబడియుండును. సామాన్యముగాఁ బెద్దలు నూతన దంపతులను గొంతవఱకు సంపర్కము లేకుండఁ జేయఁగలరు. అప్పుడు నీ వన్న చిక్కు తొలఁగి పోవుచునే యున్నది. ఒకవేళ యువతులు తమ బుద్ధిచాంచల్యము వలననో, లేక చంచలహృదయులగు పురుషుల టక్కరి వచనములకు లోఁబడియో వివాహితకాకపూర్వమే నియమము నుల్లంఘించి సంతానవతు లయినచో నీవు చెప్పినదానికంటెను బెక్కు చిక్కుల పాలఁ బడవలసివచ్చును గదా! కామ మెట్టివారికిని నలంఘనీయమైనది. అది మనల నెప్పు డేవిధముగాఁ ద్రిప్పునో యెవ్వరును జెప్పఁజాలరు. కామాంకురములు తల యెత్తకపూర్వమే స్త్రీలు వివాహితలై యుండుట సర్వశ్రేయోదాయకమని మనపూర్వు లట్లు నిబంధనలొనర్చి యుండుట. అది స్త్రీ సంఘమున కపాయకర మెప్పుడును గానేరదు.

రు—దీని కేమి కాని పునర్వివాహము విషయమై పూర్వులు స్త్రీలయెడఁ బక్షపాతము చేసినారని యంగీకరింతువా?

రా—సర్వసములగు వారల్లల గావింతురు?

రు—బాగు. బాగు. నీ వాదము సరసముగానే యున్నది. పదియేండ్ల బాలికయైనను బతివిహీనయైనచో నిఁక యావజ్జీవము నట్లుండవలయునే కాని పునర్వివాహము వలనుపడదఁట. అరువదేండ్లవాఁడైనను పురుషుఁడు భార్యావియోగము నొందినచో భార్య మరణించిన పదుమూఁడవనాఁడే వేఱొక బాలికను బెండ్లాడవచ్చునఁట. దీని నేమందువు! ఇది సర్వ సమత్వమే కాఁబోలు.

రా—రుక్మిణీ! దీనికి సమాధానము చెప్పుట నీ వడిగినంత సులభమైనదికాదు. ఆ సమాధానమునకు ముందుగా నీ వొక యంశ

మును స్మృతిపథమున నుంచవలయును. ప్రస్తుతము లోక పరిస్థితులను జూచుచున్నావు కదా? విద్యావివేకశూన్యులై యూరుపేరు లేనట్టి యసమర్థులు కొందఱు పేరును బ్రతిష్ఠయు సంపాదింపఁ దలపోసి తమ మనోరథ మీడేర్చుకొన మార్గాంతరము కానక, సంఘసంస్కర్తల మని పేరు పెట్టికొని, సామాన్యులకు దురవగాహములగు ధర్మశాస్త్ర నిబంధనల సాంప్రదాయార్థములను గ్రహింపనేరక, నిజముగా స్త్రీ సంఘము నుద్ధరించుటకై జగతియం దవతరించిన పరమేశ్వరులవలె మాటాడుచు స్త్రీసంఘమునందు లేనిపోని యాందోళనము కల్గించుచున్నారు. ఆ సంఘ సంస్కర్తలు వచించినది సూక్ష్మదృష్టిచే నాలోచింపక యది సత్య మేమోయని భ్రమించి విద్యావతు లయ్యును గాలితాఁకున గదలు దీపశిఖ వడువునఁ జిత్తములు చలింప స్త్రీ లాందోళన మొంది యుక్తాయుక్తములు తెలియక స్వధర్మములు త్రోసిపుచ్చి ధర్మములను, ధర్మ నిబంధనములను, దత్కర్తలను గసిదీఱ నిందించుచున్నారు. నీ వా వాదోపవాదముల నన్నిఁటిని దూరముగాఁ ద్రోసియుంచుము. నిర్మలచిత్తవై వినుము. అప్పుడుకాని నీ వాక్యములు నీ బుద్ధికిఁ జొరవు. బుద్ధిని జొచ్చినగాని మంచిచెడ్డలను, లాభాలాభములను, యోజింపఁజాలవు. దీని తత్త్వమును దెలిసికొన సూక్ష్మ బుద్ధిని, దూర దృష్టిని నుపయోగించి చూడుము.

రు—అట్లే చేసెదను. కాని నీవు చెప్పఁదలఁచినది చెప్పుము.

రా—పూర్వులు స్త్రీలకుఁ బునర్వివాహ నిషేధ మెందుల కొనర్చిరో దానిని గూర్చియే చెప్పుచున్నాను, అంతియకాని యది యిప్పుడు సంఘ మాచరించుచున్నదా? ఆచరింప సాధ్యమా? యసాధ్యమా! యను నంశములను జర్చింపలేదు.

రా__మన మెన్నో జన్మము లెత్తి మన పూర్వకర్మ వశమున జంతుకోటిలో నుత్తమమగు మానవజన్మ మెత్తితిమి కాదా?

రు__అవును.

రా__ఇట్టి యుత్తమజన్మము పడసినందులకుఁ జిరకాలము నుండి వెంబడించి వచ్చుచున్న కర్మబంధనములనుండి మన యాత్మలను ముక్తులను జేయుటయే ముఖ్యఫలము కదా?

రు__నిశ్చయమే.

రా__అట్లు ముక్తి వడయుటకు మానవజాతి కంతయు నర్హత గలదు. మఱియు మానవులకుఁ బరమపదము మిగుల సమీపముగా నుండును.

రు__సరియే.

రా__ఆ పరమపదము చెందుటకుఁ బెక్కుమార్గము లున్నవి.

రు__అవి యేమేమి?

రా__కర్మ జ్ఞానభక్తి వైరాగ్యములు. అందు జ్ఞానమార్గము ముఖ్యము.

రు__అది స్త్రీపురుషుల కిర్వురకును సమానమే కదా?

రా__కాకేమి? జ్ఞానమార్గమవలంబించి స్త్రీపురుషులు ప్రత్యేకముగాఁ బరమపదంబును జెంద నర్హులే. కాని జ్ఞానవిషయమై మానవులందఱు నొక్క తరగతిలోఁ జేరఁగలరా?

రు__అది యసంభవమే.

రా__తక్కువవారికిఁ గూడ నొక ముక్తిమార్గము చూపవలదా?

రు__సత్యమే.

రా__తరువాతిది కర్మమార్గము. కర్మమార్గము ననుసరించి కూడ స్త్రీపురుషులు పెక్కురు గమ్యస్థానమును జేరఁగలరు. ఇందు స్త్రీపురుషులు గలిసి కర్మములాచరించి క్రమముగా ముక్తులగుదురు.

రు—"స్త్రీ పురుషులు కలిసి కర్మము లాచరించి" యని యన్నావు, అది చక్కగా వివరింపుము.

రా—మన వాదమునకుఁ గావలసిన ముఖ్యాంశమే యది. అది వివరింపకుందునా? కర్మమార్గమున నాల్గాశ్రమములు చేరి యున్నవి. అందు గృహస్థాశ్రమము ముఖ్యము. దానికి స్త్రీ ప్రధాన భూతురాలు స్త్రీ పురుషులు కలిసి యజ్ఞాదికర్మము లాచరించుటయే కాక తదాశ్రమమునకు సత్ఫలమగు సంతానమునుగూడఁ బడయవలయును.

రు—కావచ్చును.

రా—కాని సత్సంతానమును బడయుటకే యందఱకును గోరికకదా?

రు—అవును.

రా—తాదృశ సంతానము గావలయు నన్నచో నందులకుఁ గారకులగు స్త్రీ పురుషు లుత్తములయి యుండవలయును.

రు—అగుఁగాక.

రా—రుక్మిణీ! నీవు మఱియొకటి జ్ఞప్తియందుంచుకొనవలయును. సంతతికి స్త్రీ పురుషు లిర్వురును గారకులయినను బురుషునికంటె స్త్రీ ముఖ్యకారకురాలు.

రు—అది యెట్లు?

రా—సృష్టికి స్త్రీ పురుషులు నిమిత్త కారణ మేయైనను బురుషునికంటె స్త్రీకి ప్రాధాన్యము గలదు. మఱియు స్త్రీ పురుషులు క్షేత్రబీజములవంటివారు. క్షేత్రము తృణాదిసంకలితము కాకుండ నున్నప్పుడే సత్ఫలము లభించును. అట్లే పరపురుషాది సంపర్కము లేనప్పుడే స్త్రీ సత్సంతానమును బడయఁగలదు. దీని కేమందువు?

రు—స్త్రీలవలెఁ బురుషులుకూడ నుండవలదా?

రా—ఉండవలయును. ఇతర స్త్రీ సంపర్కాదులు లేకుండ నుండవలెను. అది ప్రధానమగు నీతియే. అది ముఖ్యమే. ఒకవేళఁ బురుషుఁడు తప్పి చరించినను సత్సంతానము చెడిపోదు. కాని పాపము తప్పదు. కాని స్త్రీ యట్లు తప్పి చరించిన పాపమే కాక సత్సంతానము గూడ గల్గదు. సత్సంతానలబ్ధియే లేకపోయిన గార్హస్థ్యము వ్యర్థమే కదా! కావుననే పూర్వులు స్త్రీపురుషుల విషయమై సమానముగానే నిబంధనలు విధించినను నీ సంతానము విషయమై స్త్రీల కెక్కుడుగా నిబంధనలు కల్పింపవలసివచ్చినవి. అంతియేకాని పక్షపాతముచేఁ గాదు. ఇఁకఁ బ్రకృత మనుసరింతము. "ప్రజాయై గృహమేధినా" మనునట్లు సత్సంతానమునకే వివాహము కావునను, తాదృశసంతానమునకు క్షేత్రభూతమగు స్త్రీయే ప్రధానభూతురా లగుటచేతను, పరపురుషసంపర్కాదిరాహిత్యము గల్గించుటకై స్త్రీ లకుఁ బునర్వివాహమును విధింపలేదు. నిజముగా సంతానకారకులగు స్త్రీలయం దట్టి దుష్టత్వమే యున్నచో సంతానము దుర్బలమగును. అనారోగ్యమగును. దానివలన దేశమునకు హానిగల్గును. కావుననే పూర్వు లట్లుచేసినారు. అంతియు కాని పక్షపాతముతచేఁ గాదు.

రు—పోనిమ్ము. పురుషసంపర్కము లేని బాలవితంతువులకుఁ బునర్వివాహ నిషధమేల ?

రా—చేయకతప్పదు. నీవు చెప్పిన ప్రకారము వితంతువు లను విభజింప నసాధ్యము. మఱియు నిందులకై పూర్వనిబంధన సూత్రమును గొంచెము సడలించితిమా, అది యంతకును హాని గల్గించును.

రు—అట్లని నోరెఱుఁగని బాలికలను బురుషసౌఖ్యవిదూర లనుగాఁ జేయవచ్చునా ?

రా—చేయుటకు మన మెవ్వరము ? వారివారి కర్మవశమున

వారికిఁ బురుషసౌఖ్యము సంభవింపనేరదు. కావుననే భర్త మరణించెను. మఱియు సౌఖ్యవిదూరలగుటకు వారి కర్మవాసనకారణమై యుండఁగా మఱి నాలుగు వివాహము లొనర్చినను సౌఖ్యము గల్గునను కొన్నావా? నియమభంగ మొనర్చుటయే కాని యావితంతువులకు సౌఖ్యమలవడనేరదనియే త్రికాలజ్ఞులగు మునులట్లు చేసినారు. ఇట్లుండ విషయసౌఖ్యమే పరమసౌఖ్యమని యెంచుకొను మన సంఘసంస్కర్తలు పాపము వితంతులకు సౌఖ్యము లేమ లేదని వాపోవుదురు. అందువలనఁ గల్గు లాభమేమి? పురుషులను గట్టుకొన్నంతమాత్రమున సౌఖ్యము గల్గునని వారు చెప్పఁగలరా? పోనిమ్ము కట్టుకొన్న స్త్రీలందఱును సుఖించుచున్నారని చెప్పఁగలరా? సుఖదుఃఖములు గల్గించుకొనుటకు మనకు లేశమైనను స్వాతంత్ర్యము లేదు.

అని పల్కిన రామారావు భాషణంబు లన్నియును విని మందహాస మొనర్చుచు "బావా! ధర్మశాస్త్రములు చెప్పుటకే కాని యాచరింప వీలులేదా?" అని యడిగెను.

రా—లేకేమి?

రు—ఇన్ని ధర్మములు తెలిసినవాఁడవు గదా! నీవాచరింపలేదేమి?

రా—ఆచరింపకేమి?

రు—(నవ్వుచు) నాచేత నూరక ప్రేలింపకు. నీ ధర్మమును నీ వించుకేనియు నాచరింపలేదు.

రా—మన మాచరించుచునే యుందుము. కాని ప్రారబ్ధకర్మమువలనఁ గొన్ని యనవకాశము లగును?

రు—ప్రారబ్ధమని చెప్పి యధర్మమార్గమునఁ బట్టిపోవచ్చునా?

రా—పోకతీఱదు. అది మన చేతులలో లేదు. మహాతపోనిష్ఠాగరిష్ఠులయ్యును విశ్వామిత్రాదులు కామవశులగుటకుఁ బ్రార

బ్ధము కాక మతేమి ?

రు—అందుచేతనేఁ గాఁబోలు ధర్మపత్నిని విడిచిపెట్టితివి ? ఇట్టి వానికెల్లఁ బ్రారబ్ధమే కారణము కాఁబోలును ?

రా—కాక మరేమి ?

రు—(నవ్వుచు) ఆ ప్రారబ్ధము నానారూపములు ధరించును గాఁబోలును.

రా—ఏమి ?

రు—నీ ధర్మపత్నిని విడుచుటలో నీ ప్రారబ్ధముకంటె నీ తండ్రియే ముఖ్యహేతువని నా నమ్మకము.

రా—అందుల కనేకము గారణములున్నవి. అవి యన్నియు నిప్పుడు చెప్ప వలనుపడదు.

రు—పోనిమ్మా. దానికేమి ? చాల నలసితివి. మిగుల సం తోషపెట్టితివి.

రా—(సంతోషించుచు) నే నెట్లు చేసినను నీవు నన్ను వట్టి మాటలతో సంతోషపెట్టుచున్నావు.

రు—మరేమి చేయుచుందువు ?

రా—నీకుఁ దెలియనిదేది కలదు ?

రు— (నవ్వుచు) ధర్మశాస్త్రజ్ఞులనధర్మమార్గమున వర్తింతురా?

రా—ప్రారబ్ధమొకటి కలదంటిని గాదా !

రు— మగల నెప్పుడు వచ్చెదవు ?

రా—నీ యనుమతి !

రు—ఈ రాత్రి భోజనమున కిక్కడికి వత్తువా !

రా—మా పిన్ని సమ్మతింపదు.

రు—పండుకొనుటకు.

రా—రమ్మన్నచో వచ్చెదను.

రు—మీా పిన్ని సమ్మతించునా ?

రా—సమ్మతింపఁజేయుట కేదే నుపాయము పన్నెదను.

రు—అసత్యమనుట కీ యుపాయపదము పర్యాయపదము కాఁబోలును.

రామారావు నవ్వుచు నూరకుండును.

రు—అట్లయిన రాత్రి యెనిమిదిగంటలకుఁ దప్పక రమ్ము.

రామారావు పరమానందభరితుఁడై వెడలిపోయెను.

## ౪

రామారావు ప్రాజ్ఞుఁడే. స్వధర్మములను దెలిసినవాఁడే. పాశ్చాత్య విజ్ఞానమునే కాక హైందవవిజ్ఞానము కూడఁ గలవాఁడే! యౌవనవంతుఁడైనను నింద్రియములను స్వేచ్ఛగాఁ బోనీయనివాఁడే! అయినను రుక్మిణి సౌందర్యమునకో, విద్యావిశేషమునకో, వాక్చమత్కారమునకో, తనయెడఁ జూపుచున్న యపరిమితపరిచయమునకో, లుబ్ధుఁడై, చంచలచిత్తుఁడై ప్రవర్తిల్లఁ జొచ్చెను. రుక్మిణితో శ్రీరంగనీతులు పల్కుచున్నను, నత్యంతవికృతమగు చిత్తము మాత్రము పెడదారిని నడువకపోలేదు. తన ప్రాణమిత్రుని భార్యావిషయమై తాను విరుద్ధప్రవర్తనుఁడగుట కేవలము మిత్రద్రోహమని యతఁడనుకొనక పోలేదు. పాపమని భావింపకపోలేదు. నీతి విరుద్ధమని గ్రహింపకపోలేదు. అయినను తన మనంబును ద్రిప్పఁజాలకపోయెను. అతఁడు చెప్పినట్లు నిజముగా నట్టి వికారము ప్రారబ్ధకర్మాధీనమే కావలెను. లేకపోయిన నట్టి గుణవంతుఁ డట్టి యభిలాషమునకుఁ దావిచ్చునా? అతఁ డింటికి వచ్చుచు మాటిమాటికిని రుక్మిణి వర్తనమునే

పరిశీలింపఁజొచ్చెను. ఇప్పటివఱకును దన చెవులలోఁ బ్రతిధ్వనించు నామె మధురవచనములను విమర్శించుచునే యుండెను. చిరకాల పరిచితుఁడగు ప్రాణభర్త సన్నిధినివలె నామె చూపుచున్న చనవునే మాటిమాటికిఁ గలఁపోయఁ జొచ్చెను. నిజము నతని నంతముగ్ధునిగాఁ జేసినది చనవే. తన మిత్రుని కుశలవార్త వినిపించుటకై తా నేగి నపుడు తన కభిముఖముగా నిలువఁబడి రుక్మిణి మాటాడి సిగ్గుపడు ననియే యతని తలంపు. కాని యట్లు జరుగలేదు. ఆమె తన చను త్కార వాక్సుధాకల్లోలినిలో నొక్క పెట్టున నతని ముంచివేసినది. అంతియకాక చెప్పలేనంత చనవుతో నతని చెంతను గూర్చుండి వాదించుచు నతనిని సమ్ముగ్ధుని గావించినది. ఆ రుక్మిణి యంత చనవు చూపింపక సముచితముగా మాటాడియుండినచో రామారా వంత చంచలచిత్తుఁడు కాకపోయి యుండును. ప్రాజ్ఞుఁడై యుండియు, పాపకార్య విముఖుఁడయ్యు, మిత్రద్రోహకరమగు నట్టి వాంఛితము నభిలషించియుండఁడు. రామారా వట్లు రుక్మిణి యనుమతిని బడసి యింటికి వచ్చెను. కాని కేవల మున్మత్తునివలెఁ బ్రవర్తింపఁజొచ్చెను. అతని చిత్తము మహాశమీరార సముద్ధత తరంగభంగురంబగు మహార్ణ వంబు ననుసరించుచుండెను. ఎంత యత్నించినను నతని స్వాంతము శాంతింపలేదు. తనభిలషితమను సరణీయమా, కాదా యను సంశయమే మాటిమాటి కతని బాధింపఁజొచ్చెను. సందిగ్ధావస్థకన్న మించిన దురవస్థ లోకమునలేదు. అట్టి దుర్దశకుఁ బాలయి రామారా వపరిమిత సంతాపము నొందుచుండెను. తా నట్టి కోర్కి కోరినంతమాత్రమున విద్యావతి యయ్యు, మగనాలయ్యు, తలిదండ్రుల మాటున వర్తించు చున్నదయ్యు, రుక్మిణి నీతిబాహ్యమగు నాపని కియ్యకొనుట కతఁడు నడుమ నడుమ నాశ్చర్య రసమగ్నుఁ డగుచుండెను. తన వాదోప వాదములువిని యారుక్మిణి తనవలెనే సమ్మోహ వివశయైన ట్లతఁడు

నిశ్చయించుకొనెను. తనవలెనే యామెయుఁ బ్రేమ విహ్వలయైనట్లు
భావించుకొనెను. అతఁడు ధర్మాధర్మములను బరిశీలించెను. నీతి
దుర్నీతులను దలపోసెను. యుక్తాయుక్తముల పరికించెను. కర్తవ్యము
నుగూర్చి పలువిధము లాలోచించెను. తుట్టతుద కా కార్యమునందుఁ
కృతనిశ్చయుఁడయ్యెను. తనయందంత యనురాగవతియగు కాంతను
విడుచుట మహాపాపమని యనుకొనెను. అతని మూఢమగు నామె
మనస్సును బయటఁ బెట్టించి యిప్పుడు కార్యవిముఖుఁ డగుట సము
చితము కాదని నిశ్చయించెను.

రాత్రి యెనిమిది గంటలయ్యెను. రామారావు భుజించి బయలు
దేరెను. నాఁడు పినతల్లి యేమి వండినదో, ఏమి పెట్టినదో, తా నేమి
తిన్నాఁడో యతని కేమియుఁ దెలియలేదు. భుజించునప్పుడు
పినతల్లి తనతో నేమి సంభాషించెనో దాని కతఁడేమి సమాధానము
చెప్పెనో యెఱుఁగఁడు. రామావధానిగారితో నతని యల్లునిగూర్చి
ముఖ్యాంశము లుచ్చరింపవలసి యున్నదనియు, నాడు రాత్రి యతిక్ర
మించినచో నచ్చటనే పండుకొందు ననియుఁ బినతల్లితో జెప్పి యామె
యందుల కేమి చెప్పెనో విననైనను వినక వెడలిపోయెను. ఇతఁడు
రామావధాని గృహమున కరుగునప్పు డతనినెదుర్కొని ముందుగాఁ
బల్కరించినది రుక్మిణియే. ఆమె యతని నెప్పటియట్లు సత్కరించి
యొక గదిలోనికి గొనిపోయెను. ఆ గది రామావధాని గృహమున
కొక మూలగా నుండెను. ఆ గది చిత్రపటములచే నలంకృతమై
యుండెను. అందు విశాలమగు పాన్పును రెండు మూడు కుర్చీలును
గలవు. రామావధాని కుటుంబము గొప్ప దగుటచేఁ బుత్త్రిపుత్త్రి
కాదులచేతను, దాసదాసీజనములచేతను, నెల్లప్పుడును గృహము సంకు
లమై యుండును. నాఁడు రాత్రి యెనిమిదిగంటలకంటె నతిక్రమింపక
పోయినను నా గదివైపున మనుష్య సంచారమే లేదు. అదియంతయుఁ

జూడఁగానే రామారావున కాశ్చర్య మొదవుచుండెను. "ఆహా! ఇది యేమి? యింతగా నున్నదే. నిజముగా నే నాచరించఁబోవునది నీతి బాహ్యమగు కార్యము ఇట్టిది రహస్యముగా నుండుటయె పొసగదు. ఈ రుక్మిణి నా కోర్కెదీర్ప నింత బహిరంగముగా వర్తించుచున్నదే. పునస్సంధానమునకువలె గది చక్కగా నలంకరింపబడినదియె. దీప మత్యుజ్జ్వలముగా వెలుగుచుండెను. నన్నీమె యిట్లు వెనుక నిడికొని తీసికొనిపోవుచున్నది. ఈ దీపకాంతిలో మమ్ము నెవ్వరైనను జూచిన నిఁక నిల్లులోఁ బ్రవాదమునకు మేర యుండునా? ఇట్టి కార్యమందు మగవానికంటె నాఁడుది మిక్కిలి జంకుచుండవలసినది. కాని యీ రుక్మిణి కింతయైనను జంకు లేదే. వేశ్యకాంతయైనను రుక్మిణి యంత నిర్భయముగా వర్తించునని నాకు నమ్మకము లేదు. ఇదంతయు నాలోచింప యౌవనవతియగు రుక్మిణి చంచలహృదయయై చెడిపోయి నది కాఁబోలు. కూతుమీఁదఁగల ప్రేమచేఁ దలిదండ్రు లుపేక్షించు చున్నారు గాఁబోలు. కాకున్న నివి యిట్లు జరుఁగఁగలదా?" అని యాలోచించుకొనుచు నా గదిలోని కరిగెను. రుక్మిణి యతనిని జూచి చిఱునవ్వుకాంతులు మల్లెమొగ్గల వగనను నిరసించు దంత పంక్తిరుచులతో సంకలితములై ముఖమండలమున వ్యాపింప "బావా! ఆ మంచముపై పండుకొనుము. ఇప్పుడే వచ్చెద" నని చెప్పి వెడలి పోయెను. పలువిధములగు నాలోచనములచే నతని డెంద మాందో ళన మొంద రామారావు తల్పమునఁ బండుకొనియెను. కాని యతఁడు నిద్రింపక రుక్మిణి యాగమమున కెదురుచూచుచుండెను.

అట్లొక యఱగంట కాలము కడచెను. నానావిధ వస్త్రాలంకా రములచే నలంకృతయగు నొక యువతి ద్వారముచెంతకు వచ్చెను. ఆమె నూపురమంజీరధ్వనులు విని రామారావు లేచి పక్కపైఁ గూర్చుండెను. ఆయువతీలలామ లోపలఁ బ్రవేశించి తలుపు బంధించి

యా దీపపు కాంతిలోఁ దన సరిగంచు చీరయు, సువర్ణాలంకారము లును వింతవింత కాంతులనీన, దివినుండి దిగివచ్చిన యచ్చరకాంత యోయన నతని చూపునకు విం దొనర్చుచు నవనతవదనయై యల్ల నల్లన నతని సమీపించి ముఖ మెత్తి రామారావును జూచెను. అతి లుబ్ధంబులగు రామారావు చూపు లామె ముఖ మండలముపై వ్యాపించెను. అతని చూపు లామె ముఖ బింబమున నంటిపెట్టి కొనిపోయినట్లు మఱి కదలి రాలేదు. అతని యాశ్చర్యము తల మునుక లయ్యెను. అతఁడు నిస్తబ్ధుఁడై మౌనముద్రావలంబియై యుం డెను. అతనికిఁ దెలియకుండఁగనే యతని నోటినుండి "ఆఁ, ఇదేమి? ఎవ్వరీమె ?" అను వాక్యములు వెడలెను. రూపొందిన సౌందర్య రాశి వడువున లోకమునంతటిని మోహింప నవతరించిన సమ్మో హనమంత్రశక్తివిధముననున్న యా యువతి తెల్లకలువరేకులు వెద జల్లిన చందమునఁ దన తెలుకుబెళుకుచూపు లతనిపై గురియించుచు "ఔరా! ఎంత యాశ్చర్యము! విధివిహితముగా నగ్నిహోత్ర సాక్షిగా, ధర్మార్థకామములందు నిన్నెంతమాత్ర మతిక్రమించి వర్తింపనని తగు మనుష్యుల సన్నిధిని ప్రమాణముచేసి కైకొన్న కులకాంత, యేకాంతముననున్న కాంతునిచెంత కరుదెంచుట యాశ్చర్యోత్పాదక మయ్యెను. ఆహా! ఏమి కాలమహిమ" అని పలికెను. ఆవాక్యములు విశాతశూలిఘాతములవడువున నొప్పింప రామారా వంకుశపుఁబోటు తిన్న మదపుటేనుంగుభంగి త్రుళ్లిపడెను. ఆకాంత తన భార్యయగు కమలయని యప్పు డతఁడు గ్రహించెను. కమలయుక్తవయస్కురాలయి నాల్గువత్సరములు కావచ్చెను. అయి నను విడువని పట్టుదలలచేతను, వ్యర్థములగు కలహములచేతను రామారా వొకమాఱు నత్తింటికిఁ బోలేదు. భార్య మొగమును జూచియుండలేదు. పూజ్యుఁడగు తన తండ్రి నిషేధించుటచే నామెను

దనయింటికిఁ గాని రాలేదు. రమారమి రెండువత్సరములనుండి విదేశగతుఁడగుటచేఁ బ్రియురాలిని జూచుటకైనను వలనుపడలేదు. దైవానుగ్రహమున మరణశయ్యనుండి లేచినవాఁ డయ్యెఁ దండ్రివెనుకటి వైరమును మఱవక వివాహాంతరమును గావించుకొనవలసినదే కాని తొంటి భార్యను నీవు స్వీకరింపఁదగదని తన్నుఁ జూడవచ్చిన కొడుకుతో నొక్కి వక్కాణించుటచేఁ జేయునదిలేక పరిగృహీతయగు కాంతయం దనురాగముగలవాఁడయ్యె రామారావు భార్యను జూడఁ దలంచుకొనలేదు. కావుననే యతఁడు విశాఖపట్టణమునకు వెళ్లియు నత్తింటికిఁ బోలేదు. హఠాత్సంభవమగు కాంతాదర్శనమున నతని కాశ్చర్యమును, సొత్తుతోఁగూడఁ బట్టువడిన దొంగవలెఁ దనదుర్వ్యవర్తనతోఁ దనభార్యకు దొరకిపోయినందువలనఁ గల్గు లజ్జాభయములును, రామారావును మిక్కిలి విహ్వలస్వాంతునిగాఁ జేయ నేమి చేయుటకును దోచకయున్న భర్తనుగాంచి కమల చేతులు జోడించి మోకరించి యిట్లు చెప్పఁదొడంగెను. "నాథా ! మీ యనుమతి వడయకుండ మీసన్నిధికి వచ్చినందులకు నన్ను మన్నింప ముందుగా వేడుకొనుచున్నాను. నేను యౌవనవతినైన పిమ్మట మీసందర్శన భాగ్యము వడసి మీతో ముచ్చటింప నాకింతవరకును నవకాశము చిక్కలేదు. ధనాశాపీడితులగు మామగారు వివాహకాలమున నిర్ణయించిన నగలన్నియు మాజనకుఁడు పెట్టినంతవఱకును నన్నుఁ దమ గుమ్మమును ద్రొక్కనియ్యరు. దరిద్రతాపీడితులగు మాతండ్రిగా రట్లు చేయలేక నన్నుఁ బంపరు. ఇఁక నాగతి యేమికావలయును ? కన్న తల్లిదండ్రులకు భారము గల్గించుచుఁ బుట్టినింట నిట్లింతకాల ముండఁగలను ? " అని పల్కుచున్నప్పు డామె పొంగి పొరలివచ్చు దుఃఖము నాచికోఁజాలక యెలుఁగు రాల్పడ, కన్నులనుండి చిన్న సూత్రమగు ముత్యాలసరము పోల్కి బాష్పబిందువులు జోటజోటఁ

గురియ నిఁకఁ బలుక నేరక యూరకుండెను.

రా—(ఆవేశముతో) వ్యర్థముగా నేల యేడ్చెదవు? ఇందుల కంతకును మీజనకుఁడే కారకుఁడు. కన్నకూతులను సుఖింపఁజేయ వలెనన్న తలం పాతని కుండవలెను.

కమల దుఃఖము దాచికొని, గొంతు సవరించుకొని, బాష్పజల పూర్ణములై, హిమజలసంకలితములగు నెఱ్ఱ దామరల నీసడించు కన్నులఁగన పతనిపైఁ బఱపి తమను పొరపడుచున్నారు. మాతండ్రి గారికి మాయం దమితవాత్సల్యము. మే మత్తింటి కరిగినపిమ్మట నన్నవస్త్రములకు దూరమై యెక్కడఁ బరితపించి పోవుదుమోయన్న భయము సర్వదా పరితపించుచుండెను. ధనికుల యిండ్లలోఁ బడ వేసినఁ దనకూతులు సుఖింతురని యతని తలంపు. అందుచే నావివా మునకైన నేమి, మాభద్ర వివాహమునకైన నేమి? మిక్కిలి కష్టపడి నాఁడు. అందులో ధనవిషయమై చెప్పనక్కఱయే లేదు. మగపెండ్లి వారు కోరినంత కట్నమును నిచ్చుటకు వెనుకముందులు చూడక యంగీకరించి పెండ్లి యొనరించినాఁడు. అనుకొన్న ప్రకారము చాల వఱకు ధనము సేకరించి నాకు నగలు పూర్తిచేసినాఁడు.

ఇంతటి యాయాసమాతని కేల? కన్నబిడ్డలమగు మాకుఁ బరమ సుఖము గల్గింపవలెననియే కాదా?

రా—నీకు నగలన్నియుఁ జేయించిన లాభమేమి? వానిలోఁ గొన్ని మరల విక్రయించియో తాకట్టుపెట్టియో యున్నాఁడు. మా మనస్సులు సంతృప్తిచెందుటకై యెట్లో నగలు చేయించి మరల నమ్ము కొన్నాఁడు. మసిఁబూసి నేరేడుకాయలు జేసి మోసపుచ్చిన యెవ్వ రికిఁ గోపము రాదు?

క—సత్యమే. కాని మాతండ్రి యిందు మోసమేమియును జేయలేదు. మీవంటివారి దృష్టి కది మోసమువలెఁ గనఁబడవచ్చును.

అతఁడు నాకు నగలు చేయించిపెట్టుట సత్యమే. కుటుంబము పెద్దది. రాఁబడి తక్కువ. ఇంటిలో నేది తక్కువయైనను కుటుంబయాత్ర నడువదు. మానమర్యాదలు ఎక్కువ. అందుచే నవసరమునుఁబట్టి యతఁ డొకటి రెండు వస్తువుల నమ్ముకొనెనని యనుకొనుఁడు. కాలు చేయి కూడఁదీసికొని మరల నగలు చేయించి యాకిచ్చివేయఁగలఁడు. ఇందులో మోస మేమున్నది? నిర్మలబుద్ధితో నాలోచింపుఁడు. దాని కేమి! అది యట్లుండనిండు. మీరును, మామగారును నానగల విషయమై తగవులాడి నన్నుఁదీసికొని వెళ్ళక యిట్లు ధర్మవిముఖులయి నారు. కాని నాయలంకారద్రవ్యము విషయమై మీకింతపట్టుదల యేల? ఆధనమంతయు నాది. దానియందు నాకుమాత్రమే స్వాతంత్ర్యము కలదు. మఱియెవ్వరికిని లేదు. దానికై మీరిట్లు పెనఁగులాడ నేల? మఱియు నాధనమైనను మీరు తెచ్చి యిచ్చినది కాదు. మా తండ్రిగారు మీకెదురు కట్నముకై రెండువే లిచ్చెదమన్నారు. మీ తండ్రిగారు చేతిరొక్కము వాడనేలయని మాతండ్రి యిచ్చినది నా కలంకారద్రవ్యముగా నిచ్చివేసినారు. దానికై మీరుగాని మీతండ్రి గారు కాని యపేక్షించుట యేమిన్యాయము? అందులో మీకుఁ గాను పీసమైనను మీకు చేరదే! ఒకప్పుడు చేరునేమో! ఎప్పుడు? నేను మరణించినతరువాత! అదియు సరిగా నిర్ణయింపలేము. ఇట్లుండ నది మనస్సులో నుంచుకొని, మీతండ్రిగారి యనుమతి ననుసరించి ధర్మపత్నిని విడిచిపెట్టుట తమవంటి యుత్తములకు, ధర్మజ్ఞులకుఁ దగునా? మీరు ధర్మ........

రా—ఓహో! అదియా నీతలంపు. నీస్వతంత్ర ధనమని చెప్పి యలంకారములను నమ్ముచేసి, యీ డేఱిన మామిడికొమ్మవలె వర్తించిన నిన్నెవ రేలుకొందురు?

రు—ధర్మజ్ఞులగు తమనోట నింత చులకనిమాట—ఇంత

యధర్మమగువచనము—వెడలినందులకుఁ బరితపించుచున్నదానను. ఆఁడుదాని బ్రదుకింత యధమాధమమైనదా? దాని సుస్వభావము, దాని సహజసౌందర్యము, దాని సరసవచనములు, దాని మర్యాదయు నివియన్నియు బంగారు నగపాటిచేసినవి కావా? ఆశ్చర్యము, ఆశ్చర్యము. ఇంతకంటె శోచనీయమేమి? నగలు లేకపోయినంతమాత్రమున ధర్మపత్ని పరిత్యక్త కావలసినదే!...విద్వాంసులగు తమనోట నిట్టి యవాచ్యవచనము వెలువడవచ్చునా?

తమరు దూరముగా నాలోచించినారో లేదో, లేక యూరపు దేశమునందుఁ దమరు వసించుటచే వారి యాచారములు మీ మనస్సునకుఁ బట్టుటచే నిట్లనుచున్నారేమో? అదియుఁ బొసఁగదు. అలంకారవిహీనలైనంతమాత్రమున వారు విడువఁబడుచున్నారా? ఇంతయేల? భార్యాభర్తృధర్మవిషయమున వారికిని, హైందవులమగు మనకును బోలికయే లేదు. హైందవ దాంపత్యధర్మ మసాధారణమైనది. ఇట్టి దృఢధర్మ మే దేశమందును లేదు. ఏ సంఘమునందును లేదు. దానిని సడలింప నెవ్వరికి శక్యము కాదు. యావజ్జీవమది యట్లుండవలసినదే. అంతవఱకే కాదు. తదనంతరమునఁగూడ నుండవలసినదే. ఇతరదేశములలోవలె హిందూదంపతు లొకరికొకరు విడాకు లిచ్చుకొన వీలులేదు. ఒకవేళ దైవవశమున దంపతులకు సహవాసము లేకపోయినను, పోష్యపోషకభావము లేకున్నను వారు దంపతులే యగుదురు. అలంకారరహితయన్న హేతువున మీరు నన్ను విడిచిపెట్టినను నేను మీకు భార్యనే. మీరు నాకు భర్తలే. మీరు నన్నుఁ బోషింపక విడిచిపెట్టినను నేను మీభార్యను. మీరు వేఱొక యువతిని వర్తించినను, నేను మీ భార్యనే! నిజముగా నాకంత యదృష్టము పట్టలేదు కాని నేను మరణించినను మీకు భార్యనే. మీరు నన్నెంత హీనముగాఁ జూచి ప్రాతగుడ్డపీలికను

బెంటపై బొటనవ్రేలు చిన విధమున నన్ను దూరమునకు ద్రోసివుచ్చినను, నేను జచ్చినపిమ్మట మీరు నన్ను సమీపింపక తీఱదు. మీచేతుల తోనే యీ దీనురాలి పాపిష్టశరీరమును పిడికెడు బుగ్గి చేయకతీఱదు. పరమపవిత్రమగు మీ మాతృవర్గత్రయమునందు నను జేర్పకతీఱదు. ఇంక నాకుఁ గావలసినదేమి ? నేను కన్యకగా నుండిపోలేదు. ఉత్తమ కాంతకుఁ గావలసిన మర్యాదలన్నియు నాకుఁ జేకూరినవి. ఇంకఁ బోషణమునుగూర్చియా ? ఆ విచారము నాకెప్పుడును లేదు. కన్నం దులకు మాతండ్రి బ్రదికినంత కాలమును నే కడుగో, యేగంజియో పోసి పోషింపకమానఁడు. నేను జెప్పవలసిన దింతే. ఈమాటలు మీయెదుటఁ బల్కవలెనని యెంతో కాలమునుండి వేచియున్నాను. మారుక్మిణి ధర్మమున నాకట్టి యవకాశము చిక్కినది. నా స్వాంత మిప్పటికి శాంతించినది. నే నింకఁ బోయెదను. మీకాలము నింత సేపు వమ్ముచేసినందులకు క్షమింపుఁడు. ఇవియే నాకడపటి నమస్కా రము" లని గిరుననఁ దిరిగి కమల వెడలిపోవుచుండెను.

రామారావామె ధర్మోపన్యాసమునకాశ్చర్యచకితుఁ డయ్యెను. రుక్మిణి వాగ్ధోరణకే యతఁడు ముగ్ధుఁడయ్యెను. వాగ్మిత్వమున నా రుక్మిణి యీమె కేవిధమునను బోలియుండదని తలంచెను. నటాలున నేలకుఱికి, పోవుచున్న కమల చేతినిబట్టుకొని, యేదియో చెప్పఁ బోవుచుండఁ గమల " నాథా! నన్ను విడువుఁడు. నావిషయమై మీజనకుల యాజ్ఞోల్లంఘన మాచరింపకుఁడు. తుదికాలమున వారి మనస్సునకు సంతాపమొనవింపకుఁడు. అట్లే మీతల్లి మరణించిన పిమ్మటఁ దల్లియై మిమ్మింతవఱకుఁ బెంచిన మీ పినతల్లిగారికిఁ గోప ము తెప్పింపకుఁడు. వారికువురకు నాపొడగిట్టదు. దానికి నాపూర్వ జన్మకర్మమే కారణమై యుండనోపు. నన్నింకఁ బోనిం" డని చేతిని విడిపించుకొనఁ యత్నింప, రామారావామెను గాఢముగాఁ గౌగిలిం

17

చుకొని, మంచముపైకిఁ గొనిపోయి కూర్చుండఁబెట్టుకొని, ముద్దిడి, వెన్ను నిమురుచు "ప్రియురాలా! నీ ధర్మవచనముల కానందించితిని. ముదుసలితనముచేతనో, లేక నీవన్నట్లు ధనాశాపీడితుఁడగుటచేతనో యుక్తాయుక్తము లరయక మామతండ్రి యధర్మప్రవర్తకుఁడై నన్నధర్మమార్గమునఁ ద్రిప్పుచుండ, జదువుకొన్నవాఁడనయ్యు, విద్వాంసుడనయ్యు, లోకజ్ఞానము గలవాఁడనయ్యు, తెలివిలేక యాయధర్మ మార్గముననే మదపుటేనుఁగువలె వర్తించుచున్న న్ను ధర్మవచనాంకుశము లచే నొప్పించి మేల్కొలిపి ధర్మమార్గమునకుఁ గొనివచ్చితివి. ప్రేయసీ! ఇంతటిదానవని నే నెన్నఁడును దలంపలేదు. ఇంత ధర్మ పరిజ్ఞానము, ఇంత మృదుమధురధర్మోపన్యాససామర్థ్యము గలదానవని నే నెప్పుడును భావింపలేకపోతిని. నాకుఁ బరమానందము గల్గినది. నీవంటి యుత్తమురాలిని భార్యగాఁబడయు భాగ్యమును నాకుఁ గల్గించినందులకు నా పరమేశ్వరునికి వందనములు ఆహా! నిజముగా నే నిట్టియానంద మొందఁగలనని తలంపలేదు. అవురా! లోకములో గుణదోషములు, సంపదాపదలు పరస్పరము కలిసియే యుండును. మామతండ్రిగారికి సంభవించిన యాపదకుఁ బరితపించుచు నిటకు వచ్చితిని. అతఁడు దైవానుగ్రహమున నారోగ్యవంతుఁడై యుండుటయే కాక, తుదకు నీ సందర్శనభాగ్యము గూడ లభించిన" దని పల్కి యానందమును వెలిపుచ్చుచుండ "నాథా! మామగారి యనారోగ్యము పూర్తిగాఁ బోయినదా? అది ప్రాణాపాయకరమైన రోగమని వినియున్నా" నని కమల పల్కెను.

రామారావు పదిసిని "కమలా! సత్యమే అది ప్రాణాపాయకరమే. అయినను నాయదృష్టవశమున విశాఖపురవైద్యుఁ డొకఁడు వచ్చి దివ్యౌషధమిచ్చి రక్షించినాఁడు. నే నాతని యుపకార మెన్నఁడును మఱవలేను. అతనికిఁ దగిన బహుమానమిచ్చి గౌరవింపవలయు" నని

నుడివెను.

కమల—నాథా! ఇందు నాదొక యపరాధమున్నది. మీరు విదేశమం దుండుటయు, మామగారు మృత్యువు నోటఁబడుటకు సిద్ధముగా నుండుటయుఁ జూచి నేను స్వయముగా మీ యింటికరిగిన పిన్నత్తగారికిఁ గోపమువచ్చునేమో యని, నా యొంటమిగిలిన నగలలో నొకదాని నమ్మి యొకవైద్యునిచేతిలోఁ బోసి మామగారికి మందిచ్చుటకై పంపితిని. నేనిట్లు నగలను వెచ్చించి నిరలంకార నగుదు నని మీకుఁ గోపమువచ్చునేమో క్షమింపుఁడు.

అది విని కమల మంచితనమునకును, సుస్వభావమునకును, నానందమును బట్టఁజాలక మాటిమాటికిఁ గౌగిలించుచు, ముద్దిడుచు నఖండ సౌఖ్యమునఁ బరవశుఁడై కమలను జూచి "సుందరీ! గనిలో రత్నముల వలెఁ గ్రవ్వుచున్న కొలఁదిని నీయందు మంచిగుణములు బయలు వెడలుచునే యున్నవి. సంతోషించితిని. ధన్యుఁడనైతిని. ఇంతవఱకును నీ మంచితన మెఱుఁగఁజాలకపోయితిని. నీ సుగుణములను గణింపలేకపోతిని. నీ ధర్మప్రవర్తన మరయలేకపోతిని. నేను మహాపరాధ మొనరించితిని. భర్తృధర్మ మొక్కించుకయైనను బాటింపలేకపోయితిని. క్షమింపుము. ఇఁక ని వొక్కపని గావింపవలసియున్న" దనిపలికెను.

క—నాథా! ఏమి సెలవు?

రా—నీ వొకపర్యాయము మా పినతల్లిగారి యింటికి రావలయును. ఆమె యెదుట నీ సద్గుణరత్నముల వెల్లడించి యామెను గూడ సంతసింపఁజేసెదను.

క—నాథా! వలదు. అందువలన మీ మనోరథమీడేరదు. నన్నుఁజూచిన మీపినతల్లి కమితద్వేషము. కారణ మెఱుఁగను. పద్మినీచంద్రకళకు విరోధ మెందులకో యెవ్వరు చెప్పగలరు. మొన్న నీనడుమ మీపినతల్లి మా భద్ర యత్తవారియింటికి వచ్చినది. నేను

కంటఁబడగానే యామె మోము ముడుచుకొని లోని కరిగి మాభద్ర
యత్తగారియెదుట నన్ననరానిమాట లన్నది. మాతండ్రిని, మా
కుటుంబమును, మిక్కిలి నిందించినది. అందుచే నిప్పట్టున నే నచటికి
రాఁదగదు. నన్నుఁబట్టి మీయందుఁగూడ నామెకుఁ గోప ముద
యించునేమో.

రా—పోనిమ్ము. కొంతకాల మరుగనిమ్ము. కాల మెట్టివారి
నైనను బరిపాకమునకుఁ గొనిరాకపోదు. నే నింకను నొక వత్సర
మింగ్లండులో నుండవలసియున్నది. నేను రేపే మాయూరికరిగి మా
తండ్రిగారి యనుమతి వడసి వెళ్లెదను.

క—మంచిది. అట్లేచేయుఁడు. ఇంగ్లండులో నతి చమత్కారి
ణులును, వేషభాషావిశేషశోభితలును నగు నైరోపాస్త్రీలు కంటఁ
బడినప్పుడు మీకు ధర్మపరిగృహీతయగు సహచారిణియొకతె యున్న
దని స్మృతి నుంచుకొనుఁడు. ఇంతయే నేఁగోరునది.

రా—కమలా! ఎంతమాట పలికితివి. నీవే నాధర్మపత్నివి.
నీవే నాప్రేమధనమవు. నీవే నాగృహిణివి. నీవే నాసుఖస్వరూపిణివి.
నిన్నన్యథా తలంతునని యెప్పుడును భావింపకుము. ఇదివఱకపమార్గ
మున నడిచి పాపమార్జించితిని. ఇంకను నాచరింతునా? ఇఁక నీవు
నిశ్చింతవై యుండుము. నేను నిన్నెప్పటికి మఱవను.

ఇట్లామెను సంతసింపఁజేసెను; గాని తాను రుక్మిణియందు
మోహబద్ధుఁడై యట్లచ్చటికి వచ్చిన ట్లామెకుఁ దెలిసిపోయెనేమో
యన్న భయ మింకను నతనిని బీడించుచుండెను. ఆ యంశమును
గమలవలనఁ దెలిసికొనవలయునని యెంచి "కమలా! నే నిచ్చటికి
వచ్చినట్లు నీ కెప్పుడు తెలిసినది? మన యీ సంఘటన మెట్లు జరి
గెను?" అని యడిగెను. అది విని కమల "ప్రియా! నే నిచ్చటికి వచ్చి
వారము దినములు కడచినవి. మీ రిచ్చటికి వచ్చినట్లు నాకుఁ దెలి

యదు. నిన్నటిదినమున నేను రుక్మిణిని జూడవచ్చితిని. మీ రేమో వచ్చి యామెతోఁ గొంత ప్రసంగించి వెళ్ళినారఁట! మా రుక్మిణి నా చెంతఁ గూర్చుండి మీరు హైందవమత ధర్మాసక్తులనియు, ప్రాజ్ఞులనియు, వివేకవంతులనియు, నేమేమో పొగడి నన్నుఁ జూచి "అక్కా! ఈ రాత్రి నీ మగ నిచ్చటికి రప్పించెదను. నీవు సంకోచము వదలి యతని మనస్సు కరఁగునట్లు మాటాడి, యథార్థ్యమును విన్నవింపుము. దానితో సర్వమును జక్కఁబడునని నా నమ్మకము. నీ పతి యుక్తాయుక్త ధర్మజ్ఞుఁడు గాని మూర్ఖుఁడు కాఁడు. నీవు తప్పక యతని దర్శింపకతీఱదని చెప్పి నన్ని ట్లలంకరించి పంపినది. మన యిర్వుర కిట్టి సంఘటనము గావించి రుక్మిణి యెంతో పుణ్య మార్జించుకొన్న"దని నుడివెను. ఆమాటల ధోరణినిబట్టి రుక్మిణి తన దుశ్చింతను తన ప్రేయసి కెఱిఁగింప కునికి మనమున సంతసించుచు, "కమలా! రుక్మిణి మనకు మహోపకారము గావించినది. తెల్లవాఱు చున్నట్లున్నది. నే నిఁకఁ బోయెదను. ఇప్పట్టున రుక్మిణిని జూచి మాటాడఁజాలను. ఇఁక నీ వెట్టి దైన్యమును బొందవలసిన యవసరము లేదు. నీ సద్గుణములే నీకు రత్నాలంకారములు. విచారింప నవసరములేదు. నా హృదయవీధిని దావు చేసికొంటివి. తావు చేసికొనుటయే కాదు. అందు నీవు శాశ్వతమగు భవనమును గట్టుకొంటివి. దానిని బడగొట్టుటకుఁగాని, లేక యందు వేఱొకరు వచ్చి భవనము కట్టుకొనుటకుఁగాని తావులేదు. ఇంక నొక సంవత్సరముమాత్ర మోపిక పెట్టుము. అప్పు డపూర్వ సుఖము ననుభవింపఁగలవు. నా హృదయ భవనమునం దెల్లపుడును నీవు కాఁపుర మున్నావనుటకుఁ దగిన ప్రతిఫలమును బొందఁగలవు. ఇఁక నన్ను విడువు" మని చెప్పి బిగియారఁ గౌఁగిలించుకొని ముద్దిడి యామెను సంతసపఱిచి వెడలి పోయెను.

సామాన్యముగాఁ బల్లెలయందు రథ్యావృక్షములుండుట గలదు. వాని మొదటఁ జతురశ్రముగా నరుగులు కట్టుటయు, నవి యా యూరి జనులకు రచ్చసావడులుగా నుపయోగించుటయుఁ జూచుచున్నాము. అట్లే రామయ్యగ్రహారములో నడువీధిలో రథ్యావృక్ష మొకటి యుండెను. పూర్వు లెవ్వరో లక్ష్మీనారాయణ స్వరూపములని తలంచి నింబాశ్వత్థములను నాటి, వానికి వివాహము గావించి వర్ధించి బాగుగా కలిసి యేకత్వ మొంది పెరిగిన వాని మొదట విశాలమగు నొక యరుఁగును గట్టించిరి. అది యిప్పు డాయూరివారి కెండవేళల విశ్రాంతిస్థానముగా నుపయోగించుచుండెను. ఆ యూరివా రేదో యొక సమయమున నక్కడికి వచ్చి కొంతసే పిష్టగోష్ఠిని బ్రసంగించి వెడలిపోవుట యాచారమై యుండెను. గ్రామాధికారులుగాని, తదితరులుగాని యందుఁ గూర్చుండియే నానావిధవ్యవహారములను బరిష్కరించుకొందురు. మఱియు నందుఁ గూర్చుండియే శుష్కవాదములు చేసి యనవసర కలహములు పెంచుకొని సోమరిపోతులు కొందఱు కాలక్షేపము చేయుచుందురు. ఒకప్పు డా కలహములు పెచ్చుపెరిగి కేశాకేశిని, దండాదండిని బెనఁగి కచ్చేరీల కెక్కుటయుఁ గలదు. ఇట్టివారు రామయ్యగ్రహారములోఁ బెక్కు రున్నా రనుటకు సందియము లేదు.

ఒకనాఁ డుదయకాలమున నెనిమిది తొమ్మిది గంటలప్పుడు కొందఱు బ్రాహ్మణు లా రథ్యావృక్షము మూలమునఁ గూర్చుండిరి. వారు పుట్టుకచేతనే బ్రాహ్మణులు. వేదముచేఁగాని, చేష్టలచేఁగాని, ధ్యానచేఁగాని వారు బ్రాహ్మణులని నిర్ణయింపలేము. ములుకోల

చేతఁబట్టి యప్పుడే పొలములోనుండి వచ్చుచు నట గూర్చున్నవారు కొందఱు. ప్రాతఃకాల స్నానము చేయకపోయినను విభూతిస్నానమును మాత్రమును జేసి కంఠపూర్తిగాఁ జల్దియన్నములు దినివచ్చి కూర్చున్నవారు కొందఱు. సంతత ధనార్జనాభిలాషచే నదే పనిగా జందెములు నూలు వడుకుచు నున్నవారు కొందఱు. నిరతాగ్నిహోత్ర మొనర్చుట బ్రాహ్మణునకు ముఖ్యధర్మమని యెంచి కాఁబోలును నొకటితర్వాత నొకటి చొప్పునఁ బొగచుట్ట గాల్చి ధూమపానము చేసి నడుమనడుమ నోటినుండియు నాసికా రంధ్రముల నుండియు పొగనువిడిచి చిన్నచిన్న మబ్బులు కల్పించువారు కొందఱు. ఇట్లు కూడిన బ్రాహ్మణోత్తముల ప్రసంగము లిట్లారంభింపఁబడి, యేవిధముగాఁ బరిణమించునో కొంచెము పరిశీలింతము.

ఒకఁడు—దాని కేమిగాని తల్లి మహాలక్ష్మి, మన జాంబనగారి వెంకన్న పుల్లెద్దే యెద్దు. దాని వన్నె, దానివన, దాని చుఱుకు, దాని నడక, దాని వాలకము మఱే దేనికిని లేదు.

ఇంకొకఁడు—నీ వన్నది నిజమే. కాని దాని ముండ మొయ్య, అది బండికి దొంగదిరా!

మొదటి—సరి. అది నీ కేమి తెలియును? నేను స్పష్టముగాఁ జూచితిని. బండికిఁగూడ దానిని బోలినది లేదు.

రెండ—బండియెద్దు నా కెవ్వరు నీవు నాకుఁ జెప్పువాఁడవా? అది నీ కేమి తెలియును? నిన్నగాక మొన్న పుట్టినవాఁడవు.

మొద—నిన్నఁ బుట్టిన నేమి? మొన్న బుట్టిన నేమి? ఏం డ్లున్నంత మాత్రమున నా కెవ్వరు దెలియునా?

మొన చందరాడకు బండి తోలికొని వెళ్ళితిమి. ఆహా! ఏమి దాని నడక. నిమిషాలలో ఊరు చేరితిమి గాదా! నీ వూరక తెలియక మాటాడుదువు.

రెం—ఓరిఖుంకా! పెద్దవాఁడు చెప్పినది ధిక్కరించుచున్నావా? పండ్లూడగొట్టిన పనికివత్తువు.

మొ—నీవు పెద్దవాఁడవయినఁ గానీ, నోటికి వచ్చినట్లు ప్రేలినచో నూరకుండను.

రెం—ఊరకుండకపోయిన నేమువు.

మొ—ఛీ! నోరు మూయుము.

రెం—ఇంకొకమా రట్లంటే నోరు మూయించెదను.

మొ—(లేచి, పండ్లు గీటుచు, రోషారుణితనేత్రుఁడై) చూచుచుకో, ఏమి చేసెదనో.

రెం—వెధవకు, చిన్న పెద్ద లేదు. ఒకమాఱు దేహశుద్ధియైనఁ గానిఁ బుద్ధిరాదు.

మొ—బుద్ధి గిద్ధి అంటే నే నొప్పను. నీవు నలుగురలోనికి వచ్చి మాట్లాడుచున్నావా ఎప్పుడు చచ్చిపోవన్న నాఁడు నెలలక్రిందఁ జచ్చితినని యింటఁ గూర్చుండక.

రెం—ఓరీ! ప్రే లెదున్నావో లేదో, మిడిసి మిడిసిపడుచున్నావే? నే నింటఁ గూర్చుంట యేమి? నీవే కూర్చుండు.

మొ—నేను నీలాగున నూరలఁ గూర్చుండుటకు నే నెవ్వరి సొమ్మును దొంగిలింపలేదు.

రెం—(కోపముతో) ఓరి వెధవా? దొంగతనముకూడఁ గట్టుచున్నావా ?

మొ—నేను వేఱుగాఁ జెప్పవలెనా? ఊరందఱకును దెలియును. పోలీసువారికి దోసెడు రూపాయిలు లంచమిచ్చి తప్పించుకొంటిని నీవే కాదా ?

రెం—ఏమయినను నీ తండ్రివలెఁ గైదులోఁబడి రాలేదులే?

మొ—అవును నాయనా! మా తండ్రి మహిషదానము, పిల్లి

దానము పట్టి నీవలె సొమ్ము గడింపలేను. లేకపోయిన నతఁడును నీవలె నెట్లో తప్పించుకొనియుండును.

రెం—బ్రాహ్మణునికి దానము తప్పుగాదు. లంజెవృత్తిచే మా యూఁడువాండ్రు సొమ్మార్జింపలేరు. అందుచే నే నేదానమయి నను బట్టుచున్నాను.

**మొ**—లంజెవృత్తి నవలంబించినను, ఒక శూద్రునితో లేచి వెడలిపోకుండ నింటఁ బడియుండుట మంచిదే కాదా!

ఈ రీతిగా నొక ప్రసంగము తిట్లతోను, కేకలతోను, ఎత్తిపొడుపు మాటలతోను నెంత యశ్లీలముగాఁ బరిణమించినదో చూడుఁడు. జాంబన్నగారి వెంకన్నగారి యెద్దెటువంటిదైనఁ దమకేమి? ఆప్రసంగము తుద కెట్లు పరిణమించినదో యాలోచింపుఁడు. ఇట్టి యనవసర ప్రస్తావనలతోఁ గాలము పుచ్చుటయే కాక తుదకు దేహశుద్ధి గావించుకొనుచుందురు. ఇది యగ్రహారస్థులకు సహజగుణము.

అచ్చటనే మఱికొంఱు మఱియొక యంశమును బ్రసంగించుకొనుచుండిరి.

ఒకఁడు—ఏమోయి! వెంకుబావా! రేపే మనము పీరినాయసిపై దెచ్చిన దావా విచారణ. నీవు తప్పక రావలెను.

రెం—ఓరీ! నీ కెప్పుడును దావాలు విచారణలే. ఆ పత్రము కేవలము కల్పితము. దానిని పట్టుకొని పెనఁగులాడిన నేమిలాభము. అది గెలవదు.

**మొ**—గెలువకేమి? శాస్త్రిగారు చెప్పినారు. సాక్ష్యము బాగుగాఁ బలికినచో మన పక్షము తీర్పగునని.

రెం—బాగుగా ననఁగా నబద్ధ మాడవలె ననియే కాదా యర్థము.

**మొ**—అట్లన్నచో వ్యవహారములు నెఱవేఱుట యెట్లు?

కచేరీకి వెళ్ళినపు డబద్ధమైన నంగీకరింపవలయును.

రెం—నే నట్టి పని చేయలేనుసుమా! శుద్ధాబద్ధము పలుకుటకు నాకు నోరు రాదు.

మొ—అవును. నీకు నో రెట్లువచ్చును. చందనాడరా జొనర్చిన హత్యనుగూర్చి సాక్ష్య మిచ్చుచో నింత మడి గట్టుకొనలే దేమి? చేయి తడిసినచో నట్టి వక్కఱలేదు కాఁబోలును.

రెం—(కోపముతో) నే నా సాక్ష్యములో సొమ్ము పుచ్చుకొన్నానా?

మొ—ఇదియొక క్రొత్త యబద్ధము. ఎంతో పుచ్చుకొనలేదు. రెండువందలు మాత్రమే.

రెం—(పండ్లు కొఱుకుచు) నీవు తెలియనిమాట లాడకు.

మొ—తెలియుట కేమున్నది? నిశీధమప్పుడు వారి గుమాస్తా వచ్చి నీ కియ్యలేదా? నిజము చెప్పు.

రెం—(మహాగ్రహముతో) ఓరీ! ఎందుకురా! నోటికివచ్చిన ట్లెల్లఁ బ్రేలెదవు. వారిచ్చినారు. నేఁ బుచ్చుకొన్నాను. నీవేమి చేసెదవు.

మొ—నేనేమి చేసెదనోయి! కలికాలమెట్లు నుండుచున్నదో తెలియఁ జేయుచున్నాను. ధనమిచ్చినచో సర్వము సత్యమయముగాఁ గన్పించునుగాఁబోలు. నేనా రాజువలె నిన్ను బంగారుచెప్పుతోఁ గొట్టలేను.

రెం—ఓరీ! బంగారుచెప్పని వెండిచెప్పని యూరక తెగనీల్గెద వెందులకు? నీ వెంత నిందించినను నేను మీవలె నబద్ధమాడి భూమి బుట్ట సంపాదింపలేదు. నీసంగతిమాత్ర మెవరెఱుఁగరు.

ఈసంభాషణమిట్లు జరుగుచుండ మఱికొందఱు వేఱొక విధముగాఁ బ్రసంగించుచుండిరి.

ఓ__ఏమోయి బావా! తీతికగాఁ గూర్చున్నావు. పొలము లోఁ బనిలేదా ఏమి?

రెం__లేకేమి? పెద్దగర్వంతయు దుక్కి సిద్ధముచేసినాము. వానకురియువఱకు నీలాగునఁ గుచ్చిటప్పాలు గొట్టుచుఁ గూర్చుండ వలసినదే!

మొ__అవును. బాడవభూమి వదలివేయగానే నీకుఁ దీరుబడి గల్గినది. లేకపోయిన రాత్రిపవలు నేతముతోఁ గొట్టుకొన వలసినదే! కాని యాభూమి యెందుచే వదలివేసితివి?

రెం__నేను వదలివేసితినా? లేదు. ఆ రామావధానిగాఁడు విడుదలచేయుమని రిజిష్టరీనోటీసిప్పించినాఁడు. ఇఁకఁ బెనఁగులాడుట పెత్తనము కాదని వదలివేసితిని.

మొ__రామావధాని యెందులకట్లొనరించినాఁడు.

రెం__ఎందులకా? గ్రుడ్డు నడినెత్తికివచ్చి. ఏదో పూర్వ లెట్లో భూములు గడించినారు గదా. ఇఁకఁ గావలసినంత గర్వము. తెగనీల్గు.

మొ__అవును. నీవన్నదినిజమే. అవధానిగాఁడు క్రిందమీఁద నిలవకుండ రెపరెపలాడు చున్నాఁడు. కాకపోయిన నీవంటి యమా యికుని భూమినుండి తొలగింతునా? అందులకు వానికిఁ దగినట్లు బుద్ధి చెప్పవలె నోయి!

రెం__మనము తలఁచుకొన్న నదెంతసేపోయి! ఏదో సాటి వాఁడు గదాయని యూరకున్నాము.

మొ__నిన్నందునుండి తొలగించుటకుఁ గారణమేమి?

రెం__కారణమేమిటి? వానికిష్టము లేకపోవుటయే కారణము.

మొ__అదేమన్నమాట, కారణమేదో యుండవలెను.

రెం__ఏమికారణమని చెప్పను? నిస్తు బకాయి పడినదఁట.

మొ__ఏమీ! ఈయేఁడు బాగుగా పండినదే?

రెం__మఱియెుకప్పుడు పంటఁ బోయినదా?

మొ__అట్లయిన మఱెందుచేత సిస్తు చెల్లింపలేదు.

రెం__మనము సిస్తు చెల్లించినఁగాని రామావధానికిఁ దిండికి లోపము వచ్చునా?

మొ__మంచిన్యాయముగా నున్నది నీమాట, తుదకు రామావధానికేమియు నియ్యలేదా?

రెం__వాని కియ్యవలసినది యెుక విబూదిపండు.

మొ__నాఁడూరకున్నాఁడా?

రెం__ఊరకుండక యేమిచేయును?

మొ__(నవ్వుచు) ఈనూరురూపాయల సిస్తునకు నీళ్లధారయే.

రెం__నూరేమిటి! మున్నూఱురూపాయల సిస్తు.

మొ__(ఆశ్చర్యముతో) మూఁడేండ్లనుండియుఁ జెల్లింపలేదా?

రెం__లేదు. ఎందుకు చెల్లింపవలెను?

మొ__మూఁడువందల రూపాయిలు వదలుకొనుటకు రామావధాని యిష్టపడెనా?

రెం__ఇష్టపడక యేమిచేయును? నేను జిక్కులు పెట్టకుండ భూమి వదలివేసినందుకు బ్రహ్మానంద భరితుఁడయినాడు.

ఓ పాఠక మహాశయులారా! వింటిరా? అగ్రహార వాస్తవ్యులు__పన్నులేకుండ విద్యావ్యాసంగాదులకై యుదారపురుషు లొసంగిన దివ్యభూఖండముల ననుభవించు బ్రాహ్మణులు.__వసిష్ఠాది మహర్షి గోత్రసంజాతులగు బ్రాహ్మణోత్తములు చేయుచున్న ప్రసంగములివి.

ఇంతలో నొకపురుషుఁడచ్చటి కరుదెంచెను. అతనిఁ జూచి సంఘములో నొకఁడు "ఓహో! సుందరము బావగారా! రండి. గ్రామాంతరమునకు వెళ్లితిరఁటగాదా! ఎప్పుడు దయచేసితిరి? మీరు లేకపోవుట

చే గ్రామమంతయు వెలవెలపోయినదని పలికెను.

అతఁ డందుల కేమియు సమాధానము చెప్పక ముందే మఱి యొకఁడు నవ్వుచు మొదటివానితో "నీ వేమియుఁ దెలియకుండ మాటాడుచున్నావు. సుందరము బావగా రూరిలోనుండిన నెంతో లేకున్న నంతే" అనియెను.

మొ—(నవ్వుచు) అప్పుడే బావగారిని లేకుండఁ జేయవలెనని చూచుచున్నావా? పదికాలములపాటు బ్రదుకనీ.

రెం—(నవ్వుచు) ఇఁక నెందుకోయి! మా మేనల్లుఁడు పెద్ద వాఁడయినాఁడు. ఇఁక బావగా రేమయిననుసరియే.

మొ—అట్లందు వేమి? రామావధానికిఁ గొంత ప్రాయశ్చిత్తము చేసినంతవఱకయినను బ్రదుకనీ.

రెం—బావగారు పెద్ద బి. ఎ. అన్నమాటయే కాని మా యవధానియన్నయ్య కాలిగోరికైనను బోలరు. ఇంటికిఁ దరలివచ్చిన పెండ్లికొడుకునకుఁ గూతు నియ్యక నిరసింపఁగాఁ జేయునదిలేక చడి చప్పుడు లేకుండఁ బాఱివచ్చిన బావగారిప్పు డవధానిని సాధింతురా! (కన్నుగీటుచు) ఇఁక చచ్చి సాధింపవలెఁ గాని బ్రదికిగాదు.

మొ—నీకు మన బావసంగతి తెలియదు. సుందరము బావ యనఁగా సామాన్యుఁ డనుకొన్నావా? ఈయనఁ దలఁచుకొన్నఁ జాలును. అవధాని గివధాని లెక్కయేమి?

రెం—ఏదీ! బావగారు మన యూరువచ్చి యొక సంవత్సర మతిక్రమించినది. రామావధాని నేమి చేయఁగల్గినారు?

మొ—తొందరపడిన లాభములేదు. ఈయన సమయమున కెదురు చూచుచున్నారు. ఈయనది భల్లూకపుపట్టని నీకు తెలియునో తెలియదో?

రెం—అవును, తెలియును. అయినను బావగా రేమందురో

యని య ట్లనుచున్నాను.

పైవిధముగా నిరువురు ప్రశ్నోత్తరములు జరుపుచు నొకఁడతనిని స్వర్గమునఁ గూర్చుండఁబెట్టుచుండఁగా, రెండవవాఁ డతని నధోలోకమునకుఁ ద్రోసివేయుచుండెను. ఈవిధముగా మాటాడి కోపములేని వానికిఁ గోపమును, బట్టుదలలేనివానికిఁ బట్టుదలయు, బౌరుషములేని వానికిఁ బౌరుషమును గల్గించుట యగ్రహారస్థులకు సహజగుణము. మఱియు గుణమును దోషముగాను దోషమును గుణముగాను మార్చి చెప్పుట యగ్రహారవాసు లందె వేసికొన్నవారనుటకు సందియము లేదు. వాస్తవముగా వివాహవిఘ్నమునకు శ్యామసుందరుఁడే కారణముగాని, యవధాని యెంతమాత్రమును గాదు అయినను శ్యామసుందరునకుఁ బౌరుషము దెప్పించుటకై యట్లు చెప్పబడియెను. శ్యామసుందరుఁ డది గ్రహింపకపోలేదు. అయినను నగ్రహారస్థులతోఁ గలిసి యకారణవైరమూని రామావధానిని సాధింపఁజూచుచున్న వాఁడు గావున వారిమాటలు విని చిఱునవ్వుతో “బావగారికి నా మహిమ యింకను దెలియదుగాఁబోలును. దేనికయినను గాలము రావలెను. అందులకై నిరీక్షించుచున్నాను. అప్పుడు మీరు, మీ యవధాని యన్నగారు నా మహిమను గనుగొందురు గాక” అని పలికెను.

ఆసంఘములో నొకఁ డది విని “శ్యామసుందరముగారు తలఁచుకొన్నంతపనియుఁ జేసినఁగాని యూరకుండ” రని యనియెను.

“ఇతని సాయమున్నఁ జాలును. మన మవధానినేకాదు, లోకమునంతను సాధింపఁగల” మని మఱియొకఁ డనెను.

“మన శాఖలో శ్యామసుందరుఁడు మేరువుపూసవంటివాఁడుగదా” యని యొకఁ డనెను.

“ఇతనిసాయము మనకున్నది. కాన నవధానిని గచేరీ కీడ్పించి

తెచ్చి, యేడ్పింపవచ్చు" నని మఱియొకఁడనెను.

ఈవిధముగ నగ్రహారస్థు లందఱును గేవల మత్సరగ్రస్తులయి నిరపరాధుఁడగు నవధానిని బాధించుటయే పరమపురుషార్థముగా భావించి వర్తింపఁదొడగిరి.

## ౬

ఇవి కార్తికమాసదినములు. వర్షములు తుదముట్టినవి. అక్కడక్కడ నొకటొకటి చొప్పున శారదాంబుదము తూలశకలమువలె విశీర్ణములై నీలాకాశమునఁ బర్వెత్తుచుండెను. నాత్యుష్ణములు, నాతి శీతములు కాకుండుటచే నాదినములు జంతుకోటికి మిక్కిలి సుఖావహములయి యుండెను. వాహినులు క్రమముగా స్వభావజనితకాలుష్యమును వదలి, యోగీశ్వరుల మతులవలె నతి నిర్మలములయి, శాంతములై, చని చని పరమాత్మయందువలె సముద్రంబునఁ గలిసి నామరూపభేదరహితములయి యొప్పుచుండెను. భూభాగము లెటుచూచినను, సకల సస్యసంపదలతోఁ బొదవి కనులపండువు లొనర్చుచుండెను. దేవాలయములు సంతత ఘంటానినాద మేదురములయి, పరమశివుని శతసహస్రనామోచ్చారణములకును, బ్రాహ్మణోత్తముల వేదఘోషలకును నిలయములై పొలుపారుచుండెను. కొందఱు కార్తిక దామోదరప్రీతికై ప్రాతఃకాలస్నానము లాచరించుచుండిరి. కొందఱు రుద్రాభిషేకము లొనర్చుచుండిరి. కొందఱు కరికరుసకు సహస్రనామార్చనలు గావించుచుండిరి. కొందఱాకాశమునందున్న తాంకాలింగమునకు దీపములు పెట్టుచుండిరి. కొందఱు పవలెల్ల దేవతాప్రీతికై స్నానపూజాదానాదులచే గడపి రాత్రిపూట మాత్రము

భుజించుచుండిరి.

ఇట్లు పరమపవిత్రములగు నీదినములలోఁ బూర్ణిమ మిగుల నుత్కృష్టమని యెన్నఁదగి యున్నది. నేఁడు పూర్ణిమ. కరఁగించిపోసిన వెండి బిళ్లవలెఁ జంద్రుఁడు వినీల గగనభాగమునఁ బ్రకాశించుచుండెను. తదీయకాంతి సంతతులు జగముపయి వ్యాపించి సుధారసలహరిలోఁ దానమాడించి ప్రాణుల కమితానందసౌఖ్యము లిచ్చుచుండెను. గుణవంతులును, విద్యావంతులును, సాధుహృదయులునగు దంపతులొకరిచే నొకరు ప్రకాశించుచున్నట్లు, పరిమళ సుమసంతతులచే శోభిల్లి యల్లిబిల్లిగఁ బెనచికొని యున్న లతావృక్షములు పరస్పరశోభగాంచిన చందంబున శారదనిశాశశు లన్యోన్యభాసమానములయి, యలరారుచుండెను.

నేఁడు జనులందఱును జ్వాలాతోరణ మహోత్సవమునం దాసక్తులయి యుండిరి. ఈయుత్సవము కార్తికపూర్ణిమాదినమునఁ బలుతావుల సంప్రదాయసిద్ధముగా నెఱవేర్పఁబడుచున్నది. ఆయుత్సవమేదియో కొంచెము వివరించుట యనావశ్యకము కాదు. ఈయుత్సవాచరణకుఁ గారణము పెద్దలిట్లు చెప్పుదురు. ఈశ్వరుఁడు త్రిపురాసుర సంహారమునకుఁ గడంగినప్పుడు పార్వతీదేవి తనప్రాణవల్లభుఁడు విజయమునొంది నిరపాయుఁడై తిరిగి యింటికివచ్చెనేని తోడనే యతనితోఁ గూడ నగ్ని నారాధించి తత్కీలామాలక్రిందనుండి ముమ్మాఱు దూఱి ప్రదక్షిణము నొనర్తునని యగ్నికి మ్రొక్కుకొన్నట్లును, శంకరుఁడట్లు విజయమునొంది కార్తికపౌర్ణమినాఁటికిరాగా దేవి తన మ్రొక్కు దీర్చుకొనుటకై యగ్నిజ్వాలలక్రిందనుండి భర్తతోఁగూడఁ దూఱివెళ్లినట్లును, జెప్పుదురు. ఇట్లొనర్చుట పార్వతి కత్యంతప్రీతికరమగుటచేఁ దద్భక్తులందఱును, నిప్పటికిని దత్పూర్ణిమనాఁ డీయుత్సవమొనరింతురు. ప్రతిసంవత్సరము నాదేవతోత్సవమూర్తులను బల్ల

కిలోనుంచి యూరేగించి యాపల్లకితోఁ గూడ నాసనాతన దంపతు
లను జ్వాలామాలక్రిందనుండి కొనిపోవుచుందురు. అట్లు స్వామితోఁ
గూడ నాజ్వాలలలోనుండి వెళ్లుట పరమపుణ్యప్రదమని నమ్మి ప్రజలు
కూడ నట్లు చేయుదురు. మఱియు వరసగా నాల్గుస్తంభములను నాఁటి
వరిగడ్డిత్రాడు వానికొనలకుఁగట్టి యెండిన యరఁటియాకులచెత్తను
నాత్రాటిపై దిగువకు వ్రేలవైచి, యందు ముందుగా మధ్యభాగమున
నాతోరణమునకు నిప్పంటించి, యది మండుచున్నపుడా జ్వాలక్రింద
నుండి తూర్పుముఖముగాఁబోయి కుడిప్రక్కకుమరలి దక్షిణభాగ
మందున్న భాగము నట్లుచేసి, దానిక్రిందనుండి పశ్చిమముగా నరిగి
యటనుండి యుత్తరముగా నడచి యావంకనున్న తక్కిన భాగమును
గూడఁ బ్రజ్వలింపఁజేసి దానిక్రిందనుండి మరలఁ దూర్పుగా నడచి యట
నుండి యుత్సవమూర్తులను నాలయమునకుఁ గొనిపోవుదురు. ఆదేవ
తాదంపతులతోఁ గూడఁ బ్రజలందఱు గూడ నట్లు ప్రదక్షిణముచేసి
ముమ్మాఱయిన తోడనే యాజ్వాలాతోరణముపయిఁబడి చల్లార్చి
యావరిగడ్డిత్రాటిని బలువురుబట్టుకొని తునక తునకలుచేసి కొం
చెముకొంచెముగా నావరిగడ్డిని పంచుకొని కొనిపోయి తమపశువులను
మేపుదురు. అవి తిన్న పశువులు సదారోగ్యవంతులయి, బలిష్ఠము
లయి యుండునని ప్రజలవిశ్వాసము. అందుచే నాఁ డాగడ్డిపోచలను
సంపాదింపఁ బ్రజలు బహువిధములఁ బెనఁగుచుందురు.

నేఁడు గామయ్యగ్రహారమున నీయుత్సవము జరుపఁ బ్రజలు
మహోత్సాహముతో వచ్చి గుమిగూడి యుండిరి. రామావధాని
పూర్వులెవ్వరో దేవాలయప్రతిష్ఠగావించి యందలిస్వామి భోగరాగ
ములకై కొన్నిభూము లిచ్చియున్నందునఁ దద్వంశజుఁడగు రామావ
ధాని తద్ధర్మకర్తృత్వ మవలంబించి పనిచేయించుచుండెను. రామావ
ధాని భక్తిపూర్ణమగు మనస్సుతో దేవతోత్సవాదులను లోపము

లేకుండఁ జేయించుచున్నను, నాగ్రామవాసు లేదో విధమున లోపము లెంచుచునేయుందురు. అయినను మాటపలుకుబడిగల రామావధాని నెవ్వరు నెదిరింపలేక నోరుమూసికొని యూరకుండెడివారు. కాని యీసంవత్సరమట్లు కాక గ్రామవాసులు పెక్కండ్రేకమై యవధానితో శత్రుత్వమవలంబించిన వారగుటచే, నేఁడెట్లయిన నతనికిఁ దగిన పరాభవదుఃఖము గల్గింప నిశ్చయించుకొనిరి. ఇదివఱకెప్పుడు నీయుత్సవమునఁ బాల్గొనకపోయినను నాగ్రామవాసులగు బ్రాహ్మణులు పెక్కండ్రానాఁడు వచ్చిరి. ఆగ్రామమున వారును, పొరుగూరివారును నగు రైతులుగూడఁ బెక్కండ్రు వచ్చిరి. స్వామివారి యూరేగింపుటుత్సవము ముగిసినది. అందఱునువచ్చి కర్తవ్యకార్యమున కెదురు చూచుచుండిరి.

అప్పటికి రాత్రి రెండు యామములు గడచెను. రాకాచంద్రుఁడాకాశ సరోవరమున వికసించిన సితపద్మమువలె విరాజిల్లుచుండెను. రామావధాని యత్యుత్సుకులై వచ్చిన ప్రజాసమూహములను జూచి యర్చకుని బిలిచి యిట్లు సంభాషించెను.

రా—గ్రామస్థులగు బ్రాహ్మణు లందఱను బిలిచితివా?

అ—చిత్తము. అందఱను బిలిచితిని.

రా—వా రందఱును వచ్చినారా?

అ—ఏమో! ఈ సమూహములో నెట్లు తెలిసికొనఁగలము. కాని నా లోపము లేకుండ నందఱను బిలిచితిని.

రా—మనము చేయవలసిన దదియే. పిమ్మట వారు వచ్చినను సరియే, రాకున్నను సరియే.

అ—చిత్తము.

రా—అట్లయిన నిఁక సంకల్పము కానీవచ్చును.

అర్చకుఁడు చిత్తమని కూర్చుండి యచ్చటివారి యనుమతిని బడసి

యాచమనము చేసి "కేశవ, నారాయణ, మాధవ, గోవింద, విష్ణో" అని చెప్ప నారంభించెను. అంతటఁ బ్రజాసమూహము నొత్తిగించుకొని సుమా రేఁబదివత్సరముల ప్రాయముగల యొక బ్రాహ్మణుఁడు ముందునకు వచ్చెను. కాని వేషమునుబట్టి యతనిని బ్రాహ్మణుఁడని యనఁజాలము. అతఁడు మెడ మొదలు చీలమండలవఱకును బాగ జూరినట్లు మిక్కిలి మురికిపట్టి మలినమైన ముదుక దుప్పటిని గప్పుకొనియెను. అతనికిఁ దలపై చెవుల క్రిందివఱకును జూరు దిగిన పెద్ద బుట్ట పాగయుఁ జేతిలో నతనికంటెను నొక రెండడుగులు పొడుగుగల యుద్దండపురపు వెదురుగఱ్ఱయు గలవు. అతఁడు వచ్చుచుండుటను జూచి ప్రగ్గడవారు చోటిచ్చి "సోమప్పగారూ! రండు, కూర్చుండు" డని గౌరవించిరి. కాని యతఁ డాగౌరవమును జేకొనక, కనులనుండి నిప్పులు గురియ మేఘ గంభీరస్వరముతో నర్చకుని "శేఖరప్పా" యని పిలిచెను. సోముఁడనే యతఁ డాసంకల్పము మాని యటుచూచెను.

బ్రా—ఓరీ! శేఖరప్పా! నీకు మతి లేదా? ఊరిలో పిన్న పెద్దలు వచ్చినారో లేదో చూడవలదా? క్రిందుమీదు చూచుకొనకుండఁ దోసిల్లుచున్నావు. ఒకమాఱు గట్టిగా దేహశుద్ధి గావించిన గాని నీకు బుద్ధి రాదు. నీవును, నీ యవధానిగాఁడును, నేకమై యూరి గౌరవ మంతయుఁ జెడగొట్టుచున్నారు" అని యొకరు చెప్పినమాట వినిపించుకొనకుండ నా యర్చకుని, రామావధానిని నిందింప నారంభించెను.

అందులకు రామావధాని యేమియును సమాధాన మొసఁగలేదు. అప్పు డర్చకుఁ డూరకుండక "ఓ సోమప్పబాబుగారూ! మేము చెప్పినది వినకుండ మీ రిట్లు నిందించుట తగదు. మాయం దెట్టి లోపమును లేదు. గ్రామవాసుల నందఱను, నింటింటికి వెళ్ళి, నిద్రించిన వారిని మేల్కొలిపి మఱియుఁ బిల్చితిని. వారు రాకపోయిన మేమేమి

చేయఁగలము?'' అని పల్కెను.

బ్రా—ఓరీ! మూర్ఖుఁడా! అడ్డుగాఁ దెగనీల్గుచున్నావు. చూడు. ఏమి చేసెదనో? పిలిచితిని, పిలిచితి ననుచున్నావు. ఎవ్వరిని బిలిచితివి?

అ—అందఱను బిలిచితిని.

బ్రా—అందఱను బిలిచితివా?

అ—ఒకమాఱుగాదు, వేయిమాఱులు.

బ్రా—మా సింగన్నగారి జాంబన్నను బిలిచితివా?

అ—పిలిచితిని.

బ్రా—ఏమన్నాఁడు?

అ—భోజనము చేసి పొలములోనికి వెళినారంట.

బ్రా—అది నీ కెందుకు! వాఁడు నీతో నేమన్నాఁడు? ముందదిచెప్పు.

అ—నాతో వచ్చెదననియే యన్నారు.

బ్రా—అట్లయిన సంకల్పసమయమని మఱియొక మాఱు పిలువవలదా?

అ—పొలమునకు వెళ్ళియా?

బ్రా—అవును. పొలమేయన్న మాట యేమి? తుదకుఁ గ్రామాంతరమునకు వెళ్ళినను వెళ్ళి తీసికొని రావలెను. మర్యాద యనఁగా నే మనుకొన్నావు?

అ—అయ్యా! ఇది నాయింటి పెండ్లి కాదు. దేవతాకార్యము. దీని కందఱును బెద్దలే? భక్తితాత్పర్యములతో నందరును రావలయునుగాని పొలములోనికి వెళ్ళియు, బొరుగూరికి వెళ్ళియు నెవ్వరు పిలువఁగలరు?

బ్రా—అర్చకత్వమన్న మఱియేమనుకొన్నావు.

అ—అర్చకత్వమనఁగా దేవతాపూజ. అది చేయుటయు, వచ్చినవారికి స్వామివారి ప్రసాదమర్పించుటయు నాపని.

బ్రా—ఓచండిపోతా! గుడ్లు మీఁదికివచ్చి నీల్గుచున్నావు. అట్టివాఁడ వింటింటికి వెళ్లి యెందులకుఁ బిల్చినావు?

అ—ఇంటియొద్దనుండినఁ బిలువవచ్చును. అంతేకాని పొలములోఁ బండుకొన్నవారిని మేల్కొలిపి తీసికొనిరమ్మనఁ నెవ్వరి శక్యము!

బ్రా—ఎవ్వరికి శక్యమా?

అని యతఁడు నోటికివచ్చినట్లు కేకలు వేయుచుండెను.

రామావధాని యర్చకుని శాంతింపఁజేసి యామూర్ఖబ్రాహ్మణుని సరకుచేయక సంకల్పముగావించి స్వామిపల్లకి యెత్తుటకు బోయీల కాజ్ఞయిచ్చెను. వారు పల్లకినెత్తిరి. రామావధాని శరవేగముతో జ్వాలాతోరణమునకుఁ బల్లకిని బ్రదక్షిణము చేయించి యాలయమునకుఁ గొనిపొమ్మని, తాను తన మందిరమునకు వెడలిపోయెను. ఆ బ్రాహ్మణుఁడు తన మాటను ధిక్కరించిన రామావధానికిఁ దగిన ప్రాయశ్చిత్తము చేయవలయునని యాప్రజాసంఘమునందుఁ దనవారిని వెదకి తెచ్చుకొనెను. కాని లాభములేకపోయెను. రామావధాని వెడలిపోయినను, నతని సోదరుఁడును రైతులును నాతోరణపు గడ్డికై యచటనుండి యొకరితో నొకరు పెనఁగులాడుచున్నప్పుడు వీరందఱు పోయి వారిమీఁదఁబడిరి. ఒకరినొకరు కొట్టుకొన నారంభించిరి. అంత నవధాని సోదరుఁడును, రైతులును నొకపక్షమై తమ్మెదిరించినవారిని గొట్ట నారంభించిరి. ఇట్లు కలహించుచున్న సమయమున మధ్యవర్తులువచ్చి వారిని విడిపించి యెవ్వరియుండ్లకు వారి నంపివేసిరి. అందు ఇరుపక్షములవారికిని గూడ దెబ్బలు తగిలినవి. ఈవిధముగా నాఁటికిఁ గొట్లాటముగిసినను, వారివారి చిత్తములలోని పగ ముగియ

లేదు. అది క్షణక్షణము రవిలి యభివృద్ధిచెంది వారిని మఱింత మూర్ఖులనుగాను, నవివేకులనుగాను సాహసులనుగాను జేయుచునే యుండెను.

౭

కాలమునకు మహాజవముగలదు; మహాబలముగలదు; అనివార్యశక్తులు గలవు; అఘటన ఘటనాసామర్థ్యము గలదు. దానికి సర్వము లోఁబడవలసినదే! దాని నతిక్రమించుటకు మానవులే కాదు, దేవతలయినను సమర్థులు కారనుట సర్వవిదితము. ఆకాలము మనోవేగమును మించినవేగముతోఁ బర్విడుచుండును. సకల స్థావరజంగమాత్మకమగు ప్రపంచమున కంతకును క్షణక్షణపరిణామము గల్గించుచుండును. సర్వపరిణామకమగు కాలము కడచి పోవుచుండెను. ఏండ్లును బూండ్లును దాటిపోవుచునే యుండెను. కొండలవంటి ఘన పదార్థములకు గొంచెమైనను మార్పుగలదు కాని, యగ్రహారవాస్తవ్యుల చిత్తములకు మాత్ర మట్టిపరిణామము లేదు. వారిదురూహలు, కపటచిత్తములు, మాయోపాయములు, కలహములుఁ మొదలగున వింకను శాంతింపలేదు. అవియెప్పుడును నేక విధముగానే యుండెను. అదివఱలో వారికుండిన కలహములన్నియు, రామావధాని గారియింటి వివాహవిఘ్నమైనప్పటినుండియు మఱింత వర్ధిల్లెనని యిదివఱకే వ్రాసియుంటిని. ధనవంతుఁడగు శ్యామసుందరుఁడు, న్యాయవాదియగు శ్రీనివాసరావు తమకుఁ జేదోడగుటచే నగ్రహారస్థులు రామావధాని నడఁగఁద్రొక్క మరింతప్రయత్నము చేయుచుండిరి. మఱియు వివాహవిఘ్నమయి యిప్పటికి రెండు మూఁడు

వత్సరములు కావచ్చినను, శ్యామసుందరుఁడు రామావధానిపై
ద్వేషానల జ్వాలలను బ్రసరింపఁ జేయుచునే యుండెను. అగ్నికి వాయు
వు తోడయినట్లు శ్రీనివాస మతనికిఁ దోడగుచునే యుండెను. వారిరు
వుర సాయముగ నుండుటచేఁ దను వైరమును సాధింపవలెనని యుగ్ర
హోరస్థులు పెచ్చు పెరిగిపోవుచునే యుండిరి. ఒకఁడు రామావధాని తన
కీయవలసినట్టుగా నప్పుపత్రము నొక కానిం గల్పించి వేయి రూపాయిల
కతనిపై దావా తెచ్చియున్నాఁడు మఱియొకఁడు రామావధాని
యక్రమముగా నల్వురును నడుచుచున్న మార్గమును దన భూమిలోఁ
గలుపుకొన్నాఁడని యతనిపై నభియోగము చేసెను. మఱియొకఁడు
రామావధాని పశువులు తన చేను మేసినవని చెప్పి యతని పాలి
కాఁపును దన్ని యా పశువుల నన్నింటిని బందెలోఁ బెట్టెను. ఇం
కొకఁడు రామావధాని పాలికాపులచే దొంగతనముగాఁ దన చేను
గోయించుకొని పోయినాఁడని యభియోగము దెచ్చెను. ఇట్లు పలు
వురు పలు విధములఁ జెట్టికిఁ జీమలు పట్టుకొన్నట్లు పట్టుకొని
బాధింపఁజొచ్చిరి. ఇంట్లింక ఇన్ని విధముల బాధించినను, రామావ
ధాని సుంతేనియు భయపడలేదు. అధైర్యపడలేదు. వెనుదీయలేదు.
ధనవ్యయమునకు జంకలేదు. ధర్మమునకు జయము కలుగక పోదన్న
విశ్వాసముచే గచ్చేరీలలో నంగటి కన్ని హాపులై పని చేయుచునే
యుండెను. కొన్ని దావాలను గెల్చి ప్రతి పక్షుల గర్వ పరిహారము
చేయుచునే యుండెను. కొన్నింటిలో నోడిపోయినను బునర్విమర్శము
చేయుమని పైయధికారమునకు విజ్ఞాపనపత్రము బంపుచునే యుండెను.
విశాఖపట్టమున కరిగి రమణమ్మను, వెంకునాయని, తనవశము
గావించుకొని ధనమునకై శ్రీనివాసముపై వారిచే దావా తెప్పించి
పనిచేయుచునే యుండెను. రామావధాని ప్రతిపక్షులకు ధనములేదు.
కడుపులోఁ గావలసినన్ని కుట్రలున్నవి కాని యూరిలోఁ గొంచె

మైనను బలుకుఁబడిలేదు. రామావధానిని బాధించుటలో వీరంద
ఱేకమైనను, వీరిలో వీరికిఁ బరస్పరమును ద్వేషము లేకపోలేదు.
ఇట్లుండఁగా రామావధాని కుటుంబమునకుఁ దీఱని యపవాదము
నంటఁగట్టి వ్యాపింపఁజేసినారు. రామావధాని యిన్ని కష్టములకు
నోర్చి పని చేయుచున్నాఁడు కాని, యిది వినఁగానే నిలువున నీఱయి
పోయెను. ఆ యపవాదము కేవలము మిథ్యామూలమైనను, నూరంత
టను గ్రసుముగాఁ బ్రాకి యా కుటుంబమువారి కది తలవంపులుగా
గావించుచుండెను. రామావధాని రెండవకూఁతురగు రుక్మిణి రామా
రావుతో సంబంధము గల్గించుకొని చెడిపోయినదని యూరిలోఁ
జిన్న పెద్దల నోళ్ళయందు వెడలునట్లు చేసిరి. ఈ యంశమే యిండ్ల
గోడలపై గుమ్మడికాయలంత లేసి యక్షరములతో వ్రాయఁబడి
యుండెను. రామావధానియే కాక, యతని కుటుంబముగూడ నీవిష
యమై దుఃఖించుచుండ నీ యపవాదకు లందఱును నానందభరితులై
యొకనాఁడు శ్యామసుందరు నింటఁ గూడి యిట్లు ప్రసంగింప నారం
భించిరి.

ఒకడు—(శ్యామసుందరునిఁజూచి) సుందరము బావా! నేటితో
రామావధాని కోరలు తీసిన పామైనాఁడు. దీనితో నడుగంటిపోవు
ననియే నా నమ్మకము.

శ్యా—మీరు చేసిన పని సరిగా నుండవలెను. గోడలమీఁద
వ్రాసినంత మాత్రముననూ, గ్రామములో వ్యాపింపఁజేసినంత మాత్రము
నను లాభము లేదు.

మొద—మఱి యేమి చేయవలయును?

శ్యా—ఇంగ్లండులో నున్న సుదర్శనరావున కీ విషయము
ముఖ్యముగాఁ దెలుపుచు నుత్తరము వ్రాయవలెను.

మొ—(మఱియొకనిఁజూచి) రామన్నా! మన మనుకొన్నట్లు

చేసినావా ?

రా—సింగన్నమామా! ఆ యంశము మరల నాకు స్మృతికిఁ దేవలయునా? ఆనాఁడే సుదర్శనరావునకు వారి యాత్మబంధువుఁ డొకఁడు వ్రాసినట్లు వ్రాసి పంపియున్నాను.

సిం—(సుందరముతో) బావా! నీవెంత యింగ్లీషు చదువుకొన్నను నెంతలౌక్యుఁడవైననునీపాటి తెలివి మాకులేదనుకొన్నావా? మాకు నిజముగా లేకపోయినను, నీ సాహసముచేతనైనను లభింపదా? అట్టి వాని విషయమైన నీవు జ్ఞాపకము చేయవలెను. ఇప్పు డెందులకు వచ్చితిమో తెలియునా? మఱికొన్ని పనులు మన మాచరింపవలసియున్నది.

శ్యా—ఏమి చేయవలయును?

సిం—మన మందఱము గలిసి దుర్నీతికార్య మాచరించిన కూతుఁ నింటఁ బెట్టుకొన్నందులకు రామావధాని కుటుంబమును బ్రాహ్మణసంఘమునుండి బహిష్కరించిన ట్లాజ్ఞాపత్రము నొకదానిని బంపవలయునని శ్రీ విరూపాక్ష స్వాములవారి కొక మహాజరును బంపవలెను. దానిపై మనమందఱమును జేవ్రాళ్ళు చేయవలసియున్నది. ఈపని వేగముగా జరపి యమావాస్య లోపున నాచార్యులవారినుండి శ్రీముఖము వచ్చునట్లు చేయవలెను. అమావాస్య వెళ్ళిన విదియనాఁడతని తండ్రి యాబ్దికము. ఆనాఁ డెవ్వరు నతని గుమ్మము త్రొక్కకుండఁ జేయవలెను. ఆచార్యులవారి యాజ్ఞాపత్రి ముండినగాని మన బ్రాహ్మణులు ధనాశచే వారి యింటికి వెళ్ళకమానరు.

శ్యా—బావా! నీ వన్నది సత్యమే. కాని ముందుగా మన చేతికి లొంగినంతవఱకుఁ జేయవచ్చునుగదా!

సి—ఏమి చేయవలయును?

శ్యా—చాకివాఁడు బట్టలుదకకుండ, మంగలివాఁడు క్షౌరము

చేయకుండ జేయవలెను. ఇంతేగాదు. ఈమొదలగుపనులలో సంఘము వారెవ్వరును రామావధాని కుటుంబమునకుఁ దోడుపడగూడదు.

సి—ఇందులకై మిక్కిలి ప్రయత్నము చేసినాము. మన యభీష్టము చాలవఱకు నెఱవేఱినది కాని, చాకలి రామిగాఁడు మాత్రము చెప్పినట్లు వినకుండ నున్నవాఁడు. మీ పల్లపు పొలము దున్నుచున్నాఁడు. కాన యెట్లయినను బెదరించి మనము చెప్పినట్లు చేయవలెను. అందులకై వానినిగూడఁ దీసికొని వచ్చినాము. వీధిలో నున్నాఁడు పిలిపించి యొకమాట చెప్పుము.

శ్యా—(గట్టిగా) ఓరీ, రామిగా! అని పిలిచెను.

రా—(ప్రవేశించి) ఏమి? బాబూ!

శ్యా—నీ వొక్క విషయములో మాకుఁ దోడ్పడవలెను.

రా—ఏమో చెప్పండి.

శ్యా—గ్రామము నశేషము రామావధానిగారిని బహిష్కరించినారు. మాతోఁబాటు నీవుగూడ బహిష్కరించవలెను.

రా—ఆ జోలె నాకెందుకు బాబూ! మీరు మీరు బ్రాహ్మణులు. మీ రేమి చేసికొందురో చేసికొండి. నాకేమి!

శ్యా—అట్లుగాదు. రామావధానిగారి బట్టలు నీవుదకరాదు.

రా—అది కుదురదు బాబూ! మాముత్తాత మొదలుకొనియు వారి పని చేయుచున్నాము. అందులకై యొక గరిసెధాన్యము పండు పొలము గూడ మాకిచ్చినారు. అట్టివారి పని నే నెట్లు మానఁగలను. పని మానినచో నా భూమిని వారు లాగుకొనరా?

శ్యా—నీకా భయము లేదు. ఆ భూమి గ్రామము మొత్తము మీద నిచ్చినది కాని కేవలము రామావధాని యిచ్చినది కాదు.

రా—బాబూ! నాకదంతయుఁ దెలియదు. ఉత్సవసమయములందు మన గ్రామములోని దేవుని సేవించుటకును, రామావధాని

గారి యింటిపని చేయుటకును, బ్రతిఫలముగా నా భూమి యీ రామావధానిగారి ముత్తాత మా ముత్తాత కిచ్చినట్లు మా తండ్రి చెప్పుచుండేవాఁడు. ఆ భూమి వారు లాగుకొన్న తరువాత నే నేమి చేయఁగలను? అప్పు డెవ్వరికాళ్ళు పట్టుకొందును?

శ్యా—ఓరీ! రామిగా! నీ వెవ్వరికాళ్ళను బట్టుకొన నక్కఱ లేదు. ఆ భార మంతయు నాపై వదలుము. మూఁడు కచ్చేరీలలోను రామావధాని నోడించి గెల్చి నీ భూమి నీకు వశమగునట్లు చేయుదును.

రా—మీరు మాటలు చెప్పుచున్నారు కాని, ఈ కర్చులకు సొమ్మెవ్వరు పెట్టఁగలరు?

శ్యా—నీ కా భయము వలదు. ఎంత సొమ్మయినను నేను బెట్టెదను.

రా—చాలు. చాలు. బాబూ! మీ రేమి? సొమ్ము కర్చు పెట్టి గెలిపించు టేమి? అబ్బాయి పెండ్లినాఁడు పల్లకీ మోసినందుల కీయవలసిన నాల్గురూపాయలు ఇప్పటికి నియ్యకుండఁ ద్రిప్పులు పెట్టుచున్న మీరు నా భూమిని గెలిపింతురా?

శ్యా—(కోపముతో) ఓరీ! నీవు క్రిందుమీఁదు చూడక మాటాడుచున్నావు. జాగ్రత్త. నా చెప్పినట్లు చేయకపోయినచో నా పొలము దున్ననీయను.

రా—బాబూ! మీ కొక దండము. మీ భూమి కొక దండము. నా కక్కఱలేదు. సిస్తురూపాయలు చెల్లించినఁ గదా దున్ననిచ్చుచున్నారు (అని వెడలిపోవుచుండెను.)

సిం—ఓరీ! రామిగా! తొందరపడకు. ఆలోచింపుము. అదంతయు నెందులకు? గ్రామ మంతయు నొక త్రోవను నడుచుచున్నప్పుడు నీ వొక్కఁడవు పెడమార్గమునఁ బోరాదు.

రా—గ్రామ మంతయు ననుచున్నారు. ఎవ్వరు వారిని వెలి వేయఁగలరు? మనోదుఃఖములచే మీవంటివా రెవ్వరో యిది యంతయు పన్నినారు గాని నిజముగా నా యమ్మ యట్టి పని చేయునా?

సి—ఓరీ! నీ కా సందియము వలదు. నేను ప్రత్యక్షముగాఁ జూచినాను. గాత్రి రామారావువారి యింటికి వెళ్ళుట యెఱుఁగుదును. తెల్లవాఱుజామున నతఁడు వారి యింటనుండి వచ్చుచుండగా నే నెదురుపడి పల్కరించినాను. ఈ విషయమై పెద్ద భారతగ్రంథమంత యున్నది. నీ కేమి తెలియును?

రా—బాబూ! తెలియనిండి, తెలియకపోనిండి. నేను వారి పని మాని నా కూటిలో ఱాయి వేసికొనలేను (రాముగా డిట్లని వెడలి పోయెను.)

సిం—బావా! చూచితివా! వీని పొగరుబోతుతనము? నీ మాటయం దెంత నిర్లక్ష్యము! కానిమ్ము వీనికి బుద్ధి చెప్పింతము. ఈ ముండకొడుకు కొక్కఁడు రామావధానితోఁ గలిసినంతమాత్రమున మనకు నష్ట మేమి? దాని నట్లుండనిమ్ము. కాని బావా మన మొక పనిచేయవలసి యున్నది.

శ్యా—ఏమో చెప్పుము.

సిం—నిన్నను జరిగిన కలహములో మనవారికిఁ బెక్కు దెబ్బలు దగిలినవి. అవధాని పక్ష మవలంబించి పోట్లాడినవారి పేర్లు వ్రాసియున్నాను. వా రందఱపైని నభియోగము తేక తీరదు. అవధానిని గూడ వారిలోఁ జేర్పవలదా?

శ్యా—చేర్పక యెట్లు? శొంటిలేని కషాయము గలదా!

సిం—అంతయు సన్నద్ధము చేసినాము. మీరు మా శ్రీనివాసము తమ్ముని కొక యుత్తరము వ్రాసి యిచ్చినచో నేనును మావాఁడును వెళ్ళి పని నెఱవేర్చుకొని వచ్చెదము.

శ్యా — నాటిమాటికిని నేనుత్తరము వ్రాసి పంపిన నతఁ డేమనుకొన్ననో! ఒకటియా, రెండా! అతనిచే నెన్ని పనులు చేయించుకొన్నాము.

సి — బావా! అట్లు సందేహించెద వేమి? శ్రీనివాస మట్లను కొనుటకుఁ బెఱ్ఱివాఁడా యేమి? ఇంతకును రామావధానిని బాధించుట యతనికి మాత్రము ఇష్టము లేదనుకొన్నావా? అతఁ డెప్పుడు నట్లు భావించువాఁడు కాఁడు. నే వెళ్ళుచున్నప్పు డుత్తర మక్కఱ యనే లేదు. అయిన నతనికి నీ మాట యందు గురి హెచ్చు. అందుచే నట్లన్నాను.

శ్యా — బావా! అట్లే కానిమ్ము. అంత నతఁ డుత్తర మొకటి వ్రాసి యిచ్చి "ఓయీ! మా భద్ర తండ్రిని జూడఁ గోరుచున్నది. మా బావగారి నొకమా టిచ్చటికి వచ్చునట్లు చేయు" మని చెప్పెను.

సింగన్న మొదలగువారు మఱునాఁడు తెల్లవాఱుజాముననే బయలుదేరి శ్రీనివాసుని నిమిత్తమై విశాఖపట్టణమున కరిగిరి.

## ౮

రామావధాని వైదికసంపదయు, లోకజ్ఞానసంపదయుఁ గలవాఁడు. వీనికిఁ దోడు చాలినంత ధనసంపద గలదు. అయినను నిత్యకర్మాదులందుఁ గాని, దేవతాపూజాది కార్యములందును గాని యింతేనియుఁ బ్రాల్మాలిక లేనివాఁడు. ఇన్నింటికంటెను ముఖ్యముగాఁ దగినంత ధైర్యసారము గలవాఁడు. సామాన్యముగా ధన మున్నవారు వెచ్చించి సుఖింపలేరు. ఇతఁ డట్లు కాఁడు. సమయానుగుణముగా ధనమును వెదఁజల్లి కార్యము లెట్టివైనను సాధింపఁ జాలినవాఁడు. కావుననే

తన గ్రామములోఁ బెక్కం డ్రేకమై తన్నుఁ బలువిధముల బాధించి
నను గొంచె మేనియు జంకక తన శత్రువుల కందఱకును నేదో విధ
మునఁ బ్రతీకారము చేసి వారికి బుద్ధి చెప్పుచుండెను. ఇట్లితఁడు తన
యూరియం దున్న శత్రువులకు నష్టము గల్గించుటయే కాక యీ
కష్టముల కన్నింటికిని గారణభూతుఁ డగు శ్రీనివాసమును గూడ
నదోగతికిఁ బంపఁ బనిచేయుచుండెను. ఇన్ని పనులలోను రామావ
ధానికిఁ దోడ్పడుచున్నది ధనసంపద. ధనము సర్వార్థసాధనము
గదా! చాలినంత ధనసంపన్నుఁడై కార్యాసక్తత గల్గి ధర్మమార్గ
మున వర్తించినచో నెవ్వరి కార్యములు కొనసాగవు? ఆయూరివారు
రామావధానిపైఁ దెచ్చిన యభియోగములలో జాలవఱకు రామావ
ధాని పక్షముగాఁ దీర్మానింపఁబడెను.

అందులకుఁ గారణము తగిన సాక్ష్యము లేకపోవుటయే. ప్రత్యభి
యోగమునందును నా బ్రాహ్మణులే సాక్ష్యులై యొక్క మాదిరినే
పాఠ మప్పగించుచుండుటచే న్యాయాధికారులు లా సాక్ష్యమును నమ్మక
యభియోగములను విరుద్ధముగా దీర్మానింపసాగిరి. వారిలో సింగన్న
దెచ్చిన యభియోగము సరిగా ఋజువు పడకపోవుటచే నది చెడు
టయేకాక మీఁదు మిక్కిలి రామావధానికి రెండు వందల రూపా
యలు పరిహార మియ్యవలసి వచ్చెను. ఈరీతిగా రామావధాని శత్రు
వుల కందఱకును బ్రతిఘటించి నిలువఁబడి చూపిన ధైర్యమంతయుఁ
నొక్కపెట్టున పటాపంచ లాయెను. దానికిఁ గారణము తన శత్రువు
లచేఁ గల్పింపఁబడిన దురపవాదమే. అవధాని యెట్టి చిక్కులనైనను
సహింపఁగలఁడు కాని యిట్టి కళంకము సహింపలేఁడు. ఆ కళంకము
మిథ్యాభూత మగుటచేఁ దన విషయమైకాని, తనకులము విషయమై
కాని విచార మంతగా లేదు. కాని సద్గుణవతియగు తన కుమారిక
దుఃఖమును జూచి తాను దుఃఖము భరింపలేక పోవుచుండెను. నిజ

మాలోచింప నది భూరిదుఃఖము కదా! ఈ వార్త రుక్మిణి యత్త వారికిఁ గాని, ప్రాణము వల్లభునకుఁ గాని తెలిసినచో రుక్మిణి జీవన మింక దుఃఖభాజనము కాక వేరేమున్నది? ఇంక రుక్మిణి యిహలోక జీవన నాటకము ముగిసిపోయినట్లే కదా? గ్రామమం దంతటను బొక్కి-పోయిన యీ యపవాదమును గప్పిపుచ్చు టెట్లు? ఈ మిథ్యాప వాదము, సత్యము ప్రత్యక్షమైనప్పుడు సూర్యోదయా నంతరమున లోకావారకమగు పొగమంచువలెనే యత్యంతాభావ మందక మాన దని నెఱుఁగుటచే తన దుఃఖమును శమింపఁజేసికొన్నను, రామావ ధాని తన పత్నీపుత్రికల దుఃఖము నెట్లు శమింపఁజేయఁగలఁడు? తక్కిన బంధువర్గము నెట్లు సమ్మింపఁగలఁడు? ఇంతకును దన యల్లుని సంశయ మెట్లు తీర్పఁగలఁడు? ఇట్టి చిక్కులోఁ బడి కొట్టుకొని పోవుచుండఁగా తన జనకుని ప్రత్యాబ్దికము పెట్టవలసి వచ్చెను. ఈ యపవాద మంతటను వ్యాపించుటచే నూరిలోని వా రెవ్వరును భోక్తలుగా రాఁజాల మనిరి. కొందఱు ధనాశచే వచ్చుటకు సిద్ధమై నను సింగన్న మొదలగువారు నయభయములచే వారికి నచ్చఁజెప్పి వారిని రామావధాని యింటికి రాకుండఁ జేసిరి రామావధాని పొరు గూరికరిగి యచ్చటఁ బ్రత్యాబ్దికము జరిగించికొని వచ్చిన నెట్టిచిక్కు ను లేకపోవును. కాని యట్లు చేయుటవలన శత్రువులు నవ్వుదురేమో యని యతని యనుమానము. తన పగవారి హృదయము వెరియు నట్లు తనగృహమునందే పైతృకము జరిగింపవలయునని యతని పట్టు దల. అడిగినంత ధనమిచ్చి వేఱొక గ్రామమునకు వార్త పంపి బ్రాహ్మణులను రప్పించి తన పగవారు తల లెత్తలేకుండఁ జేసి యథా విధిగా శ్రాద్ధము జరిగించెను. ఇట్లు కార్యము ముగించుకొన్నందుల కా కుటుంబమువా రానందించుచుండఁగా దపాలావాఁ డొక యుత్త రము తెచ్చియిచ్చెను. దానిపై విలాసము రుక్మిణియని యుండుటచే

నవధాని దానిని కుమారికకుఁ బంపివేసెను. రుక్మిణి యాయుత్తరము లండనునుండి తన వల్లభుండు రచించినట్లు గ్రహించి, చటాలునఁ దన గది కరిగి చదువుకొనెను. ఆ యుత్తరము కంటఁ బడగానే తన వల్లభుని కన్నులారఁ గాంచినట్లే పరమానంద మొందినది. తన ప్రాణ నాథుఁడు తన కెట్టి సంతోషకర విషయములు వ్రాయునో యని పర మాదరముతోఁ జదువుకొన్నది. ఆ యుత్తరము చదువఁగానె యామె గాలిదెబ్బ దిన్న కదలికవలె నేలఁ బడిపోయెను. ముఖమునందున మంత యు నొక్కపెట్టున నంతరించిపోయెను. దుఃఖభరంబున నిట్టూర్పులు వెడలఁజొచ్చెను. కన్నులనుండి యాణిముత్యాల సరమువలె బాష్ప బిందువు లవిచ్ఛిన్నముగాఁ గురియఁజొచ్చెను. రుక్మిణి యెంత ప్రయ త్నించినను బొంగి పొరలివచ్చు దుఃఖము నాపికొనలేకపోయెను. పెద్దపెట్టున విలాపధ్వని లేతెంచెను. అది విని రామావధాని, వీధి యరుగుపై నాఁడు వచ్చిన బ్రాహ్మణులతోఁ మాటాడుచున్నవాఁ డొక్కపెట్టున ద్రుళ్ళిపడి చటాలున గూ పొందిన శోకదేవతవలె నేలఁ బడియున్న కుమారినిఁ జూచి "అమ్మాయీ! ఏడ్చెద వేలా? ఏమి ప్రమాదము సంభవించెను? చెప్పు చెప్పు" మని మాత్రముతోఁ నడు గుచు, నడుగుచున్న కొలఁదిని రోదనధ్వనులు హెచ్చుచుండుటయే కాని తత్కారణము తెలుపమిచేఁ గుంచుచే నామె శయ్యాతలముపైఁ బడిన యుత్తరమును దీసి యిట్లు చదువుకొన నారంభించెను—

"రుక్మిణీ! నీ సుగుణములు, సుస్వభావము, సౌందర్య విలాసములు, నా స్వాంతమును రంజింపఁజేసినవి. ఆ పయి నీ విద్యా పాటవము, మృదుమధుర చమత్కారవచనములు నన్నుఁ బూర్తిగా వశము గావించుకొన్నవి. తోడనే నాహృదయపీఠమున సంపూర్ణ విలాసము లతోఁ గూర్చుండెటివి. నేనిచ్చటికి వచ్చి రమారమి రెండు వత్సరములు కావచ్చినవి. అయినను నాఁడు మదీయహృదయ పీఠికయందు నెట్టి

విలాసముతోఁ గూర్చుంటివో యిప్పటివఱకు నదేవిధముగా నుంటివి. హృదయాసీనమగు నీ భావనారూప మెల్లప్పుడు నాచెంత నుండుట చేతనే ననపాయుఁడనై నను నట్లనుకొనలేదు. నీలావణ్యమయరూపము నాముందు సర్వదా ప్రకాశించుటచేతనే సర్వదా నా సన్నిధియందు వర్తించు నాంగ్ల యువతీ శంపాలతలు నా కన్నులకు మిఱుమిట్లు గొలుపలేదు. అది యట్లుండనిమ్ము.

ప్రకృతిలోఁ బరివర్తించుట ప్రాణి సామాన్యము. కామవశులయి యతి చంచలులగుట సర్వసాధారణము. ప్రాణిమాత్రవగు నీవి ట్లిధర్మ ప్రవృత్తి గలదానవగుటలో వింతలేదు. ఆవిషయమై నిన్ను నిందింపలేదు. కాని నన్నింతకాలము నమ్మించి, నా హృదయమున ప్రవేశించి, తుద కిట్లు చేసి నాకు ఘోరాపవాదము తెచ్చిపెట్టినందులకు మాత్రము నిందించుచున్నాను. ఆ యపవాద తొలఁగిపోవుట కవకాశములేదు. ఒకవేళ నీవో నేనో మరణించిన నదిపోవునేమో, అట్లునుగాదు. భూమిపై మనపేరులున్నంతకాలము నది యుండవలసిన దే. ఇఁక మన మొకరి నొకరు విడిచి వర్తించినను నీవలన నాకు సంభవించిన యాపద పోదు. అప్పుడును నీపేరితో నాపేరో, నాతండ్రి పేరో, నావంశము పేరో కలిసియుండవలసినదే. ఆవిషయమై తీఱని దుఃఖ మనుభవించుటతప్ప మార్గాంతరము లేదు.

నీ హృదయ కంజాతమున దుష్ట మధుకరము ప్రవేశించినది. దానిని బోదోలుట యెట్టివానికినినశక్యము, భిన్నహృదయవగు నిన్నుఁ జెంత నుంచుకొనుట మహా ప్రమాదము. కావున నిఁక నీవు దూర పరిహర్తవ్యవు కావలసినదే. ఇప్పు డట్లు చేసితిని. నా హృదయపీఠము నుండి దూరముగా నిష్కాసిత వయినావు. ఇఁక నీకును నాకును నెట్టి సంబంధమును లేదు.

ఇఁక నీవు తప్పు చేయలేదని తప్పించుకొన నెంతువేమో! అది నీ

శక్యముగాదు. మొన్న మొన్న నీవు వ్రాసిన యుత్తరమే యీసందేహము నకుఁ దగిన కారణ మగుచున్నది. నా యీ ప్రజలుగూడ నన్నుఁ బరామర్శించుచు నీ విషయము వ్రాసియున్నారు. ఇఁక సందేహింప వలసిన పనిలేదు.

కొంతకాలము మనము మిత్రులమై యున్నాము. కావున నొక విషయము చెప్పుచున్నాను. ఇదివఱలో నా హృదయావకాశము నంతను నీ వాక్రమించుటచే మఱి యితరులకుఁ దావు దొరకలేదు. అచ్చరలవంటి యాంగ్లకాంతలను జూచియుఁ జేయునది లేక పరితపించుచుండెడివాఁడను. ఇఁక నా భయము పోయినది. ఆ నాహృదయ పీఠమునఁ జంద్రికాధవళమూర్తి యగు నొక సుకుమారి తనంతటఁ దా వచ్చి యలంకరించి సౌఖ్యానందలీలల సమకూర్చుచున్నది. ఈ శుభవార్త మిత్రులకుఁ దెలుపకుండుట యధర్మము కదా! ఇవే నా కడపటిమాటలు......"

ఈ యంశములు చదువఁగానే రామావధాని మనస్సు గళుక్కు మనెను. మిథ్యాభూతమగు నపవాదము చిరకాలము నిలువనేరదు కాన సత్యము బయటఁబడక మానదనియు దానితోఁ దనకును, దన పుత్త్రికకును సంభవించిన యాపద తొలఁగిపోవుననియు మొదట రామావధాని యనుకొనెను. కాని యిందువలన నతని యాశాంకూరము మొదలంట మాడిపోయెను. అతఁడు విశేష దుఃఖభరితుఁడై యున్న సమయము రుక్మిణి పత్రికావృత్తాంతమును మాటిమాటికిఁ దలంచుచుఁ, దండ్రితో "జనకా! కేవలము మిథ్యాభూతమగు నపవాద మెంత పనిచేసినది! ఎంత దూరము వ్యాపించినది! నేను కేవలము నిష్కల్మష ప్రవర్తన గలదాన నన్న విశ్వాసము పూర్తిగ గలదు. అందుచే నాకుఁ గొంత యూరట యున్నది. ఏమైనను లోక

మున నెట్లు నమ్మింపఁగలను? ఇపు డేమి చేయుదును? ఇది స్వయం
కృతాపరాధము. యువకుఁ డతనితో నంత చనవుతో మాటాడుట
యపరాధమే. లోకులు కాకులువంటివారు. ఎవ్వరికిఁ దోచినట్లు వా
రందురు. వారి కట్టి యవకాశము గల్గకుండఁ బ్రవర్తింపవలయును.
నా ప్రాణవల్లభుని మిత్రుఁ డనియు, బంధువనియు మాటాడితిని. ఇంత
మాత్రముననే యింత ప్రమాదము వచ్చునని నా కెట్లు తెలియును?
స్వయంకృతాపరాధదుఃఖమున కనుభవము తప్పఁ బరిహారక లేదు
గాఁబోలును. ఇఁక నా పతి సందర్శనమైనను నాకు లభింపదు కాఁ
బోలును. నా పతి యనాలోచితముగా నింత పని చేయునని యెఱుంగ
నైతిని. నాయనా! నా యిహలోకజీవితచరిత్ర నాటకమున
కిది భరతవాక్యమే కాబోలు" నని దుఃఖింపఁ జొచ్చెను.
రామావధాని రుక్మిణి నోదార్చి "అమ్మాయీ! ఇందు నీ లోప
మేమియును లేదు. నీవు నీ బంధువుతో మాటాడుట నింద్యమా?
అది యెప్పుడును గాదు. దురాత్ములు పాపమునకు వెఱవక యెట్టి
నీచకార్యముల నైనను నాచరింతురు. ఎట్టి యపవాదము నైనను
వ్యాపింపఁ జేయుదురు. వారట్లు చేయుటకు బీజ మక్కఱలేదు. అం
దుచే నీవు రామారావుతో మాటాడకపోయినను నీ యపవాద మా
దురాత్ములు కల్పింపఁగలరు. నీ మూలమున నాకు దుఃఖము కల్గింప
వలయునని యా నీచాత్ముల తలంపు. అట్లే చేసిరి. కానిమ్ము. మిథ్యా
భూతమగు నిది యెంత కాల ముండఁగలదు? అపవాదము తొలఁగి
పోక మానదు. అయినను నొక్క విషయము దుఃఖింపవలసి యున్నది.
అపవాద మసత్యమైనను సత్యఫలము గల్గించి మనకు శాశ్వతాప
కార మొనర్చిరి. మన శత్రువులు తమ కోర్కె నెఱవేర్చుకొన్నారు.
అగుఁ గాక! అంతమాత్రమున నిరాశపడకుము. సర్వవిధములఁ
బ్రయత్నించి మన పగవారి నడగించి, యపవాదమును నశింపఁజేసి,

నీకు సౌఖ్యము గూర్చెదను. తల్లీ నీవు దుఃఖింపక యెప్పటివిధమున నుండు" మని యోదార్చెను.

౬

భద్రకుఁ బెండ్లియై రెండేండ్లు గతించెను. ఆమె యుక్తవయస్కురాలై ప్రస్తుత మత్తవారియింటనే యుండెను. శ్రీనివాసము భద్ర వివాహకాలమున వరశుల్కముగా నిచ్చెదనన్న ధన మింకను నియ్య లేదు. ఆ యప్పుపత్ర మట్లే యున్నది. ఆ ధన మంతయు నిచ్చునంత వఱకును గోడలిని దీసికొని రావలదని శ్యామసుందరుని భార్య నొక్కి వక్కాణించెను. కాని యట్లొనర్ప వీలులేకపోయెను. ఆ సమయమున శ్యామసుందరుని చిక్కు వ్యవహారములు కొన్ని శ్రీనివాసమునకుఁ జేచిక్కి యుండెను. తా నొకవేళఁ గోడలిని దీసికొని రాక చిక్కులు పెట్టినచో నా కోపమున శ్రీనివాసము తన వ్యవహారము లన్నియు ధ్వంసము చేయునేమో యని భయము. అందుచే భార్య వలదని మూల్గుచున్నను శ్యామసుందరుఁడు కోడలిని దీసికొని వచ్చెను. అప్పుడే కమల తన సోదరితోఁ గూడ నగ్రహారము వచ్చి కొన్నిదినము లుండెను. అప్పుడే యామెకు భర్తృసమాగమభాగ్యము లభించెను. అనంతర మామె కొన్నిదినము లుండి తన పుట్టింటికి వెడలి పోయెను.

తన తోఁబుట్టువగు కమల వెడలిపోయిన కొన్ని దినములవఱకును భద్ర విమనస్కయై వర్తించెను కాని, క్రమముగా దిటవుదేఱి భర్తకును, నత్తమామలకును బరిచర్యలు చేయ నారంభించెను. భద్ర వయస్సునఁ జిన్నదయ్యును మిక్కిలి వివేకవతి. విద్యావతి. సుగుణవతి.

ఎదుటివారి మనస్సును గనిపెట్టి ప్రవర్తించు నింగితజ్ఞురాలు. ఈమె విశాఖ పట్టణములో నున్న బాలికాపాఠశాలయం దయిదవ తరగతివఱకును జదివినది. ఈ సుగుణము లన్నింటికిని దోడామెకు సహజసౌందర్యము కూడఁ గలదు. నిష్పక్షపాతముగాఁ జెప్పవలసినచోఁ గమలకంటెను భద్ర సౌందర్యరాశియని చెప్పవలయును. వీరి సద్గుణములు పరిశీలింప దుర్గుణరాశియగు శ్రీనివాసమునకు వీరు కుమారికలా యన్న సంశయము పొడమక మానదు. మఱియు భద్ర లేఁబ్రాయపు కాంతయైనను, మిక్కిలి లోకజ్ఞానము గలది. భవిష్యదాలోచనము గలది. కావుననే భద్ర తన తండ్రి విశ్వప్రయత్నములు చేసి కుదిర్చిన యీ సంబంధమం దిష్టము లేక వర్తించినది. తన స్వామిగారు ధనవంతులైనను లుబ్ధులగుటచే నుంతేనియు సుఖ మలవడదని యామె యెఱుఁగును. అయినను మూర్ఖుఁడగు తండ్రి యాజ్ఞ నతిక్రమింపలేక యందుల కంగీకరించినది. మఱియుఁ దన యత్తింటివారు లుబ్ధులగుటయే కాదు. ఆ సంసంధమునందు మఱియొక లోపము గూడ నున్నది. వరుఁడు స్ఫురద్రూపి కాఁడు, చాలినంత విద్యాబుద్ధులు లేనివాఁడు. బుద్ధి సామాన్యమైనది. విద్య యేమియు పూర్తిగ నబ్బలేదు. దండయాత్రలతో విసు వెత్తి యతఁడు చదువు విరమించెను. ఆతని విద్యావిరామమునకు విసువే కారణము కాదు. శ్యామసుందరుని లోభగుణము గూడ నొక కారణమని చెప్పక తీఱదు. వరుఁ డెట్టివాఁడైనను ధనవంతుఁ డగుటచే నట్టివాని గృహమున నున్నచోఁ దన పిల్ల మిక్కిలి సుఖించునని శ్రీనివాసరావు నుద్దేశము. అంతియకాని మానవు లెంతటి ధనవంతులైనను, లుబ్ధులయినచో నట్టివారికిని సౌఖ్యమునకు బహు దూరమని యతఁ డెఱుఁగఁడు. ఇట్లయినను భద్ర వివాహమైన పిమ్మట వరుఁడు తగినవాఁడు కాఁడు కాఁడని లోకులు తన్ను నిరుత్సాహపఱిచినను సరకుగొనక యతఁడే తనకు

దైవప్రాప్తుఁడగు భర్త యని నమ్మి నిశ్చింతతో భర్తతోఁ గాపురము చేయుచుండెను.

భద్ర యత్తింటికివచ్చి యొకసంవత్సరము కావచ్చెను. ఆమె తన పనులందు లోపమింతేనియుఁ గల్గనీక నేర్పులతో వర్తించి తనభర్తను నత్తమామలను, దేవతలనుగాఁ జూచి సేవించుచుండెను. కొన్ని దినములలోనే భర్త యనుగ్రహమును బూర్ణముగా సంపాదించెను. ఒక్క గడియకాలమైనను భార్యను విడిచియుండ లేనంత ప్రేమగలవాఁడయ్యెను. ఇంతియకాక తీరికయగు నప్పుడెల్లను భార్యయగు భద్ర పత్రికలనో, యుద్గ్రంథములనో చదివి వినిపించుచుండుటచేఁ గ్రమముగా నతఁడును బఠనమున కుతూహలుఁడై వర్తింపఁజొచ్చెను. వీరి దాంపత్యప్రేమము క్రమముగా నభివర్ధిల్లుచుండఁ జూచి యానందించుటకు మాఱుగా నావృద్ధదంపతులు సహింప లేకపోయిరి. అందు శ్యామసుందరున కెంతయసహనము గలదో చెప్పలేముగాని, యతని భార్యయగు సుబ్బమ్మ దుర్గుణము మాత్రము మాటలందును, బనులందును, స్పష్టమగుచునే యుండెను. భద్ర పట్టణములోఁ బుట్టిపెరిగిన దగుటచే యుదయముననే కంఠస్నానముచేసి శుభ్రవస్త్రములను ధరించి తలదువ్వుకొని యున్నంతవఱ కలంకరించికొని వర్తించుట కలవాటుపడినది. కావున నట్లుచేయుచుండెను. ఆమె పరిశుభ్రత కానందించుటకు మాఱుగా సుబ్బమ్మ "చాలు. చాలు. ఇదేమిటమ్మా యీ వింత! తెల్లవారకుండ స్నానమేమి? ఈ నాడు పండుగా, పబ్బమా! అంతటి తెల్లని చీరకట్టుకొననేల? పెండ్లావడుగా ప్రతిదినము నీ శృంగార మెందులకు?" అని యీ విధముగా భద్రకు వినబడునట్లు మాటాడి కోపము వెల్లడించు చుండెడిది. భద్ర వినియు వినుపించుకొనని విధమున నటించుచు నామె యవివేకమునకు ముసిముసినవ్వు నవ్వుచు దినములు పుచ్చుచుండెను. ఆమె యట్లు వర్తించుట

భర్తకిష్టమగుటచే సుబ్బమ్మ కోడలిని నంతకంటె నెక్కువగా నిర్బంధింప
లేకపోయెను. అయిన నామె యూరకుండక యొకనాఁడు భర్తతో
"మనవాఁడు వట్టి బుద్ధిహీనుఁడు. కోడలు సామాన్యురాలు కాదు. ఒక్క
వత్సరములోనే యది భర్తను వశము గావించుకొన్నది. వారిరువు
రును మిక్కిలి ప్రేమతో వర్తించుచున్నవారు. అది నాకును సంతో
షమే కాని యిందొక పెద్ద చిక్కున్నది. మనపిల్లని కిచ్చెదనన్న కట్న
ము నాలుగువేలకును శ్రీనివాసము మనకు యప్పు పత్రమును వ్రాసి
యిచ్చినాఁడు. ఇప్పటికి మూఁడవయేఁడు గతించుచున్నను నతఁడే
మియు నియ్యలేదు. అది యిచ్చినఁగాని కోడలిని దీసికొని రావలదని
యెన్నో విధములఁ బోరి చెప్పితిని. మీరు విన్నారు కారు. కోడలిని
దెచ్చి యింటఁ బెట్టుకొన్నాము. ఇఁక వియ్యంకుఁడు బొత్తుగానే మా
టాడఁడు. కట్నమిచ్చినఁగాని పిల్లను మేముదీసికొని వెళ్లమని కచ్చి
తముగాఁ జెప్పినచో శ్రీనివాసము చచ్చినట్లు కట్నమిచ్చి తీఱును.
అట్లు చేసినారు కారు. ఇప్పట్టున మనము బిఱ్ఱబిగిసికొని కూ
ర్చుండినచో మా వ్యవహారముల కేదో నష్టము వచ్చునంటిరి.
అవి యన్నియుఁ బరిష్కారమైనవి. ఇప్పుడతనిని మనమడుగవచ్చును
గదా? ఇంకను మీ రాలస్యము చేసినచో మనము చిక్కులపాలగు
దుము. మఱికొంత కాలమూరకున్నచో మన కుమారునది పూర్తి
గా లోఁబఱుచుకొని తనతండ్రితో నేకీభవించి నాకుఁ గట్నమక్కఱ
లేదని యన్నచో మనమింక గడ్డిపోచంతయైనను జేయలేము. మన
కతనివలన రావలసిన నాలుగువేలలో నెఱ్ఱని యేగానియైనను రాదు.
కావున మీరు త్వరపడి మనకొడుకునకును గోడలికిని బ్రేమానుబం
ధము హెచ్చిపోక మునుపే యిది తెగటార్పవలెను. ఒకవేళ నతఁడు
మనకీయవలసిన దీయకుండిన నతని పిల్లను నతనియింటికిఁ బంపివేసి
మార్గాంతర మాలోచించుకొనవచ్చును. మనవానికి దానిపైఁ బ్రేమ

హెచ్చినచో మనవాఁడు మనకు ప్రతికూలుఁడగును. దానివలన మన
కుఁబెద్ద నష్టము వచ్చు"నని పలుమారు చెప్పదొడఁగెను. అది విని
శ్యామసుందరుఁడు శ్రీనివాసమును రమ్మని వార్తలు పంపుచుండెను.
కాని యతఁడు వానిని సరకు గొనలేదు. ఒక వ్యవహారము తీర్చుకొన
శ్రీనివాసరావు రామయ్యగ్రహారము రాక తీఱినది కాదు. అతఁడు
శ్యామసుందరుని యింటనే విడిసెను. శ్యామసుందరుఁడును గొడు
కును నతని కుచితమర్యాదలు సలిపిరి. ఊరిలోని మిత్రులందఱును
వచ్చి సముచిత సల్లాపము లాడుచు రామావధానికి సంభవించిన
స్వల్పాపదలను గొండంతలుగాఁజేసి చెప్పి యతనిని సంతసింపఁజేయు
చుండిరి.

ఒకనాఁడు శ్రీనివాసరావు భుజించి వెడలిపోవుటకు యత్నించు
చుండఁగా శ్యామసుందరుఁడు సమీపించి కూర్చుండి, కొంచెము సేపి
దియో సంభాషించి తుదకిట్లు ప్రసంగించెను.

శ్యా—బావగారూ - మీ యల్లుని కట్నము విషయమై
పూర్తిగా నుపేక్షచేసినారు.

శ్రీ—(నవ్వుచు) భావగారు- వరునికిఁ గన్యకారత్నము కంటె
వేఱొక గొప్పకట్నమేమి ?

శ్యా—[నవ్వుచు] బావగారు పరిహాసమాడుచున్నారా? మన
మూరకున్నను గాలమూరకుండదు. అది పర్వెత్తుచునే యుండును.
మూఁడవయేఁడు కావచ్చినది అప్పుపత్రము కాలదోషము పట్టు
చున్నది.

శ్రీ—తీఱిపోయిన పత్రమునకు గాలదోషమేమిటికి ? చెల్లు
పెట్టి నాకిచ్చివేయుఁడు.

శ్యా—[ఆశ్చర్యముతో] ఆఁ—ఏమన్నారు. అప్పుతీఱిన దను
చున్నారా ? బాగు. బాగు.

శ్రీ—బావగారు. దీని కాశ్చర్యపడుచున్నారా ? అప్పు పూర్తిగాఁదీరినది. ఆవిషయమై లెక్కవేసి యుంచితిని. మీరొకమారు దీనిని పరిశీలించినచోఁ దెలియఁగల" దని చిన్నపుస్తక మొకటి వియ్యంకున కిచ్చెను.

శ్యామసుందరుఁడు "ఇది మిక్కిలి విచిత్రముగానున్న దే" యని, యాపుస్తకము తీసికొని పుటలు తిరుగవేసి చూడఁజొచ్చెను. ఈ రెండు మూఁడు వత్సరములనుండియుఁ దనకు వకీలుగాఁబని చేసినందుల కియ్యవలసిన వేతనమంతయు వ్రాయఁబడినది. అంతేకాక చోడవరము యలమంచిలి, అనకాపల్లి, విజయనగరము మొదలగుచోట్లకుఁ దనపనిపై వెళ్ళినందులకు మార్గవ్యయము భోజనవ్యయము చేర్పఁబడినవి. ఆమొత్తమంతయు నాలుగువేలకు సరిపడియుండెను. శ్యామసుందరుఁడు చదివి కోపము పెచ్చుపెరిగి వచ్చుచున్నను నెట్లో శమింపఁజేసికొని, శ్రీనివాసముతో, "భావగారూ! మంచిమొత్తే మొత్తినారు. ఇదంతయు నాదావాలకయిన సొమ్మేయందురా ? " అని యడిగెను.

శ్రీ—కాక మఱేమి ?

శ్యా—ఆఁ, ఏమీ ? ఈయగ్రహారస్థుల దావాలకు, తననాలకు నేనా కారకుఁడను ?

శ్రీ—అని నేనన్నానా ?

శ్యా—దాని యర్థమదియే కాదా ! మీరు మీరు అగ్రహారస్థులు. సాయముచేసికొందురో మానుదురో ఎవ్వరికిఁ గావలెను. వారి నిమిత్తమైన సొమ్ము నన్నిచ్చుకొనుమనుట న్యాయమా ?

శ్రీ—భావగారూ ? అవియన్నియు నిప్పు డనుకొన్న లాభము లేదు. నావారైనను బైవారయినను నాకొక్కటియే. మీకీ యగ్రహారస్థు లెట్టివారో నాకునట్టివారే. మీ చేవ్రాలుతోనున్న యుత్తరములన్నియు నాయొద్దనున్నవి. మీరుత్తరము వ్రాయకున్న నేను

వారికి సాయముచేయనే చేయను. మీరు ధనవంతులనియు, మీరు వారికి సాయము చేయుచున్నారనియు భావించితిని. ఆసొమ్మునకు వెంటనే మీపేర వ్రాసియుందును. కాని బోలెడుసొమ్ము మీకియ్యవలసియుండగా మిమ్ము సొమ్మడుగుట బాగుండదని యూరకుంటిని.

శ్యా—చాలు. చాలు. బాగామోసముచేసినారు. అట్లు వలనుపడదు. నాసొమ్ము నాకుముందుగా నిచ్చివేయుఁడు. పిమ్మట మీ సొమ్ము రాఁబట్టుకొనుఁడు.

శ్రీ—అదెంతసేపు! ముందుగామీరు నాకీయవలసిన సొమ్మిచ్చినచో నిక్కడనే చెల్లింతును. నాకురావలసిసొమ్ము రానిదే నేను జెల్లుపెట్టఁగలనా?

శ్యా—(కోపముతో) మొండివాదము చేయకుఁడు. ఇంతకును గట్నము లరువేమిటి? మాదే పొరపాటు.

శ్రీ—బావగారూ! అట్లు నొచ్చుకొనకుఁడు, వకీళ్ల కిచ్చెడి సొమ్మమాత్ర మరువుపెట్టుట న్యాయమా?

శ్యా—మీరిట్లు సొమ్ము రాఁబట్టుకొందురని తెలిసినచో నేను త్తరము వ్రాయుదునా? ఈయగ్రహారస్థు లేమయిపోయిన నాకేమి?

శ్రీ—అయ్యో! బావగారూ! మీరు త్తరము వ్రాయకపోయిన నేను బనిచేయుదునా? ఈయగ్రహారస్థుల నమ్మకము నాకేమిటి?

శ్యా—ముందుగా సొమ్మువిషయమై నాకు త్తరము వ్రాయకపోవుట మీది పెద్దపొరపాటు.

శ్రీ—మీవంటి తగుమనుష్యునకు, బంధువునకు, నందులో నియ్యంకునకు, సొమ్మిమ్మని యేమనివ్రాయుదును? మీరు వెంట వెంటనే నాసొమ్ము నాకడుగకుండగనే పంపించకపోవుట మీదే పొరపాటు. మర్యాదకై నేనడుగుట మానివేసినప్పుడు మీరును మర్యాదకై సొమ్ము పంపింపవలసినది. అట్లు చేయకపోవుటచే నేను మీకీయవల

సిన సొమ్మునకు బదులుగా జమకట్టుకొనుచున్నారేమో యభావించితిని. ఇందు నాపొరపాటేమున్నది?

శ్యా—కట్నమిచ్చెదనని చెప్పి యిట్లు మసిపూసి మారేడుగాయ చేయుచున్నారు. ముందు ముందు మీకువచ్చు చిక్కుల నాలోచింపకున్నారు.

శ్రీ—చిక్కులకేమున్నది? సొమ్మునకై మీరు నాపైదావా తెచ్చెదరా? నేనును మీపయినట్లే చేసెదను. మీదినాపై తీర్పగును. నాదిమీపై దీర్పగును.

శ్యా—అంతియే యనుకొన్నారా! మీపిల్లవిషయమై యోచించుకొనుఁడు.

శ్రీ—యోజనకేమున్నది. అదియిఁక మాపిల్లగాదు. ఎప్పుడు మీకుమారున కిచ్చివేసితినో, ఎప్పుడు మీకోడలిని మీయింటికి కప్పగించితినో, యప్పుడే నాకునుదానికిని సంబంధము వదలిపోయినది. మీకోడలిని మీరేమిచేసికొన్న నాకేమి? భావగారూ! ఇఁక లేనిపోని గడబడ పడకుఁడు. మీపిల్ల మీయింటికి వచ్చినది. మీకీయవలసినసొమ్ము మీకుముట్టినది. ఇఁకనావిషయమై మీరేమిచేసినను లాభములేదు. అగ్రహారస్థుల విషయమై మీరంతసొమ్ము వ్యయముచేయుట మీకుఁ గష్టమనిపించినచో వారివలన రాఁబట్టుకొనుఁడు. ఇందు మోసమేమియునులేదు."

అని చెప్పి శ్రీనివాసము తాఁ దెచ్చిన లెక్కలపుస్తక మచ్చటనేవిడిచి, వీరుగట్టిగా సంఘర్షణము చేసికొనుచుండుటవిని చూడవచ్చిన సింగన్న మొదలగువారితో మాటాడుచు నిఁక బావగారియొద్ద సెలవయినను దీసికొనక విశాఖపురమునకు వెడలిపోయెను.

౧

సుదర్శనరావు తండ్రి శివరామరావు. అతఁడు ప్రభుత్వము నందుఁ జిరకాలము న్యాయాధికారిగాఁ బనిచేసి మిక్కిలి ధనమును గౌరవమును సంపాదించి, ప్రస్తుతమున నుపకారవేతనము పుచ్చుకొనుచు, రాజమహేంద్రవరమున దొరతనమువారి కళాశాలయందుఁ బనిచేయుచున్న తన రెండవకుమారుని చెంతనుండెను. అతనిసంతతిలోఁ బెద్దవాఁడే సుదర్శనరావు. అతఁడు చిన్నప్పటినుండియు గారాబముతోఁ బెరిగినవాఁడగుటచేతను, విద్యార్థిదశయందు నతనికిఁ జేతిలో ధనమాడుచుండుటచేతను, దుస్సహవాసమున కలవాటుపడి విద్యాభ్యాసమునందాసక్తిలేక వర్తింపసాగెను. జనకునికి భయపడి యతఁడు పాఠశాలకరుగుచున్నను, నుపాధ్యాయులచెంత నిర్భయుఁడై వర్తించుచుఁ దన తరగతిలోఁ గూర్చుండి చదువు నేర్చుకొనుటకు బదులుగాఁ దనస్నేహితులతో వెడలిపోయి యొకచెట్టుక్రిందఁ గూర్చుండి మాటిమాటికి సిగరెట్లు కాల్చుచు, సంతతము కందుకక్రీడావిషయములు ముచ్చటించుచుఁ గాలము పుచ్చుచుండెడివాఁడు. అతఁడు సరిగాఁ జదువకపోయినను నితని జనకునియందలి గౌరవమునుబట్టి యున్నతపాఠశాలాధికారి ప్రతిసంవత్సరమును బయితరగతికిఁ బంపించుచుండువాఁడు. అందుచే సుదర్శనరావునకు గర్వమేకాక, సోమరితనము కూడఁ గ్రమముగా హెచ్చసాగెను. అతఁడు ప్రథమపరీక్షకుఁ జదువనారంభించెను. కాని యిదివఱకుఁ జదువునకు విముఖుఁడై వర్తించుటచే, విద్యాధిదేవత కోపించి యతఁడిప్పు డభిముఖుఁడై వర్తించినను, దా నతనికి విముఖయై వర్తింపసాగెను. ఆకారణమున సుదర్శనరావునకుపాధ్యాయుఁడు చెప్పు

చున్న దంతయు నయోమయముగా నుండెను. విద్యాధిదేవత తనకు విముఖురాలైనను సుదర్శనుఁ డిప్పుడు తన తరగతి విడిచి బయటికేగక గొట్టగొన బల్లపై చాటుగా గూర్చుండి నిద్రాదేవతను బరమభక్తితోఁ సేవించి, తదీయానుగ్రహమును బూర్తిగా సంపాదించెను. అతఁ డట్లు వర్తించుటచే మొదటివత్సరము దొరతనమువారి పరీక్ష కరుగ నసమర్థుఁ డయ్యెను. విద్యయం దతఁడు రెండవయేఁడు గూడ వెనుకటివలెనే యున్నను, నతని తమ్ముఁడగు గోవిందరావును బరీక్షకుఁ బంపుచుండుటచే నున్నత పాఠశాలాధ్యక్షుఁడు శివరామారావు బలాత్కారమువలన సుదర్శనరావునుగూడ బరీక్షకుఁ బంపక తీఱినదికాదు. ఆవత్సరము గోవిందరావు పరీక్షయందు రెండవ తరగతిగా నుత్తీర్ణుఁడయ్యెను. సుదర్శనరావునకు భాషాపత్రములందు నూటికి నాల్గేసి యైదేసి గుణములు లభించినను, లెక్కలు మొదలగు శాస్త్రములందు నిండుసున్నలు మాత్రమే లభించినవి. ఈసమయము ననే యతనికి వివాహము జరిగినది. రామావధాని వరుని గుణముల నెఱిగినవాఁ డగుటచేఁ దన కూతుని కీయ నిష్టము లేనివాఁడయ్యెను న్యాయాధికారి కూతురగు తన భార్య ప్రోత్సాహముచే సుదర్శనున కిచ్చి పెండ్లిచేయక తీఱినదికాదు. ఆ సంవత్సరము వధూవరు లిద్దరును బ్రథమపరీక్ష కరిగిరి. ఆ వత్సరము భార్యయగు రుక్మిణి పరీక్షయందుఁ గృతార్థురాలగుటయు, సుదర్శనుఁ డపజయ మందుటయు సంభవించెను. అందుచే నికఁ బాఠశాలలోఁ జదువుట సుదర్శనున కేకాక తండ్రియగు శివరామరావునకుఁ గూడఁ గష్టమనిపించెను. కష్టమేకాదు, చిన్నతన మనిపించెను. సుదర్శనుఁడు రెండు సంవత్సరములు చదువు మానివేసెను. అతని భార్యయగు రుక్మిణి యికఁ జదువలేదు. ఆమె యుక్తవయస్కురాలై భర్తతోఁ గాపురము చేయసాగెను. సుదర్శనుఁ డింటనుండియే భార్యసాయమున శ్రద్ధతోఁ జదివి

యెట్లయిననేమి ప్రథమ పరీక్షయందుత్తీర్ణుఁడయ్యెను. శివరామరావు దానికానందించి యీదేశముననుంచి పట్టపరీక్షకుఁ జదివించినచో సుదర్శనుఁడు కృతార్థుఁడు కాలేఁడనియు ఇంగ్లండునకుఁ బంపించినచో సులభముగా న్యాయవాది పరీక్షయందుత్తీర్ణతచెంది రాఁగలఁడనియు నూహించి యట్లొనర్చెను. భర్తతో నరుగుటకు రుక్మిణికూడఁ బయనమయ్యెనుగాని శివరామరావు ధనలోభముచే నామెను వారించి, కొంతకాలము తనయింట నుంచుకొని పుట్టినింటి కంపివేసెను. ఆదంపతులట్లు పరస్పరమును దూరదేశగతులు గావలసివచ్చినను, దమచిత్తములం దనురాగము నభివర్ధించుకొనుచుఁ దఱచుగా నుత్తరములు వ్రాసికొనుచుఁ గాలము గడుపుచుండిరి.

ఈ సమయమునందే శ్రీనివాసరా వల్లుఁడగు రామారావుగూడ నిటఁ బట్టపరీక్షయందుత్తీర్ణుఁడై వైద్యశాస్త్ర మభ్యసించుటకై యింగ్లండునకు వెళ్ళుట సంభవించెను. సుదర్శనరామారావులు బంధువులగుటచేతను, సమవయస్కు లగుటచేతను విదేశమునందు మిక్కిలి మైత్రితో వర్తింపసాగిరి. వారుచదివెడివిద్యలు వేఱయినను, నివాసములు వేఱుచోటులందయినను బ్రతిదిన మేదోవిధమున నొకచోఁ గలిసికొని యిష్టగోష్ఠి సల్పిపోవుచుండుట కలదు. అట్లు కొంతకాలమరిగినపిమ్మట రామారావు విపన్నుఁడైన తండ్రినిజూడ నీదేశమునకు వచ్చుటయు, రుక్మిణితో సంవాద మొనర్చుటయు సంభవించెను. రామారావు మరల నింగ్లండున కరిగిన కొంతకాలమువఱకు మిత్రులిర్వురు నెప్పటివిధమున వర్తించిరి. కాని సింగన్న వ్రాయించిన యపవాదవార్త తెలిసినప్పటినుండియు, సుదర్శనరావు భార్యయందే కాక మిత్రునియందుఁగూడఁ గుపితుఁడై వర్తింపఁజొచ్చెను. రామారావు కొంతకాలమువఱకుఁ గోపకారణ మెఱుఁగక సుదర్శనుఁడు తన విడిదికి రాకున్నను దానే యతనియింటికరిగి, సరిగానతఁడు మాటాడక

పోయినను గొంతసేపటనుండి వచ్చుచుండెడివాఁడు. కాని తనభార్య వ్రాసిన యుత్తరమువలన సుదర్శనుని కోపకారణ మెఱింగి తనమూలమున యోగ్యురాలగు రుక్మిణికి సంభవించిన యాపదకు ఖిన్నుఁడై, యవివేకి యగునతని యింటికరుగ మానివేసెను. ఒకవేళఁ దానరిగి సుదర్శనునకుఁ దత్త్వమును బోధించినను నపవాదకుఁ దానే కారకుఁడగుటచే ననుమానియగు సుదర్శనుఁడు, తనవాక్యములను జెవినిబెట్టక పోవుటయేకాక, మీఁదు మిక్కిలి మఱింత విపరీతవర్తనుఁ డగునని యతఁడెఱుఁగును.

సుదర్శనరావు గృహమునకు సమీపమునందే కేమెలను దొరసాని యొకతె కాపురముండెను. పేరునకుఁ దగినట్టు లామె మెడపొడుగుగానుండి యందమునకుఁ గొంతకొఱంత గల్గించుచున్నను నామె విలాస చేష్టలకును సరసవచనచాతుర్యమునకును యువకులు భ్రమియకపోరు. ఆమె వయసిప్పుడు ముప్పదివత్సరములు. ఇరువదవయేట నామెయొకని వరించి యతనితోఁ గొంతకాలము కాపురముచేసి, తుదకతని నేవగించి విడాకులిచ్చి యతనితో సంబంధమును ద్రెంచుకొనెను. మఱికొంత కాలమున కామె సైన్యమునం దున్నతోద్యోగిగానుండిన యొకపురుషుని వరించి యతనివలన నొకకుమారునిఁగని బాలు నతని కిచ్చివేసి వానితో సంబంధము లేకుండఁజేసి వర్తించుచుండెను. ఈసమయము ననే కేమెలు సాయంసమయములందు విశ్రాంతిభూమి కరుగుటయు స్నేహితునితో మాటాడుచున్న సుదర్శనునిఁ గాంచుటయు, నొకప్పుడు వారితో సంభాషించుచుండుటయుఁ గలదు. రామారావుతో మైత్రిగల్గి నంతకాలము దొరసాని సుదర్శనుని పరిచయము సంపాదింపలేకపోయెను. కానియతఁ డేకాకియై వర్తించుచున్నప్పటినుండియు నామె సులభముగానె యతని వశపఱచుకొనఁగల్గెను. ఇప్పుడు సుదర్శనుఁడు సాయంసమయమున కేమెలుతోఁ గలిసి విశ్రాంతిభూమి కరు

గుట కలవాటుపడెను. క్రమముగా వారియనురాగము దృఢపడెను. అదివఱకే సుదర్శనుఁ డాంగ్లయువతుల సౌందర్యవిలాసములకుఁ జిక్కి వర్తించుచుండినను రామారావుయొక్క యుపదేశబలమునను రుక్మిణి యందలి ప్రేమాతిశయమునను దనచిత్తమును మరలించుకొనుచుండెడివాఁడు. కాని యిప్పు డానిర్బంధములు రెండును దొలఁగిపోవుటచే కేమెలు దొరసానిని భార్యగా స్వీకరించుట కవకాశముగల్గెను. వారట్లు కొంతకాలము గడపిరి. ఇంతలో సుదర్శనుని చదువు పూర్తియయ్యెను. ఇఁక స్వదేశమునకు రావలసియుండెను. కాని యతఁ డానూతనభార్యనువిడిచి యెట్లు రాఁగలఁడు? లేక యామెచెప్పినప్రకారము క్రైస్తవుఁడై ఇంగ్లండులోనుండి పోగలడా! ఈ ఆలోచనకుఁ జిక్కి సుదర్శనుడు తుదకామె నెట్లైనను తనతో హిందూదేశమునకుఁ దీసికొని రానిశ్చయించి, ఒకనాడామెతో నిట్లు సంభాషించెను.

సు—ప్రియా! నీవు నాతోవచ్చి మాహిందూదేశము నలంకరింప వేడుచున్నాను.

దొర—ఛీ; ఛీ; నరకకూపమువంటి మీ హిందు దేశమున కెంతమాత్రమును రాను.

సు—(నవ్వుచు) ఎంతమాటాడితివి! మా దేశమును నీవుచూడలేదుగనక నట్లంటివి. నిజముగామాహిందూదేశము భూతలస్వర్గమని తలంపుము.

దొర—స్వర్గమైనను సరే. మరేమైనను సరే. నే నచ్చటికి రాను. నాయందు నీ కనురాగమున్నచో నిచటనే నిలిచి పొమ్ము.

సు—నీయందు నాకపరిమితానురాగముండుటచేతనే విద్యాపూర్తియైనను, నిన్ను వదిలిపోలేక ఇట్లున్నాను. మన మిచ్చట నుండుట సంతోషమే కాని మనకుఁ దగినంత ధనసంపద లేదు. నాతండ్రి సొత్తంతయు నతని చేతిలోనేయున్నది. నేను క్రైస్థవుడైనట్లు తెలిసి

నచో నాతండ్రి ఇక నొక దమ్మిడీయైనను పంపడు. ఇక్కడ ధన మార్జింతమన్నను నూతనముగా న్యాయవాదినైన నన్ను జూచెడివా రెవరు? కావున నీవు వేరు విధముగా యోజింపక నాతో మాదేశ మునకు రమ్ము. నీ నివాసమున కింతకంటె మంచి సౌధమును సమ కూర్చెదను. నీ వడిగిన వస్తువులనెల్ల నిచ్చెదను. నీకు వీసమంతయైనను లోపము రానీయను. నిన్ను పువ్వులలో బెట్టుకొని యెల్లప్పుడును పోషింతును.

దొర—(ఆలోచించి) సరియే. నా చెప్పిన పద్ధతులన్నియు నంగీకరించినచో నీతో వచ్చెదను.

సు—(సంతోషముతో) అయ్యో! ఇందులకు సందేహించుచున్నావా? సంకోచింపకుము. చెప్పుము. నీకోరిన పద్ధతు లన్నియు నంగీకరించెదను.

దొర—మన నివాసమొక మహాపురమునం దుండవలయును.

సు—దానికేమి? తప్పక నట్లే చేయుదము. మా దేశమున సుప్రసిద్ధమైన చెన్నపురిలో నివసింతము.

దొ—మన నివసించెడి సౌధము మిక్కిలి సుందరమై యుండ వలయును.

సు—అట్లే చేయుదము.

దొ—నాకు వలయు దుస్తులు, భోజనము మొదలగునవి అన్నియు మా దేశమును సంబంధించినవే కావలయును.

సు—సరియే.

దొ—మన సౌధములో విద్యుద్దీపములు మొదలగునవి యుండవలయును సుమా!

సు—తప్పక నట్లే చేయుదము.

దొ—అన్నట్టు మరిచితిని. మనకొక మంచి మోటారుబండి

కావలయును.

సు—నీవు కోరిన బండిని ఇచ్చుటనే కోరెదము.

దొ—మీ హిందువులు స్త్రీలకు స్వేచ్ఛ నొసగరంట. నీవట్లు చేసిన నే నంగీకరింపను.

సు—నీవిషయమై నేనట్లెన్నడు నొనర్పను.

దొ—ఇన్నియు నున్నను నాకిష్టమున్నంతవరకే నీతో సంబంధము.

సు—అట్లే చేయుము. నీకిష్టము తప్పిపోవునట్లు నే నడచి నప్పుడు గదా! చూతము.

అని ఇట్లు సుదర్శనుఁ డామె కోరిన నియమముల కంగీకరించి యామెను వెంటబెట్టుకొని హిందూదేశమునకు వచ్చెను. అతడు ముందుగా చెన్నపురి ప్రవేశించి మైలాపురమునం దొక దివ్యమందిరమును విద్యుద్దీప ప్రభావిభాసితమైన దానిని నద్దెకు పుచ్చుకొని యందునివసించెను.

౨

రామారావు చదువరుల కపరిచితుఁడు కాఁడు. అతఁడు విద్యాబుద్ధులందున, వినయాది సుగుణసంపదలందును సుదర్శనుని కంటెఁ బెక్కుమడుగులుమిన్నయని చెప్పవలసియున్నది. అతఁడు విదేశమునం దేకాకిగా నుండినను, సౌందర్యవిలాసమహితలగు నాంగ్లయువతులను సర్వదా చూచుచు, సంభాషించుచు వర్తించుచున్నను, మనశ్చాంచల్యమునకుఁ దావొసంగలేదు. వైద్యపరీక్షయందుఁ గూడ నతఁడు మొదటి తరగతిలోఁ గృతార్థుఁ డయ్యెను. సుదర్శనుఁడు

హిందూదేశమునకువచ్చినకొలఁది దినములకే యతఁడుకూడవచ్చెను. అతఁడు తిన్నగా స్వగ్రామమునకు వచ్చి తండ్రిగారితోఁ గలిసి వర్తించుచుండెను. ఇంతటఁ బినతల్లి కూడ నతనినిఁ జూడ వచ్చెను. అతఁడు విదేశములందు వసించి యున్నతవిద్య నభ్యసించినను, దన ముసలితండ్రియందును- బూర్వాచారపరాయణయగు పినతల్లియందును నమిత భక్తి గలవాఁడై వారల మాట జవదాటక వర్తిల్లుచుండెను. ఇట్లు రెండుమూఁడు మాసము లరుగునప్పటికిఁ జెన్నపురి వైద్యశాలలో సహాయ వైద్యుఁడుగాఁ బనిచేయవలయుననియు, నెలకు నాలుగువందలు జీతమనియు దొరతనమువారి నుండి రామరావున కొక యాజ్ఞాపత్రమువచ్చెను. అతఁ డాశుభవార్తను దన జనకునకును బినతల్లికిని దెలియపఱిచి తనతోఁ గూడ వారిని జెన్నపురికిఁ బ్రయాణముచేసెను. అతఁడు తన భార్యను గొనివచ్చుటకుఁ దండ్రిగాని పినతల్లిగాని తనతోఁ బ్రసంగింతురేమో యని భావించెను గాని, వార లాప్రసంగము నొకమారైనను నెత్తలేదు. ఈ ప్రయాణ సమయమం దయినను వార లీయంశమును గూర్చి మాటాడలేదు. కాని తండ్రి యొకనాఁడు భోజనసమయమునందుఁ గుమారునితో నిట్లు సంభాషించెను. పినతల్లి సమీపమునందే కూర్చుండెను.

జన—నాయనా! దైవానుగ్రహమువలన నీవిద్య పూర్తియైనది. నీవిఁక నొకయింటివాఁడవై వర్తించినఁ జూచి యానందింపవలయునని చూచుచున్నాను. ఈపాటికే నీకు సకలసదుపచారములను జేయుచు నిన్ననుసరింపవలసిన యువతి నీకుండవలసినది. అట్లాలోచించియే మొదట నీకు వివాహమొనర్చితిని. కాని దైవదుర్విపాకము వలననది మనకుఁ బ్రతికూలమైనది.

రామరావు మాటలాడకుండ భుజించుచుండెను.

పినతల్లి—బావా! అందులకు మనము విచారింపవలసిన పని

లేదు. ఏమో యట్టి నీచసంబంధమనియు, నంత గతిమాలిన సంబంధమనియు, మన మే మెఱుఁగుదుము? ఇప్పుడైన నేమి పదునాలుగేండ్ల పిల్లలు చక్కనివా రెందఱో యున్నారు. ఉఁ' అన్నం జాలును. వేలకొలఁది కట్నములతోఁ బిల్లను గొనివచ్చి యబ్బాయి యడుగులపైఁ బడవేయుదురు. బాగుగా నాలోచించి యేదో యొక పిల్లను జేసికొనుట మంచిది. అబ్బాయీ! పదిరోజులు సెలవుపెట్టి నీ కనుకూలయగు పిల్లను బెండ్లియాడుము. దానిని మనతోఁ గూడఁ జెన్నపురికిఁ దీసికొని పోదము.

జన—అబ్బాయీ! మీపిన్ని చెప్పినది వాస్తవము. అయినాల వారి పిల్ల మిక్కిలి యందకత్తె. చదువుకొన్నది. పదునాల్గవయేఁడు. ఇన్నింటి మాట కేమి? నాల్గువేలు కట్నము గూడ నిచ్చెదమనుచున్నారు.

పిన—బావా! నీవు చెప్పినది సర్వము సత్యమే, కాని యంతకంటె ముదుకూరివారి సంబంధము మిక్కిలి మంచిది. అయినాల వా రిప్పటి కయిదాఱు కార్యములుచేసి కట్నము లిచ్చినారు. అంతతోనే వారి కాళ్ళు పీకినవి. అంత కట్నమెక్కడ-వా రెక్కడ-ఇచ్చు టెక్కడ- నేఁ జెప్పినవారు మిక్కిలి ధనవంతులు పిల్లతొలిచూలుది. కార్యము ఘనముగాఁ జేయుదురు. కోరినంత కట్నమిచ్చెదరు.

జన—శ్రీనివాసరావు వర్తనముజూచి నీవట్లనుకొనుచున్నావు. శ్రీనివాస మంతనిర్భాగ్యుఁడు లోకమునందు మఱియొకఁ డుండఁడు. అందఱు నట్టివారే యుందురా? అయినాలవారు పరువు మర్యాదయు గలవారు.

పిన—కావచ్చును. అయినను నాలోచించిచేయుట మంచిది. అవును. నీవుచెప్పినట్లు శ్రీనివాసమువంటివారు మఱియుండరు. అబ్బ!

ఈనడుమ జూచితిని. అతనికెంత కండకావర మనుకొన్నావు: అతనిని మించినవారు కూతురులు. అయ్యో! చెప్పమఱతిని. శ్యామసుందరునికోడలు భద్రతో మనకోడలుకూడవచ్చినది. నేనేదోపనికై వారింటికి వెళ్ళినాను. కమల కనఁబడి మొగము చిట్లించుకొని లోపలికరిగినది. ఆటెక్కు, ఆవైయ్యారము, ఆచమత్కారము నేమనిచెప్పుదును? అట్టిది సానివాండ్రలో నుండవలెనుగాని సంసారులలో నుండదు. అది కోడలని చెప్పుకొనుటకు నాకు సిగ్గయినది.

జన—ఇఁకనేమున్నది? శ్రీనివాసము పెంకెతనమంతయు నణఁగినది. రామావధాని యతనిజుట్టుపట్టి జాడించుచున్నాఁడు. ఇదియిట్లుండఁగా శ్యామసుందరరావుకూడ శుల్కము విషయమై యతనిపై దావా తెచ్చుటకు సిద్ధముగానున్నాఁడు.

పిన్న—అంతయెందుకు? శ్యామసుందరుని భార్య నాతో జెప్పినది. శ్రీనివాసము కూతు నతనియింటికిఁ బంపివేసి కొడుకునకు మఱియొక పెండ్లి చేయునట.

జన—మానుదురా! అట్టినీచసంబంధమున కెవ్వరంగీకరింతురు.

వీరిట్లు మాటాడుచుండ రామారావేమియు బలుకక ముఖమెత్తక భోజనము జేయుచునే యుండెను.

పిన—అబ్బాయీ! నీవేమియు మాటాడవేమి? మాచెప్పిన సంబంధములలోనీకేదియిష్టమో చెప్పితివా, వెంటనే కార్యమగును. పిల్లలను జూడవలెనంటివా, రేపటి సాయంకాలముపోయి చూచి వత్తమురమ్ము.

రామా—ఏమమ్మా? వంకాయకూర యింతకసరుగానున్నది. ఏదీ! చింతకాయపచ్చడి కొంచెము వేయుము.

పిన్నమ్మ అట్లుచేసి కూర్చుండును.

జన—అబ్బాయీ! మీపిన్ని యడిగినదానికి సమాధానము చెప్పవేమి?

రామా—(వినియు విని వించుకొనని విధమున నటించుచు) పచ్చడిలో పచ్చిమిరపకాయలు మఱికొంచెము పడిన మిక్కిలి బాగుండును. ఇట్టి పచ్చడి నిన్నాళ్ళకుఁ దింటినమ్మా!

పిన్న—అవును. నాయనా! విదేశములలో నీకిట్టివి యెట్లు లభించును. రేపు మఱిరెండు మిరపకాయలువేసి మరల రుబ్బుదును లెమ్మా.

జన—అబ్బాయీ! మీపిన్ని మాటలు నీకు వినఁబడలేదా!

రా—ఆఁ, ఏమీ? ఏమాటలు?

జ—నీ వివాహమును గూర్చిన-

రా—వివాహమున కిప్పుడు తొందరయేమి?

జ—ఇంకను తొందర యేమని యనుచున్నావా?

రా—అవును.

జ—చాలు. చాలు. ఆమాటలుకట్టిపెట్టి వివాహముచేసికొమ్ము.

రా—నాకు వివాహ మాడవలెనని లేదు.

జ—ఏమీ! ఎందుచేత? అందఱును శ్రీనివాసము వంటి వారే యుందురా?

పిన్న—అయ్యో! అట్లు వలనుపడదు. నీవు వివాహమాడనిచో నన్నుఁ జంపుకొని తిన్నట్టే!

రా—ఇదివఱకొక పెండ్లియైనది. మరల నిప్పుడు మఱొక వివాహమా! ఎందఱు భార్యలను స్వీకరించుట. వీరి నందఱను బోషింపవలదా?

పిన్న—భార్య లెందఱున్నారు? ఇదివఱకున్న భార్యను విడిచిపెట్టుచున్నాము కాదా?

రా—మనము విడిచిపెట్టుదుము. కాని యది మనలను విడువవలదా?

పిన్న—ఎందులకువిడువవలదు? మనగుమ్మము త్రొక్కనీయవలదు.

రా—అయ్యో! తల్లీ! అట్లందువేమి? హైందవ దాంపత్య సంబంధము పొమ్మన్నంత మాత్రమునఁ బోవునది కాదు. దానిని మనగుమ్మము త్రొక్కకుండఁ జేయఁగలము గాని పోషింపకుండ నుండలేము.

పిన్న—ఎందు చేత?

రా—హిందూ ధర్మశాస్త్రము లట్లుచెప్పుచున్నవి.

పిన్న—(గ్రహించుకొనలేక) నీవన్నియు విపరీతపు మాటలు.

రా—కాదమ్మా! నీవును తండ్రిగారును యోజింపుఁడు. అది నాపై భరణమునకు దావా తెచ్చినదనుకొందు? అప్పుడేమి జరుగునో తెలియునా? దాని జీవనమునకై దొరతనమువారు నాజీతము లోను నాసంపదలోను, ప్రతి సంవత్సరము కొంత యిప్పింతురు. అందుచే దాని పోషణము మనకుఁ దప్పదుకదా?

పిన్న—ఎందులకుఁ దప్పదు? విడిచిపెట్టుటకుఁ దగినకారణములు చూపిన నధికారులెట్లు తీర్పు చెప్పుదురు?

రా—తగిన కారణము లుండవలెను గదా?

పిన్న—లేకేమి?

రా—చెప్పఁగలరా?

జన—చెప్పలేకేమి? నీ వివాహ కాలమున రెండువేల నగలు కూతునకుఁ బెట్టెదనని శ్రీనివాసరావు సల్వుర యెదుటను వాగ్దానము చేసినాఁడు. ఆనగలు పూర్తిచేయలేదు. అది వారిలోపముకాని మనదికాదు. అధికారులు మనకు విరుద్ధముగా నెట్లు తీర్పు చెప్పుదురో చూచెదనుగాక.

రా—తండ్రిగారూ! ఆనగలనుగూర్చి మీకంత పట్టుదల యెందులకు?

జన__బాగుగా జెప్పుచున్నావే! అది మనకు వచ్చెడిసొమ్ము. అంత సొమ్మెవ్వరు వదలుకొనఁగలరు? ఒకటియా? రెండా? రెండు వేల రూపాయలు?

రా__మనకు వచ్చెడి సొమ్మనుచున్నారు. ఎవ్వరికి?

జన__పిల్లకు, పిల్లనుబట్టి మనకు.

రా__పిల్లకే కాని మనకందుతో సంబంధ మేమికలదు?

జన__పిల్లకువచ్చిన మనకుఁ గాదా?

రా__కాదు. అందులో నొకదమ్మిడియైనను వాడుకొన మన కవకాశము లేదు.

పిన__అబ్బాయీ! అట్లందు వేమి? మనము వాడుకొన నక్కఱలేదు. కాని పిల్ల నగలతో మనయింటికి వచ్చుటకును నగ లేమియు లేకుండ మెడకు పసుపుకొమ్ము గట్టుకొని వచ్చుటకును భేదములేదా? అట్టిదాని నెవ్వరేలుకొందురు?

రా__నగలు లేనంత మాత్రమున భార్యను విడిచిపెట్టవచ్చునా?

పిన్న__మనకుఁ దప్పక రావలసిన ధనమును మనమెట్లు మానఁగలము? అంతధనము నష్టమగుచుండ నెవ్వరుచూచి సహింపఁ గలరు?

రా__అమ్మా, నగలకై మనమెంత ధనమిచ్చితిమి?

పిన్నమ్మ ఊరకుండును.

జన__మన మియ్యలేదుకాని ఇచ్చినట్టే! నీకతఁడు కట్నము నకై రెండువేలిచ్చెదనన్నాఁడు. ఆధనము మాకక్కఱలేదు. పిల్లకు నగలు చేయింపు మన్నాము.

రా__మనచేతి ధనమేమియు నందు లేదుగదా?

జన__(కోపముతో) అంతమాత్రమున, ఊరకుందుమా? మనకు రావలసిన సొమ్ముపోదా?

రా___తండ్రీ! నేనన్నది పరిశీలింపుఁడు. నామామగారు కట్న మునకై నాకు రెండువేలిచ్చెదననెను. దానిని మనము కోడలియలంకా రమున కిచ్చివేసితిమి. ఆధనమిప్పు డెవ్వరిదైనట్లు? అదియంతయుఁ గోడలిది. ఆయలంకారధనమునం దామెకేకాని మఱియెవ్వరికిని స్వతంత్రతలేదు. మఱియుఁ గట్నముపుచ్చుకొని పెండ్లాడిన భార్యను స్వీకరింపకపోవుట తప్పుకాదా?

జన___ఆకట్నము మనకుఁజేరినప్పుడుకదా!

రా___చేరకేమి? చేరినది. ఆధనమును మన మన్యథా యుప యోగించుకొన్నాము.

జ___"అన్యథా" యేమిటి? కోడలినగలకై యిచ్చినాము.

రా___ఏమయిననేమి? మన మా ధనము నుపయోగించు కొన్నాముకదా?

జ___అగుగాక. కోడలికి నగలకై యుపయోగించితిమి. ఆనగలు వలదా?

రా___నగలు లేకపోవుటవలన విచారింపవలసినది కోడలు. అది మనలను నగలకై బాధించినచో మీతండ్రి నడుగు మని చెప్పు దము. దీనిలో మనకేమి నష్టము?

జ___(కోపముతో) శ్రీనివాసము నగలుపెట్టినను బెట్టకపోయి నను భార్య నేలుకొందువా ఏమి?

రా___మన ధర్మశాస్త్రప్రకారము నేనట్లుచేయుట తప్పనిది. అట్లు చేయనియెడలఁ బాప మాచరించినవాడ నగుదును. ఇంతేకాక, శ్రీనివాసము తప్పుచేసినాఁడని యతని కూతును బరిత్యజించుట ధర్మమా? అది కేవలము నిరపరాధ. అనన్యగతిక. మనగోత్రమునకు మనయింటికి, అందులో నాకును సంబంధించినది? మనధర్మము నాచ రింపకపోవుట మనది పెద్దతప్పు.

జన — చాలు. చాలు. మంచిధర్మమునే చెప్పుచున్నావు. దాని యలంకార ద్రవ్యమంతయు శ్రీనివాసము వాడుకొనుటయు, మనము నగలు చేయించుటయు నే నంగీకరింపను.

రా — నగలు చేయింపుమని మీ కోడలు మిమ్ములను గోరి నప్పుడుకదా మనమి ట్లనవలెను.

జన — పోనిమ్మది యడుగదనుకొమ్ము. అది నిరలంకారయై వర్తించిన మనకుఁ జిన్నతనముకాదా ?

రా — తండ్రీ ! శ్రీనివాసము నగలు చేయించిపెట్టలేదన్నకోపముచేఁ గోడలు పరిత్యక్తయై గతిమాలినదై, మీకోడలనియు నా భార్యయనియుఁ జెప్పుకొనుచు వర్తించుట యింతకంటెను జిన్నతనము కాదా ? ముందుగా మీ నా పేరులే లోకమున వ్యాపించును.

పిన్న — అబ్బాయీ ! ఏమయిననుసరియే, ఆపిల్ల మనయింట నుండఁదగినది కాదు. దానికట్టియోగ్యత లేదు. అట్టి సద్గుణములు లేవు.

రా — అమ్మా! పెండ్లియైనతర్వాతఁ గోడలిని మన యింటికిఁ దీసికొని రాలేదుకదా! అది మనయింట నొక వారము దినములయినను నున్నట్లులేదు. ఇంతయెందుకు ? నీవు నీకోడలు నొకదినమైనను గలసి మెలసి వర్తించిన ట్లెఱుఁగను. అదియంత యయోగ్యురాలని నీవెట్లు చెప్పఁగలవు ?

పిన్న — నేఁ జెప్పనేల? ఆవిషయమై లోకము కోడియై కూయుచున్నది.

రా — కమలధూర్తయను విషయమా ?

పిన్న — అవును. నీకానందేహ మెందులకు ? శ్యామసుందరరావు భార్య నడుగుము. ఆముద్దరాలి సుగుణములన్నియుఁ దెలియును. శ్రీనివాసరావు పిల్లను దనకొడుకునకుఁ జేసికొన్నందులకు బాటబాట యేడ్చుచున్నది.

రా__ఆమె యెందుల కేడ్చుచున్నది? కోడలు సుగుణవంతు రాలు కాదనియా? లేక శ్రీనివాసము కట్నమియ్య లేదనియా?

పిన్న__(విసివికొనుచు) ఏమో! రెండును గావచ్చును.

రా__ఆమెకోడలు సుగుణవంతురాలు కాకపోయిన నీకోడలు కూడ నట్లే యగునని యెట్లు నిర్ణయింపఁగలము?

పి__ఆమె ప్రవర్తనము చూచినవారందఱును, ధూర్తత్వము విషయమై కమల భద్రను మించిపోవుచున్నదని చెప్పినారు. అబ్బో, అదెక్కడ? పట్నవాసపు పిల్ల.

రా__అమ్మా! చెప్పుడు మాటలు చెడ్డవి. పరమేశ్వరుఁడు మనకు బుద్ధి, కన్నులు, మొదలగునవి యిచ్చియుండగా నొకరిమాటలు మనము విననేల? మనమే పరీక్షించి చూతము. అది మనయింటి కనర్హురాలైనచో నప్పుడే పరిత్యజింతము.

పిన్న__(కోపముతో) ఏమో! నీయిష్టము. నీవు పెద్దవాఁడ వైనావు. ఇఁక మా మాటలు నీకు లక్ష్యమా!

రా__(నొచ్చుకొని) ఏమమ్మా! అట్లందువు. మీ మాటల నెప్పుడయిన నతిక్రమించితినా?

పిన్న__ఎప్పుడును లేదు. ఇప్పుడే.

రా__ఇప్పుడయినను మీ మాటల నతిక్రమింపలేదు. మీ సమ్మతిని బడయుటకై యింతగాఁ బ్రసంగించుచున్నాను.

పిన్న__మాసమ్మతియే నీకుఁ గావలసినచో నాపిల్లను ముందుగా విడిచిపెట్టవలయును.

రా__అట్లే చేయుదము. కాని మనము కొన్నాళ్ళు పరిశీలించుట న్యాయము. అప్పటికి నది బుద్ధిమంతురాలు కానిచో నీవుచెప్పి నట్లే చేయుదము. దాని మంచిచెడ్డలు లోకమునకు వెల్లడించినచో లోకము మనలను నిందింపదు. కారణమును వెల్లడిచేయకుండ దానిని

మనము విడిచితిమేని లోకము నిందింపకమానదు. లోకాపవాదము మానవంతులకు దుర్భరముకదా!

పిన్న—(కోపముతో) ఆ ముచ్చట గూడఁ దీర్చుకొనుము. దానిని దీసికొనివచ్చుటకై నేను వెళ్ళను. మీ తండ్రి వెళ్ళఁడు. నీవు పోయి తీసికొని వచ్చెదవో, లేక యేమి చేసికొందువో, చేసికొనుము.

రా—దానిని దీసికొని వచ్చుటకు మన మరుగవలెనా? ఉత్తరము చాలదా?

పిన్న—(నవ్వుచు) ఉత్తరమే యక్కఱలేదు. శ్రీనివాసరావు నకు మానమర్యాదలతోఁ బనిలేదు. 'ఉఁ' అన్నజాలును గూతును దీసికొని వచ్చి యప్పగించును.

రా—(అవునమ్మా!) అట్లు చేయుట యతని విధి. ఆ పిల్ల మన సొత్తు. దానిని గొంత కాల మతని చెంత దాచియుంచితిమి. ఇప్పు డావస్తువును దెచ్చి మన కిచ్చివేయును. ఇందుఁ దప్పేమి యున్నది?

పిన్న—అదంతయు మా కెందుకు? నీ యిష్టము వచ్చినట్లు చేసికొనుము.

రా—దానికేమి? కాని యెల్లుండి మెయిలుబండిలోఁ జెన్న పురికిఁ బోవలయును. నీవును దండ్రిగారును బ్రయాణ సన్నద్ధులై యుండుఁడు.

అని చెప్పి రామారావు లేచి వెడలి పోయెను.

3

సుదర్శనరావు నెల కొక నూటయేఁబది రూపాయల చొప్పున నద్దె యిచ్చుచు నొక దివ్యసౌధమున నివసించుచుండెను. ఆసౌధ ముద్యాన వనముచేఁ జుట్టఁబడి విద్యుద్దీపములచేతను, విద్యుద్వ్యజనములచేతను విరాజిల్లుచుఁ జూపఱ కమితానందముఁ గూర్చుచుండెను. ఆసౌధ ములోఁ గొంత భాగము ప్రియురాలగు కేమెలున కిచ్చి తక్కిన దానిలో సుదర్శనరావు పరివారముతో నివసించుచుండెను. ప్రియు రాలి కోర్కెను బట్టి యతఁడు దివ్యసౌధమున వసించుచు, మోటారు బండిలో సంతత మామెతో విహరించుచు మహావైభవమున వర్తిం చుచుండెను గాని యిందులకుఁ దగినంత ధన మేది? అతఁడు క్రొత్తగా న్యాయవాదిత్వ మవలంబించుటచే నందువలన నింటియద్దెకుఁ జాలిన ధనమైనను నార్జింపలేదు. అందుచే నతఁడు కేవలము తన యుద్యో గముపై భారముంచక సెలవు దినములలోఁ దన స్వస్థలమునకు వచ్చి తండ్రితోను, సోదరునితోను, కొంత వివాదపడి, భూములు సంపద లను బంచుకొని, తన వంతు భూమి నమ్మివేసి, యిరువది వేల రూప్యములు చెన్నపురి నిధికిఁ జేర్చి, తిరిగి చెన్నపురిని జేరుకొనెను. సుదర్శనరావు తండ్రి శివరామారావు దివ్యజ్ఞాన సామాజికుఁడై జాతికులభేదముల విషయమై యంత పట్టుదలలేనివాఁడైనను, తన కుమారుఁడు సుదర్శనుఁడు కేవల 'మాంగ్లయువతి విలాసములకుఁ జిక్కిపోయి విచ్చలవిడిగా ధనము వెచ్చించుట యతని కంత మాత్ర మిష్టములేదు. అందుచే సుదర్శనునకు వంతువెట్టుట కిష్టపడక కొన్ని దినములు పెనఁగులాడెను గాని యంతవఱకును న్యాయాధికార పదవియం దుండి యితరుల దాయవిభాగముల తీర్పు చెప్పు

తానిప్పు డొకరిచే జెప్పించుకొనుట మంచిది కాదని యూహించి తుదకెట్లో సమాధానపడెను.

సుదర్శనుఁడిట్లు సర్వవిధములచేతను దొరసాని కెట్టిలోపమును గలుగనీయక సంతతానురాగమునఁ బ్రవర్తించుచుండెను. సుదర్శనునకు వేఱులోకములేదు. ఎల్లప్పుడును దొరసాని చింతయే. ఆమె సంతోషమే తనసంతోషము. ఆమె సౌఖ్యమే తనసౌఖ్యము. ఆమెకుఁ గావలసిన వస్తునిచయమును సమకూర్చుటయే యతని ప్రధానకార్యము. పెక్కేల? ఆమెపై నీగవాలినను సహింపలేనంత ప్రేమాతిశయము గలవాఁడై తానింద్రలోకసౌఖ్య మనుభవించుచున్నట్లు భావించుకొనఁజొచ్చెను. సెలవుదినము లందును సాయంసమయము లందును, మోటారుబండిలో భార్యను గూర్చుండఁబెట్టి స్వయముగానే బండి నడపుచు నాపురమున రమణీయస్థలముల నెల్లఁజూపి యామెకు సంతసము కూర్చుచుండెడివాఁడు. ఒక్కొకప్పు డంగడివీధియందు సుప్రసిద్ధ వర్తకుల దుకాణములకుఁ గొనిపోయి యామెకోరిన వస్తువులను గొనియిచ్చెడివాఁడు. అందులో సామాన్య వస్తువులేకాదు. వజ్రపుటుంగరములు, బంగారుగాజులు, గొలుసులు మొదలగు విలువ వస్తువులుకూడఁ గొని భార్య నలంకరించువాఁడు. మఱియొకప్పుడు మెరీనాకుఁ గొనిపోయి చల్లగాలికై యచ్చటికి వచ్చు వివిధవేష భాషా గుణ స్వభావయుతులగు స్త్రీ పురుషులను జూపుచు హైందవులపద్ధతులను, బ్రవర్తనములను నాచారములను వర్ణించి చెప్పుచుండెడివాఁడు. హిందూదేశ మేయంశమునందు నింగ్లండునకుఁ దీసిపోదన్న యభిప్రాయ మామెకుఁ గల్గింపవలెనని యాతని ప్రధానోద్దేశము.

సుదర్శనరా వింగ్లండునం దలవాటు చేసికొనుటచే రాత్రిపూట రొట్టెయుఁ బాలు, పండ్లు భుజించువాఁడు. పగటిపూట హిందువుల వలె భుజించుటయే వాడుక. పగటిపూట దొరసానితోఁ దన కేళ

వం_క్తి లభింపకున్నను రాత్రిపూటమాత్రము తప్పక లభించెడిది. రాత్రి పూట భార్యాభర్త లిరువురు నొక బల్లయొద్దనే కూర్చుండి యిష్ట గోష్ఠిని సలుపుచు భుజించుచుండెడివారు. ఈ విధముగా వారయి దాఱుమాసములు గడపిరి.

ఒకనాఁడు సుదర్శనరావు కచ్చేరీనుండి యింటికివచ్చి యుచిత వస్త్రములఁ దాల్చి యొక యాసనమునఁ గూర్చుండి యామెకోసమై తాను నిరీక్షించియున్నట్లు పరిచారికచే దొరసానికి వార్త పంపెను. అందులకు దొరసాని యిట్లు ప్రతివార్త పంపెను. "ప్రియుఁడా! ఈ పురమున సైనికోద్యోగమున సుప్రసిద్ధి గాంచిన మోకరుదొరగారితో మాటాడుచున్నాను. నే నిప్పుడు రా వలనుపడదు. కొన్ని నిమిష ములు వేచియుండుడు. లేదా, యీనాఁటికి మీ రొక్కరే విహారము సల్పి రండు. మఱియు నీదొర నన్నుఁ దనతో విహారమునకు రమ్మని కోరుచున్నాఁడు. ఒకవేళ నతనితో వెళ్ళవలసివచ్చునేమో! ఏ మయి నను నేఁటికి మీ రొక్కరే విహారము సల్పి వచ్చుట మంచిదని తలం చెదను" అని యొక కాగితముపై వ్రాసి పంపెను. అది చదువగానే సుదర్శనునకుఁ దల దిరిగినట్లయ్యెను. ఇంగ్లండులోని స్త్రీలు తమ భర్త లను విడిచిపెట్టి పరపురుషునితో విహారము సల్పివచ్చుట నీతిబాహ్యము కాదని యతఁ డెఱుంగును. తన భార్య వేఱొకనితోఁ బ్రసంగించు చున్న కాలమున భర్త కచ్చటికిఁ బోవ స్వాతంత్రత లేకపోవుటగూడ నొక యాచారమని యతనికిఁ దెలియును. అంతియకాదు భార్య యొక్కర్తుకయే యున్నను నామె గదిలోనికి తదీయానుమతి వడయ కుండ నరుగ భర్తకయినను నధికారము లేదన్న యంశముకూడ నత నికిఁ గ్రొత్తకాదు. అయినను హైందవుఁ డగుటవలనఁ గాఁబోలును దన భార్య రహస్యముగాఁ దన యనుమతి వడయకుండగనే వేఱొక నితో సంభాషించుచున్నదని విని సహింపలేకపోయెను. సంభాషించు

టయే కాదు. అతనితో విహారమునకుఁగూడఁ బోవునఁట. అతని
కది మఱింత కష్టమయ్యెను. మాటాడుచున్నప్పుడు తన్నుఁ బిలువ
కున్నను, విహారార్థ మరుగునప్పు డయినను దన్ను రానిచ్చినచో
బాగుగా నుండునని యతఁడు తలంచెను. కాని యతఁ డిపు డేమి
చేయఁగలఁడు? అట్లని మరలవార్త నంపినచోఁ దన ప్రియురాలేమను
కొనునో! ఒకవేళఁ గోపగించునేమో! ఆమె నిజముగాఁ గోపించి
తనతో సంబంధమును విసర్జించినచోఁ దానిఁకఁ జేయున దేమున్నది?
తదీయసంబంధము పోవుటయేకాక యామెకై తానింతవఱకును వ్యయ
ముచేసిన వేలకొలఁది రూపాయలన్నియు వ్యర్థ మేకదా? అందుచే సుద
ర్శనుఁ డతి కష్టమునఁ గోపము నడంచుకొని, మనస్సు నెట్లో సమ్మ
తింపఁజేసికొని, యయిదు నిమిషములపా టట్లో తన గదియందే
పచారుచేసి, విహారోచిత వస్త్రములఁ దాల్చి తన మోటారుబండిలో
గూర్చుండి మెరీనాకు విహారార్థ మరిగెను. కాని నాఁ డతని కేమియు
నది సౌఖ్యకర మనిపింపలేదు. అక్కడి కరుదెంచిన స్త్రీపురుషు
లందఱు వికసితముఖములతో నిట్టటు దిరుగుచు నానావిధ వృత్తాంత
ములు ప్రసంగించుచు సౌఖ్యస్వరూపులవలె నానందమయులవలెఁ గనఁ
బడుచుండఁ బాపము సుదర్శనుఁడు మాత్రము దుఃఖితస్వాంతుఁడై
పగటిపూట చందురునివలె వెలరువాఱిన వదనంబుతో నొకచోఁ
గూర్చుండి యుండఁగాఁ బూర్వ పరిచితుఁడొకఁడువచ్చి యేదియో
ప్రసంగింపఁజొచ్చెను. అన్యాయత్త మనస్కుఁడగుటచే సుదర్శనుఁడు
దన మిత్రుఁడడిగినదానికి సరిగా సమాధాన మీయలేక యున్నింటి
కిని నౌనని తలయూపుచు లేని సంతోషమును ముఖమున నగపడఁజే
యుచు నెట్లో కాలముపుచ్చుచుండెను. ఇంతలోఁ గేమెలామోకరుతోఁ
కలిసి యతనిబండిలోఁ గూర్చుండి మెరీనాకువచ్చి, యొకరిచేతులొ
కరుగీలించుకొని యిట్టటు పచారుచేయుచుండిరి. ఒకమాఱట్లు పచారు

చేయుచు వారు పరస్పరమేదియో సంభాషించుచుఁ గిలకిల నవ్వుకో
నుచు నాకనుచీకటి సమయములో నాసుదర్శనుని చెంతనుండియే
పోవుట సంభవించెను. సంతతము దొరసానియందు మాత్రమే దృష్టి
నుంచుకొన్న సుదర్శనుఁ డామెనుజూచి గుర్తించెను. కాని యేమిచే
యఁగలఁడు? అతఁడు మిత్రునితో మాటాడుచు నొక వేఁడి నిట్టూర్పు
మాత్రమే పుచ్చెను. సరససంభాషణలో మునిఁగియున్న వారతనిని
జూచినట్లులేదు. అతని నొకవేళఁ జూచినను బ్రమాదమేమి? అది
పాశ్చాత్యమర్యాద. అట్టిమర్యాదలను సుదర్శనుఁడు పాటింపనిచో
నతఁ డాంగ్లయువతితోఁ గాఁపురముచేయ ననర్హుఁడే యగును. ఈవికృ
తప్రదర్శనము చూడఁగనే సుదర్శనునకుఁ దల భిన్నమైపోయినట్ల
య్యెను. ఇఁకనతని కటనుండుట కష్టమనిపించెను. వెంటనే సంభాషణ
మును ముగించి తనయింటికి మరలివచ్చెను. వచ్చియు రాఁగనే
యతఁడు సేవకునిచే నారబయటను సుఖాసనము వేయించుకొని యర్ధని
మీలితనేత్రుఁడై మిన్నుఁజూచుచు నేదియో యాలోచించుచుండెను.

రాత్రి నాల్గుగడియ లతిక్రమించెను. మోకరుదొర యామెను సుద
ర్శనుని గృహాపురోభాగమున విడిచిపెట్టి, యామె మృదుహస్తమును
దనహస్తమునఁ గీలిఁచి "గుడ్ ఈవినింగ్" మంత్రము నొకమారు
జపించి వెడలిపోయెను. కేమెలుగూడ నట్లయొనరించి చివ్వునఁ దనగది
కరిగి యావస్త్రములను మార్చుకొని యింతలోఁ బరిచారిక గొనివచ్చి
యిచ్చిన యుత్తరములను జదువుకొని సుదర్శనుఁ డెటనున్నాఁడో
యడిగి తెలిసికొని చటాలున నతనిసమీపించి "ఓ, మైడియర్" అని
సంబోధించెను. పరాయత్త చిత్తుఁడయిన సుదర్శనుఁడదివిని తుళ్ళి
పడిలేచి "ఓ, మైడియర్" అని యామెచేతిని బట్టికొని తానుగూ
ర్చున్న యాసనముపై కూర్చుండఁబెట్టెను. ఇంతలో సేవకుఁడొకఁడు
తెచ్చిన కుర్చీపై నామెకభిముఖముగా సుదర్శనుఁడు కూర్చుండెను.

అప్పుడు వారిట్లు సంభాషించుకొనిరి.

దొర—ప్రియా? నేడుమీరట్లు వికృతముగా నున్నారేమి?

సు—(లేనినవ్వును దెచ్చికొనుచు) ఆఁ, ఏమీ! ఎట్లున్నాను?

దొ—నేడు మీముఖము కళాహీనమై యున్నది.

సు—నేఁడు కొంచెము తలనొప్పిగా నున్నది.

దొర—మందు రాసినారా?

సు—లేదు. అదియే పోవును.

దొరసాని విసుగుచూపుచు "మీహిందువులందు నున్న దుర్గుణ మిదియే. ఎల్లప్పుడును నిరాశహృదయులయి దైవముపై భారము వేసి కూర్చుందురు. మీకీమాంద్య మెప్పుడు వదలునో" యని పల్కుచు మందుఁదెచ్చుటకై తనగది కరిగెను.

సుదర్శనరావున కామాటలు కమితానంద మొదవెను. ఆమె పర దుఃఖాసహిష్ణుతకును, సమయోచిత బుద్ధికిని, మెచ్చుకొనెను. పాశ్చాత్య స్త్రీలకున్న తెలితేటలును, యుక్తకార్య పరిజ్ఞానమును విద్యావివేకములును, హైందవ స్త్రీ లేనాఁటికయినను సంపాదింపఁ జాలరని యనుకొనెను. అదివఱకతని చిత్తమున హత్తియున్న కోప సంతాపము లొక్కపెట్టున నంతరించెను. ఆమెతిరిగివచ్చి మందుఁదలకుఁ బూయకముందే యతనిబాధ నివర్తించెను. ఆమె తనకృత్యమును నెఱవేర్చి, తనయాసనమున నాసీనయయ్యెను. అప్పుడు సుదర్శనుఁడు, "ప్రియురాలా! నీవు చెప్పినది చాలవఱకు నిజము. హైందవులు దైవ పరులై వర్తించుట యసత్యముకాదు. అందులోను, బురుషు లిప్పు డిప్పుడు పాశ్చాత్యసహవాసముచేఁ గొంచెము కన్నుఁదెఱచుచు న్నారు. కాని మా స్త్రీలు చెప్పుటకు వీలులేనంత దురవస్థకుఁ జిక్కి యున్నారు. మాస్త్రీలు మీకాలిగోటికైనను బోలరనుట యొప్పుకొ నక తప్పదు. ఇంతసేపిట్లు బాధపడుచున్నానేకాని నాకైనను మందు

రాసికొందమనెడి యూహజనించినది కాదని తమ జాతి స్త్రీలనే కాక తన్నుఁగూడ నిందించుకొనెను.

సుదర్శనుఁడు పల్కిన మాటలవలన నదివఱకే నెలకొనియున్న గర్వము పెచ్చుపెరిగి తదీయ ముఖమండలమున మందహాసాంతరితమై తాండవ మాడుచుండ సుదర్శనునితో "అంతే కాదు. హిందువుల దురాచారములుగూడ వర్ణనాతీతములు. మొన్న నొకచోఁ జూచితిని. పదేండ్ల పిల్లకు వివాహము గావించినారు. స్త్రీలకు పునర్వివాహమే లేఁదట" అని పలికెను.

"అవును. నీ వన్నది సత్యమే. మా హిందువులం దిట్టి లోపములెన్నియో కలవు" అని యతఁ డొప్పుకొనెను.

దొర — వానిమాట కేమి? మతమో. అది మఱింత పాడుగా నున్నది. అది కేవలము విశ్వాసానర్హము.

సుదర్శనునకుఁ బాశ్చాత్య నాగరికతయం దనురాగము హెచ్చు. అతఁడు తన వేషభాషలను మఱచిపోయినట్లే తన మతమునుగూడ మఱచిపోయెను. ఇంతయేల ? మత మనెడి పేరుగూడ నతఁ డుచ్చరించిన పాపమునఁ బోలేదు. తక్కిన మతములుగూడ నతని కేమియును దెలియవు. అయినను బ్రియురాలిని మెప్పించుటకై "అవును. హిందూమతము పూర్వపు టడవిమనుష్యు లెవ్వరో కల్పించినారు. వారు కన్నులుమూసికొనియే మతమును స్థాపించినారు. తరువాతివారందఱుగూడ నదేవిధముగా నంధప్రాయులై వర్తించుచున్నారు. మతము లన్నిటిలోను క్రైస్తవమతము సర్వసమ్మతము" అని పలికెను.

మతమన నేమియు నెఱుఁగని సుదర్శనుఁ డిటు మతసిద్ధాంతము చేసెను. హిందూమత తత్త్వమును దెలియని యిట్టి నవనాగరకుల యుపదేశములవలననే మతమునకును, సంఘమునకును బెక్కనర్థ

ములు సంభవించుచున్నవి. పూర్వులు నిర్మించిన యొక మందిరమునఁ గొన్ని మార్పులు జేయఁదలంచుకొందుమేని ముందుగా వారియుద్దేశ ములు గ్రహించి యవి యెట్లయినను సరిగాక బాధాకరములు లయి నప్పుడు మనము మార్పు చేయవలసినదే. అంతేకాని వారి నదుద్దేశ ములు తెలిసికొనకుండనే మన మారంభించితిమేని, స్వరూపనాశ నము చేసినవార మగుదుము. అట్లే దూరాలోచనములు గల మహా ర్షులు స్థాపించిన హిందూమతమున సంస్కరణములు చేయఁ దలంచితి మేని యా మహర్షుల యాశయములఁ గనుగొనకుండఁ జేయరాదు. చేసినను నది సంస్కరణ మనిపించుకొనదు. ఇట్లుండ మతమునకుఁ గనుచూపు దూరమందుండిన సుదర్శనునికి యపక్వ మతసిద్ధాంత ములు గ్రాహ్యము లగునా?

దొర—మఱి మీరింకను క్రైస్తవమతమును స్వీకరింప రేమి?

సు—స్వీకరించెదను. అ దెంతసేపు? ఇదివఱకే చేసి యుందును. కాని యప్పు డొక చిక్కుండెను.

దొర—అ దేమిటి?

సు—క్రైస్తవుఁడ నైనచో మా హిందూకుటుంబపు సంప దలు నాకుఁ జెందవు.

దొర—ఇప్పుడు సంపదలు పంపకమైనవికదా. ఇఁక నట్టి భయముండదు.

సు—అవును. ఒకటిరెండు వారములలో నీ యభిప్రాయ ప్రకారమే నడచెదను.

సుదర్శనుఁడు విద్యార్థికుఁడైనను గొనెటెద్దువంటివాఁడు. వర్తకుఁడు ముకు్క త్రాడుపట్టుకొని తీసికొనివెళ్ళిన చోట్లకెల్లను వెళ్ళవలసినదే. దాని కింతేనియు స్వాతంత్ర్యములేదు.

౪

సుబ్బమ్మ—భద్రా! ఏమి చేయుచున్నావు? గొంతు పగులున ట్లఱచినను మాటాడవు.

భద్ర—ఏమత్తా! ఇదిగో వచ్చుచున్నాను. మీ పిలుపు నాకు వినబడలేదు. (అని పడకటింటిలోనుండి గబగబ వచ్చుచుండును.)

సు—(కోపముతో) నీ కెట్లు వినఁబడును? ఎల్లపుడును మగనితో గుసగుసలే? ఇల్లు, వాకిలి, పని, పాటు, అక్కఱలేదు. విస్తరిలోనికి ముద్ద యెట్లు వచ్చునని యనుకొనుచున్నావు?

భ—లేదత్తా! నేను మాటాడుచుండలేదు. మీ యబ్బాయి యెక్కడికో వెళ్ళుచుఁ జొక్కాకు బొత్తాములు కుట్టమన్నారు. కుట్టుచున్నాను.

సు—ఈ దినమున నింట లేఁడేమో! ప్రతిదినము వినుచున్నానుగాదా? క్రొత్తగా వచ్చిన యత్తింటి కోడలికి సిగ్గు, మర్యాద, పెత్తనము ఉండవలెను. నీ చర్య చూచి యూరిలోని యాఁడమ్మ లందఱును నవ్వుచున్నారు.

భ—మీ రానాఁడు చెప్పినప్పటినుండియు నేను దప్పించుకొనియే తిరుగుచున్నాను. కాని మీయబ్బాయి మాటిమాటికి నన్నేదో పనికై పిలిచి చేయుమన్నప్పుడు చేయకుండ నెట్లుండగలను? చేయకపోయిన నాయనకుఁ గోపమువచ్చునేమో యన్న భయము.

సు—(చేతులు త్రిప్పుచు) ఓహో! చెప్పెడిదేమి? పాపము, నీవు మగనికి, మామగారికి, ఇట నత్తగారికి భయపడి గడగడ వడకిపోవుచున్నావు. చాలు. చాలు. ఏమి చమత్కారపు మాటలు!

భ—చమత్కార మేమియులేదు. పెద్దలను జూచినప్పుడు

చిన్నలకు భయముకాదా?

సు—నాతో దెబ్బలాడకు తల్లీ! నీతో సాలలేను.

భ—అదేమండీ! అత్తా! అట్లనెదరు? నేనేమి తప్పుమాటా డితినండీ! మీరంత కోపపడుటకుఁ దగినంత నేరమేమి చేసితిని?

సు—(తన కోపమంతయు వెల్లడియగునట్లు చేతిలోఁ జెంబును గట్టిగా నేలఁబెట్టి) చాలు. తల్లీ! నీతో వాదించుచుఁ గూర్చుండుటకు నాకుఁ దీఱికలేదు. బోలెడు పనియున్నది.

భ—అంతపనియు మీరేలచేయవలెను? నాకుఁజెప్పి చేయింప రాదా? మావంటి వారుండుట యెందులకు? గృహకృత్యములలోఁ దోడ్పడుటకే కదా?

సు—చాలులెమ్మా! నీవు పనిచేయఁగలవా? పనిచేసిన పాతిక వట్టమగును. ఒకపనియు జక్కగాఁ జేయలేవుగదా? ఎంతసేపును హార్మోనియము దగ్గఱకూర్చుండి పాడుమన్నచో సానిదానిలాగునఁ బాడఁగలవు. అంతకుఁదప్ప నీకేమియుఁ జేతగాదు.

భ—నేనెల్లప్పుడు బాడుచు గూర్చుందునా? అట్లందురేమి? నేనిక్కడికి వచ్చినప్పటినుండియు నొక్కసారి మాత్రమే కాదా పాడితిని. అదియైనను నూరిలోని యమ్మలక్కలందఱువచ్చినప్పుడు మీరు పాడుమన్నఁ బాడితిని. మఱెప్పుడును బాడలేదు. నేను జిన్నదానను. మీరు పెద్దలు. నాచేయుపనులలోఁ దప్పులున్న దిద్దవలెను. లేకున్న మాకు నేర్పెట్లు కుదురును?

సు—నీకుఁ జెప్పిచేయించుటకన్న నేఁజేసికొనుటయే సుఖము.

భ—అట్లనిన బాగా? నాచేఁ జేయింపకున్న పనులు నాకలవాటగుటయెట్లు? ఎల్లకాలము మీరు చేయఁగలరా?

సు—భగవంతుఁడు నుదుట వ్రాసియున్నప్పుడు తప్పునా? వేయిమాఱులు చేయించినను నీవు చేయలేవు. అది మాయదృష్టము.

నిన్ననిన లాభమేమి? చూచిన నెంతో ముచ్చట వేయును. నరసమ్మ గారి వేంకటరత్నము నిజముగా రత్నమేకదా! ఇంటెడుపని యొక్క నిముసములో జేయును. అది వాండ్రయదృష్టము. ఎట్లయినను బల్లెటూరిపిల్ల పల్లెటూరిపిల్లయే. పట్ణవాసపుపిల్ల పట్ణవాసపు పిల్లయే!

భ—పల్లెటూరిలోను బట్ణవాసములోను నేమున్నది? అలవాటు చేసికొనుటలో నున్నది. వెంకటరత్నమున కానేర్పంతయుఁ బుట్టుకతో వచ్చినదా? ఆనరసమ్మ గారెప్పుడు కోడలిచేఁ బనిచేయించుచునే యుందురు. అందుచే దానికలవడి యుండవచ్చును. మీరు నట్లే కూర్చుండి నాచేఁ జేయింపుఁడు. నేనుమాత్రి మాపనులన్నియు నెందులకుఁ జేయలేక పోవుదునో.

సు—నీకు దానికిని సాటియెక్కడ? వేయిజన్మములు తలక్రిందుగాఁ దపస్సుచేసినను నీవు చేయలేవు.

భ—అట్లందురేమండీ! ఇదేమి బ్రహ్మవిద్యయా? రాత్రి పూట నాల్గయిదు పర్యాయములు వండితినిగాదా? వంటపని నాకప్పగింపుఁడు. చిటికెలోఁ జేసిపెట్టెదను.

సు—నీయట్టి దూబరకు వంటపని యప్పగించినచో సంసారము మూఁడు రోజులలో ముక్కలగును.

భ—నేను మాత్రము పొదుపుగా వాడలేనా? లేక పాడుచేయుచున్నపుడు చెప్పండి.

సు—ఎంతచెప్పినను నలాభమేమి? ఆనాఁడు చెప్పితిని, నీకు లక్ష్యమా?

భ—నన్నేమి చేయుమందురు? వేపుడు కూరలో నూనెకొంచెము హెచ్చయినది. అట్లు చేయకపోయిన మీయబ్బాయి తినరు.

సు—ఓహోహో! పతిపై నెంతభక్తి. నీవు వచ్చినతరువాతనే వానికి వేపుడుకూరలలవాటయినవి. అదంతయు బట్ణవాసము

పద్ధతి. మాయబ్బాయి పేరుపెట్టి నీవు తినుటకుఁ జేసిన పనియే.

భ—మీ యబ్బాయి సొమ్మును దినుటకు నేనుదగనా యేమి? దానికేమి? ఈదినము నేను వండుదును. మీరుచూచుచు గూర్చుండి నాచేఁ జేయింపుఁడు.

సు—రాకాసి లాగునఁ గూర్చుండుటయేకాని యింటిపని ముట్టుకొనదని వాడవాడలందుఁ జాటుటకా?

భ—అత్తా! అట్లందురేమి? నేనెప్పుడయినను నట్లు చేసితినా? చేయుదునా? నేనువచ్చినప్పటినుండియు నొకదినమైనను గుమ్మముదాటి వెళ్లితినా? నాయందు మీరట్టియపగాధము గల్పించుట న్యాయమా? నిజముగా నాయందు దప్పున్నచో దిద్ది క్షమింపుఁడు.

సు—ఊరిలోనికి వెళ్లకపోయినంతమాత్రాన నీవు ముద్దరాలివా యేమి? ఏటికి నీళ్లకైపోయి నీవుచేసెడిపని యేమి? అత్తగారిని నిందించుటయే.

భ—నేను దైవసాక్షిగాఁ జెప్పుచున్నాను. మిమ్మును దైవముగాఁ జూచుచున్నాను. పల్లెత్తుమాటయైన నాడలేదు. మీమాట నతిక్రమింపలేదు.

సు—ఓహో! చెప్పెడిదేమి? అత్తగారనిన నంతభయము. పాపము. నామాట నీకులక్ష్యమే లేదు.

భ—నేనేమి లక్ష్యపెట్టలేదు. మీరు వద్దన్నవన్నియు మానివేయుచునే యున్నాను.

సు—అనుటయేకాని నీవెక్కడ మానఁగలవు?

భ—మాపెద్దనాన్నగారి యింటికి వెళ్లరాదన్నారు మానివేసితిని గాదా?

సు—ఇంటికి మానివేసితివి? వారితో మాటలు మానితివా?

భ—మాటలుగూడ మానితిని.

సు—ఎందుల కీయుబద్ధములు? రామావధాని కూతురుతో నున్న నీవు మాటలాడ లేదా? ఏటిదగ్గిరజరిగిన వెవ్వరికిని దెలియవను కొనుచున్నావు. మాకూరంతటను జెవులున్నవి.

భ—అయ్యో! నేను మాటలాడ లేదండీ! నేనును వెంకటరత్నమును నీళ్లుపట్టుకొని వచ్చుచున్నాను. మావెనుక రుక్మిణి వచ్చుచున్నది. వెంకటరత్నము సూయక్కనుగూర్చి యేదో యడుగుచుండ సమాధానము చెప్పుచున్నాను. రుక్మిణి మాటాడనులేదు. నేను సమాధాన మొసఁగనులేదు.

సు—నీవెంత చెప్పినను నేనునమ్మను. పుట్టిననాఁటిబుద్ధి పుడకలతోఁగాని పోదు. ఇంతకు మాయదృష్టము. ఏమిచేయుదును.

అనుచునే వంటయింటిలోనికి గబగబపోయెను.

భ—(సమీపించి) నన్నెందులకుఁ బిల్చినారు.

సు—పిలిచినను తప్పే?

భ—తప్పని కాదండీ! నాచేయవలసినపని యేమని యడిగితిని.

సు—(అది వినిపించుకొనకుండగనే) ఇదేమికాలమమ్మా? పిలుచుటయుఁదప్పఁట.

సుబ్బమ్మయింకను నేమో గొణఁగుకొనుచుండెను.

ఇంతలో "ఏమిచేయుచున్నా"వన్న పిలుపు వినవచ్చెను.

భ—అత్తా! నాపనియేమున్నదో చెప్పుదురా? అవల మీయబ్బాయి పిలుచుచున్నారు.

సు—వెళ్లమ్మా—నాకు నీవేమియుఁ జేయనక్కఱలేదు. అదిగో టెలిగ్రాము వచ్చినది. నీవిక్కడనుండ వీలగునా?

మరల రెండుమూడు పిలుపులు వినవచ్చెను. "ఇదిగో! వచ్చుచున్నా"నని భద్రమ్మారుపలుకుచుఁ బడకటింటికిఁ బోయెను. విశ్వంభరరావామెను జూచి, ప్రేమతో "భద్రా! ఏమిచేయుచున్నావు?"

అని ప్రశ్నించెను.

భ—అత్తగారు పిలిచినారు. వెళ్లితిని.

వి—చొక్కా కుట్టితివా?

భ—అయినది.

వి—ఏవీ తామలపాకులు.

భ—ఇదివఱకే చుట్టి పాందానులో నుంచితిని.

వి—కాఫీ, కాఁచితివా?

భ—లేదు. పాలుమజ్జిగకే చాలకున్నవని కాఫీవద్దనినిన్న అత్తగారు చెప్పినారు. అందుచే మానివేసితిని.

చాటుననిలిచి వారిప్రసంగము వినుచుండిన సుబ్బమ్మ గబగబ లోనికివచ్చి "ఏమే! భద్రా! ఏమనికూయుచున్నావు? మాకుటుంబములోఁ గలహము తెచ్చి పెట్టుటకుఁ జూచుచున్నావు? నేను గాఫీకాఁచవద్దన్నానా? మగనితో నున్నవియు లేనివియుఁ గల్పించి చెప్పుచున్నావా? ఇట్టిమాటలు నేను సహించుదాననుగా"నని యింటికప్పెగిరిపోవునట్లు కేకలు వేయనారంభించెను.

భ—(హీనస్వరముతో) నేనిది కల్పించితినా? నిన్నను నేను బాలుతీయుచున్నపుడు కాఫీవద్దని మీరు ఖండితముగఁ జెప్పినారు కారా! అందుచేతనే మానివేసితిని.

సు—నీప్రవర్తన మెవ్వరెఱుఁగరు? అమాయికుఁడగు మా యబ్బాయిని వలలోవేసికొని నీయిష్టమువచ్చినట్టు లాడించుచున్నావా! ఈవేళ ఆదివారము. నీవు కాఫీత్రాగవు గనుక నీమగనికిఁ గూడ లేకుండఁ జేసి యిట్లు లేనిపోనినేరములు నాపైఁ గల్పించి చెప్పుచున్నావు. చెప్పు. చెప్పు. నిన్ను నీమాటలు లక్ష్యముచేయువారెవ్వరు? అని చివాలున నటనుండి వెడలిపోయెను.

విశ్వంభరరావది విని నిస్తబ్ధుఁడై కుర్చీయందట్లే కూర్చుం

డెను. సింహగర్జనము విన్న లేడిపిల్లవలె భద్రయు రూపొందిన భయమువలె గోడకుఁ జేరఁబడి నిలిచియుండెను. ఆమె వెడలిపోయిన తరువాత నతఁ డిట్లు ప్రసంగించెను.

వి—భద్రా! ఈసమాచారమేమి?

భ—నాథా! నేనేమని చెప్పుదును? కొన్ని దినములనుండి యెందుచేతనో మీతల్లిగారు నాపైఁ గొరకొరలాడుచున్నారు. నా లోపము లున్నవేమో యని మిక్కిలి యాలోచించితిని. కాని నా తప్పేమియుఁ గనఁబట్టలేదు. చూచితిరా? వారు నాయందెట్టిలోపము లెంచుచున్నారో నిన్న కాఫీకి పాలుతీయుచున్నప్పుడు తేపటినుండి కాఫీపెట్టవద్దని శాసించి చెప్పినారు. నిన్న నట్లని వారు నేఁ డెట్లు చెప్పుచున్నారో చూడుఁడు. ఇంతేకాదు నేను గాఫీ కలవాటుపడి మిమ్మునుగూడఁ బాడుచేయుచున్నానఁట!

వి—(నవ్వుచు) ముసలివాండ్రు. ఏమయిననందురు. అవి మనము లెక్కచేయరాదు.

భ—నాథా! అట్లుకాదు. నాయందుఁ దమకు నిష్కపట ప్రేమయే నున్నయెడ నకారణవాత్సల్యమే యున్నయెడ నాప్రార్థన మొకటి మన్నింపవలయును.

వి—ఏమి?

భ—మీరు కాఫీ మానివేయవలయును.

వి—పోని మ్మట్లేమానివేయుదము. మాయమ్మ యీవిష యమై విసివికొనుచుండఁగా నేనును విన్నాను. దానికేమి? కాని హార్మోనీ శ్రుతివేసి రెండు త్యాగరాయకీర్తనలను బాడుము.

భ—నాథా! నేఁడుమొదలు సంగీతమునకుఁగూడ స్వస్తిచెప్పి తిని. దానివలనఁ బెక్కనర్థములున్నవి. నాయందు దయయుంచి యీకోర్కి గూడ విడువవలయును. నేను సంగీతము నేర్చికొన్నందుల

కిప్పుడు విచారించుచున్నాను. పెద్ద లేవగించుచున్నారు. ఇంతకుఁ బని చేసికొనువేళఁ బాడుచుఁ గూర్చుండిన బాగుండదు. నాకు సెలవిండు. పోయి యత్తగారి కింటిపనులలో సాయపడెదను.

వి—అక్కఱలేదు. నీవు సాయపడనక్కఱలేదు. రమ్మ. పాడుము.

అని విశ్వంభరుఁడు బలాత్కారముచేసెను.

భద్రముచేయునదిలేక మన స్సత్తగారివంకకుఁ బర్వాడుచున్నను శ్రుతివేసి యెట్లో పాడెను.

## ౫

“అబ్బా! ఇదేమికొంప? సానికొంపలోవలె నెల్లపుడును బాటలు పద్యములేకదా. వినుటచేఁ జెవులు చిల్లులుపోవుచున్నవి. ఈ కొకిచికి ముండ కాపాడుముండజట్టు. ఇఁక నేమి చెప్పుదును? ఆపత్రికలు, సంభాషణలు, వాదోపవాదములుచూడ మగవాండ్రను మించిపోవుచున్నారే. ఆఁడువారమను సిగ్గయినను లేదే. ఈసిగ్గుమాలినదానిని మా వెఱ్ఱివాఁడు తలపై నెక్కించుకొనుచున్నాఁడు. ఎట్లయినను నిట నుండి తప్పించుకొని పోదమన్న మావాఁడు వినఁడు. నన్నుఁబోనీఁడు. ఈనరకకూపములోఁబడి చచ్చిపోవుచున్నాను. అఱువదేండ్లముండను. మందనిచెప్పి యామాలనీళ్ళు పట్టుచున్నారు. ఏమి చేయుదును? ఓ దైవమా! నన్నిట్టి కష్టములలో నేలపడఁద్రోచితివి? అబ్బా!—దైవమా!—ఇంకను నన్నెందులకు జీవింపఁ జేయుచున్నావు!—అమ్మా!—బాబూ!—” అని యొక ముదుసలికాంత విసివికొనుచు, బాధపడుచు, నొక మంచముపై పండుకొని యిట్టటు దొరలుచుండెను.

అది విని కమల పర్వెత్తికొనివచ్చి "అత్తా! అదేమి? అట్లా యాసపడుచున్నారు! బాధ హెచ్చినదా యేమి? మరేమియు భయము లేదు. ఇదిగో! మీయబ్బాయి వెళ్ళునప్పుడు మీరాయాస పడినచో నీమందిమ్మని నాతోఁ జెప్పినారు. ఈమందు సేవింతురేని మీకు సుఖనిద్రలభింపఁగల" దని చెప్పుచు నొక గ్లాసులో మందు వోసి తెచ్చి చెంతనిలువఁబడి "అత్తా! ఇదిగో! ఈమందు సేవింపుఁ" డనెను.

ఆవృద్ధకాంత పెడమొగముపెట్టుకొని "తల్లీ! నాకేమియు నక్కఱ లేదు. నీమందున కొకదండము. నీకొక దండము. వెళ్లు, తల్లీ! ఈ మాలనీళ్ళు నేను ద్రావలేను. నీపనిపై నీవుపొ" మ్మని పలికెను.

క—అత్తా! అట్లందురేల? ఈయౌషధము మీకుఁ దప్పక పనిచేయును. ఇదిగో! త్రాగుఁడు. లేనిచో మీయబ్బాయి కోపింతురు.

వృద్ధ—మీయబ్బాయికే కోపమురానీ! నీకే కోపమురానీ! ఏమయినను నేనామందు ద్రావను.

క—మీరు పెద్దలు. అన్నియుఁ దెలిసినవారు. మందు రోగ నివారకము కాకపోవునా! అందులో మీయబ్బాయి యిచ్చినమం—

వృ—ఎవ్వరిచ్చినను సరియే. నాకక్కఱ లేదు.

క—మీ రట్లన్నచో నే నేమి చేయఁగలను? ఈమందును ద్రావినచో మీకాయాసము పోవును. సుఖనిద్ర యలవడును.

వృ—అబ్బా! నన్నుఁ జంపుచున్నా రేమి? ఇదెక్కడి సంతమ్మా! నన్ను నిలువనీయకున్నది. అని విసివికొనుచు లేచి కూర్చుండి మందు త్రావినట్లు నటించి, మంచమున కావలతట్టు పాఱఁబోసెను.

కమ—అత్తా! మీయట్టివా రట్లుచేయుట న్యాయము కాదు. మందు త్రావకున్న రోగము కుదురునా? అది తెలిసిన మీ యబ్బాయి......

వృ—చెప్పమ్మా! లేనిపోనివన్నియుఁ గల్పించి మా యబ్బాయితోఁ జెప్పుము. నాతల తీసివేయునా యేమి?

కమ—అత్తా! మీరట్లు భావింపకుఁడు. నేనన్నది వేఱుగాఁ దలంపకుఁడు. మీరు మందు త్రావకున్న రోగము కుదురదు. అంతియ కాని నేను మీమీఁద నేరములు—

వృ—తల్లీ! నాకుఁ దలనొప్పి పెట్టుచున్నది. నాతో దెబ్బలాటకు వచ్చితివా ఏమి? ఎందుల కట్లు రవరవలాడి రాలిపడిపోవుచున్నావేమి?

కమ—అత్తా! మీరట్లనుట తగునా? మీరు నాభర్తకువలె నాకును బూజ్యురాండ్రు. మీరు రోగవిముక్తలై తొంటి స్వస్థత నొందుదురుగాకయని దేవతల కనేకవిధముల మ్రొక్కుచున్నాను. మీవంటిపెద్దలు పూర్వపుణ్యము గలవారికేగాని లభింతురా?

వృ—చాలు. చాలు. నీ సక్కనిసయముల నే నెఱుఁగనా? రెండుపూటలు కావలసిన పదార్థము లమర్చిపెట్టు వంటలక్క సామాన్యముగా లభించునా?

కమ—మీకు సేవకురాలిని. మీ సేవచేసి కృతార్థురాలనుగానున్నాను. అంతియకాని వేఱుకాదు. నన్ను వండనిండని మిమ్మెన్నిసారులు వేఁడుకొన్నానుగాను.

వృ—అయ్యో! దైవమా! ఈ కిరస్తానీవాండ్ర చేతియన్నమును దిను దురదృష్టముకూడ నాకుఁ గల్గింపనున్నావా ఏమి?

కమ—అత్తా! నేను కిరస్తానీదానను గాను. నే నాచారముతో వండనేమోయని మీయభిప్రాయము కాఁబోలును. ఇదిగో! చూడుఁడు. మీరు చూచుచుండఁగనే శిరస్స్నానముచేసి తడిబట్టతో నే వండెదను. అందుకు నాకనుజ్ఞయిండు.

వృ—చాలు. చాలు. నీ చేతియన్నము తినలేను. నీవు స్నాన

మొనరించుట కాదు. వేయి ప్రాయశ్చిత్తములు చేసికొన్నను నీవు బ్రాహ్మణజాతిదానవు కాఁజాలవు. నేనే వండుకొని తిందును. లేక పోయినఁ బస్తుపడియైన నుందును గాని నీచేతియన్నము తినను.

క—అత్తా! మీ రిట్లాగ్రహించిన నే నేమి చెప్పఁగలను? పోనిం డట్లయినఁ గావలసిన వస్తువులన్నియు సమకూర్చియుంచెదను. రండు వండు కొండు!

వృ—ఏదో! చేసెదను. నీకెందులకు? నీపనికై నీవరుగుము. చేయునది లేక కమల యటనుండి కదలిపోయెను రుక్మిణి యామెను గాంచి "యత్తగారికి జ్వరము తగిలెగదా ఏమి? పాపము. చాల యాయాసపడుచున్నారు గాఁబోలును. నిన్నెందుల కంతగాఁ గసరుచున్నారు?" అని పలికెను.

"చెల్లీ! ఆమె వృద్ధురాలు. రోగపీడితురాలు. ఆపై పూర్వాచారపరురాలు. ఆచారము సరిగా లేదని యనుచున్నారు. నీవత్తగారిని జూచుచుండుము. నే నరిగి స్నానముచేసి వంటయత్నము చేసెదన"ని వెళ్ళెను.

రుక్మిణి యామెను సమీపించి "అత్తా! దేహస్థితి యెట్లున్నది? ఆయాసముగా నున్నదా యేమి? చూడండి. మీకాళ్ళు పీకుచున్న వేమో! పట్టెద"నని మంచముపై కూర్చుండి యామె పాదము లొత్త నారంభించెను.

ఆవృద్ధకాంత తన యడుగులు లాగుకొని "అమ్మా! నాకు నీ వేమియు సేవ చేయనక్కఱలేదు. వెళ్ళుము. నీయక్కకు సాయము చేయుము. పొమ్మా. నాకు నిద్రవచ్చుచున్నది. ఇతరుల స్పర్శ నాకుఁ దగిలెనేనినాకు నిద్దురపట్ట"దని నిండుముసుఁగు వోసికొని శయనించెను.

ఆముదుసలి కాంత విసువును, రోషమును, పంతమును రుక్మిణి

గ్రహించియు మాటాడక యామె నిజముగా నిద్రించు ననుకొని కొంచెము సేపట నిలిచి కమల చెంత కరిగెను.

ఇంతలో ముసలికాంత శయ్యనుండిలేచి నడువ నశక్తురాలయ్యు మెల్లగా మంచమును విడిచి స్నానమాడి వండుకొనుటకై బయలు దేఱెను. కాని యామె పడకటిల్లు దాటి నాలుగు బారలు దూర మేగునప్పటి కాయాసము హెచ్చి పోఁగాఁ గాళ్ళు దడఁబడ నేలఁ బడిపోయెను. ఆచప్పుడు విని రుక్మిణియుఁ గమలయుఁ బర్విడివచ్చి చూడఁగా నామె నిశ్చేష్టయై పడియుండెను. రుక్మిణి యది చూచి కమలను బిలిచెను. ఆమెయు దుఃఖితస్వాంతయై పరువు పరువున వచ్చి రుక్మిణి సాయమున నావృద్ధను జేతులపై దెచ్చి తల్పమున శయనింపఁజేసి తదీయమూర్ఛాపనోదనమునకై ప్రయత్నములు సలుపుచుండెను.

అంతట రామారావింటికివచ్చి, పిన్నమ్మను గాంచి, తదీయావస్థను విచారించుచు జరిగిన వృత్తాంతమునంతను విని యాముదుసలి మూర్ఖత్వమునకు లోలోనవగచుచు, నామె శరీరస్థితిని బరిశీలించి యామె కాకష్టము కేవలము బలహీనతచే, గల్గినదని గ్రహించి, వేఁడి పాలు తెప్పించి యామె నోటను బోసెను. ఆవృద్ధకుఁ గొంచెము మెలకువ వచ్చెను. తోడనే యామె మంచముమీఁదనుండి మైలబట్టలతోనే పాలు త్రాగినందులకు కేవగించుకొనుచు రామారావును గాంచి "అబ్బాయీ! వచ్చితివా! నేనీ నరకకూపమున నుండ లేను. మాయగ్రహారమునకుఁ బంపివేయుము. అక్కడ నదిలోఁ బ్రతిదినమును స్నానము చేసినఁగాని నా కీరోగము కుదురదు. నేను జాతిభ్రష్టురాల నగుట తప్ప నీమందులవలన నుపయోగములే"దని రోజుకొనుచుఁ బలికెను.

రామారా వది విని "అమ్మా! అట్లే చేయుదును. ఈ

యున్న పాలు గూడఁ ద్రాగినఁ గాని నీకు బలము కలుగదు. ఇది త్రావి యొక్కగడియ నిద్రింతు వేని నీకు స్వస్థతచేకూరును. అప్పుడు మాటాడు కొందము. మొలబట్టలతో బాలు త్రాగవచ్చునా యని సంశయింపకుము. నీవు స్వస్థవయిన పిమ్మటఁ బ్రాయశ్చిత్తము చేసి కొనియుఁ, దీర్ఘయాత్ర లొనరించియు నాపాపమును దొలఁగించుకొన వచ్చు"నని పల్కి యాపాలను ద్రావించి నిద్రింపఁజేసెను.

రామారావు గొంతసే పచ్చటనుండి మరల పనిమీద వైద్యశాల కరిగెను. కమలా రుక్మిణు లిరువురు నావృద్ధ పాదములను మెల్లగ పట్టుచునుండిరి. కొంతసేఁపటి కామె మేల్కొని తనకు పాదసేవ చేయుచున్న యాయువతులను జూచి యేవగించుకొనుచుఁ గాళ్ళు కూడఁ దీసికొని "నాకుఁ గాళ్ళు పట్టనక్కఱలేదు. పొండి. పనిచేసి కొం"డని పల్కి నివారించెను.

అట్టి దురవస్థకుఁ జిక్కియుండియుఁ దన మూర్ఖత్వమును విడువక తమ సేవను దిరస్కరించు నావృద్ధను గాంచి కమల "అత్తా! మీ రన్యథా తలంపకుఁడు. మీరు కష్టములోఁ జిక్కియున్నారు. మావంటి వా రుండుట యేల? కష్టకాలమునఁ గాచిపోయుటకే కదా! ఇట్టి మమ్మును దిరస్కరింపకుఁడు. మీరు కోపించినను సరియే? కాని నాపని నేను మాన''నని మరల నామె పాదములు మెల్లగ నంకించు కొని పట్టనారంభించెను. ఆ ముదుసలి మొదట లోననేదియో గొణుగు కొనెను. కాని క్రమముగా నూరకుండెను.

ఆవృద్ధకాంత యేమన్నను సహించి మాటాడక కమల యామెను సేవించుచునేయుండెను. ఆమె పట్నవాసపు వేషమును దొలఁగించుకొని పల్లెటూరు శ్రోత్రియ కాంతవలె వస్త్రాదులనుదాల్చి యప్పుడే యాఱ వైచిన మడుంగును దాల్చుచు, రెండుపూటలు స్నానముచేయుచు, మొగమున పసపుకుంకుమములు నిండుగాదాల్చి వర్తించుచుఁ బురని

వాసమొనర్ప నేతెంచిన మునికన్యకయోయనఁ జూపరకుఁ దోపిం
చుచు, నా ముదుసలికి వలయు పథ్యపానముల సమకూర్చుచుండెను.
కొంతకాలమున కాముదుసలికి రోగనివారణమయ్యెను. కొంచెము
కొంచెము బలము చేరుచుండెను.

ఇట్లనవరతము మిక్కిలి శాంతచిత్తయై, సదాచారనతియై తనయిం
గితమును గ్రహించి వర్తించుచు, తనకుఁగావలసిన పదార్థములప్పటి
కప్పుడే సమకూర్చి యిచ్చుచు, వేయేల? తనసేవయే పరమపురుషార్థ
ముగా నెంచుకొని విసుగువిరామములేకుండ నింటఁబనిచేయుకమల
విషయమై యావృద్ధ మనస్సు మాఱఁజొచ్చెను. క్రమక్రమముగా
నామెకోపము ప్రేమముగా మాఱఁజొచ్చెను కమలాయని ముద్దుగాఁ
బిలువఁజొచ్చెను. కోడలుచేయుపనుల నిప్పుడుమెచ్చుకొన నారంభిం
చెను. కొంతకాలమునకుఁ గోడలిని విడిచిపోవుటయే యామెకు దుర్ల
భమనిపించెను. ఈవిషయములో వింతయేమున్నది? వజ్రమువంటిఘన
పదార్థమునుగూడ మార్చునట్టికాలమున కాముదుసలి కాంతహృద
యము లెక్కయా?

౬

ఒకనాఁడు కమలా రుక్మిణులు భుజించి చక్కఁగ నలంకరించికొని,
మోటారుబండిపై గూర్చుండి, కేమెలు దొరసానిని జూడఁ బోయిరి.
సుదర్శనరావు కచ్చేరీ కరుగుటచే దొరసాని యొక్కతయే యింట
నుండెను. తమ కొక పరిదర్శన మీయవలయునని యాయువతులు
దొరసానికి వార్త నంపిరి. హైందవులయందును, నందులో హైందవ
స్త్రీలయందును మిక్కిలి హేయభావముగల యాసాని వారికి దర్శన

మునఁగ నిష్టములేనిదయ్యు, వారిని బరిహసించి పంపఁదలచి లోనికి రమ్మని వార్త నంపెను. కమలా రుక్మిణులామె గది ప్రవేశించిరి.

నిజము చెప్పవలసి వచ్చినప్పుడు కమలా రుక్మిణు లధిక సౌందర్యవతులని చెప్పక తీఱదు. ఇరువురును విద్యావతులు, బుద్ధిమతులు, ఆంగ్లభాషను జదువను మాటాడను జాలినంత పాండిత్యముగలవారు. లోపలఁ బ్రవేశింపగనే యాయువతులయాభరణకాంతులును, వానిని మించి నిర్గమించు శరీరకాంతులును, నాదొరసానిని ముగ్ధను గావించెను. విశాలములగు వారితళుకు బెళుకు చుఱుకుచూపులాగదికి నున్నపుపూతపూసి నట్టులుండెను. హైందవస్త్రీలకు గౌరవముచేయవలెనాయని దురభిప్రాయముతో నున్న దొరసానివారిని జూచి యిఁక గుర్చీపై కూర్చుండలేకపోయెను. ఆమె వెంటనే లేచి వారికి మర్యాదలు సల్పి యుచితాసనములఁ గూర్చుండ నియమించెను. వారాంగ్లభాషతో నిట్లు ప్రసంగించిరి.

దొర—మీరువచ్చిన పనియేమి?

కమల—మీదర్శనముచేసికొని యొకపని నెఱవేర్చుకోఁదలఁచి వచ్చితిమి.

దొర—అదేమి?

క—సుదర్శనరావుగారు మీప్రియులు గాదా!

దొ—అవును.

క—ఆయన గొప్పన్యాయవాదులని యీపురమునఁ బ్రసిద్ధిగాంచినారు.

దొ—అయిననేమి?

క—మేమొక వ్యాజ్యెము చేయఁదలచినాము. మాపక్షము వారవలంబించి పనిచేయవలయునని కోరుచున్నాము. మేము స్త్రీలము. పరపురుషునియెదుటఁ గూరుచుండి వివాదాంశములన్నియుఁ

జెప్పలేము. మీతో మనవిచేసెదము. మీరు వారితోఁ జెప్పి మాకార్యము నెఱవేర్చునట్లు చేయవలెను. అడిగినంతధనము నొసంగెదము.

దొ—(నవ్వుచు) బాగు. బాగు. మీరుపురుషునితో మాటాడరా?

క—పరపురుషునితో —

దొ—పురుషులుగూడ నట్లే పరస్త్రీలతో మాటాడరా?

క—ఉత్తములయినచో—

దొ—ఇదేమి నిబంధనము? అపరాధములేని శిక్ష.

క—కావచ్చును. అది మాహిందూసాంప్రదాయము.

దొ—మీసాంప్రదాయములు, మీయాచారములు కేవల మనాగరకములు. దానికేమి? మీవివాదాంశమేమి?

క—(రుక్మిణినిజూపి) ఈమె నాసోదరి. దురదృష్టవశమున నీమెకుఁ దుంటరిభర్త లభించినాఁడు. అతఁడీమెను విడిచి వేఱొకకాంతను జేపట్టినాఁడు. ఇప్పటికి రెండుమూఁడు వత్సరములయినది. ఈమె పోషణముకై యొకదమ్మిడీయైన నియ్యలేదు. కావున నీమెకు భర్తవలన భరణమిప్పింపుఁడని కోర్టువారితో మనవి చేసికొనవలెను.

దొ—భర్త యీమెను విడిచి వేఱొకతెను వరించెనా? అట్లయిన నీమెను వేఱొక పురుషుని వరింపుమనుము. దీనికి దావాయేల?

కమ-రుక్మి—(నవ్వుచు) అది మీ సాంప్రదాయము. మాలో నొక స్త్రీకొకఁడే భర్త. అతఁ డామెను విడిచినను సరియే. లేక దైవవశమున లోకాంతరగతుఁడైనను సరియే. అతఁడే యామెకు భర్త.

దొ—ఈ నిబంధనము పురుషులలోఁ గలదా?

క—సద్గుణవంతులయెడ మాత్రమే కలదు.

దొ—ఇది యక్రమము. మీలో పురుషులకే కాని స్త్రీలకు స్వాతంత్ర్యము లేదు.

క—అది సరికాదు. ఇరువురకును స్వాతంత్ర్యము సమానమే. ఒక్క విషయములో మాత్రము లేదు. అది సత్సంతానలబ్ధికై పునర్వివాహము లేకుండుట.

రుక్మిణి—మా యక్క చెప్పినది సరిగానే యున్నది. కాని నిజమాలోచించిన మాలోఁ బురుషులకంటె స్త్రీలకే యెక్కుడు స్వాతంత్ర్య మున్నదని నా తలంపు.

దొ—(నవ్వుచు) నీవు కేవలము వెఱ్ఱిదానివలె నున్నావు. నీ స్త్రీజాతి కుండవలసిన స్వాతంత్ర్యము నీవే వలదందువేమి? అందుచేతనే భర్త విడిచిపెట్టియున్నాఁడు.

రు—భర్త విడుచుట కనేక కారణము లుండవచ్చును. దానికేమి? కాని మాలో స్త్రీలకే స్వాతంత్ర్యము.

దొ—ఛీ ఛీ! అది సరికాదు. మీరు చదువుకొన్నను మీ మూఢత్వము వదలుకొనకున్నారు. ఆవిషయమై యీపురమున నొక స్త్రీ జనసంఘమును స్థాపించుచున్నాము. స్త్రీలకు స్వాతంత్ర్యమును సంపాదింపవలెను.

రు—అమ్మా! క్షమింపుము. నే నిట్లనుచున్నానని కోపింపకుము. మా హిందూమత సాంప్రదాయము లనినఁ గొంచె మేనియు నెఱుఁగని మీవంటివారు జోలి కల్గించుకొని వర్తించుటచేతనే యవి వినాశోన్ముఖ మగుచున్నవి. ఆ విషయమై మీరు శ్రమపడకుఁడు. మా మతాచారములను నశింపఁజేయకుఁడు.

దొ—ఆఁ-ఏమనుచున్నావు? మీమతాచారములు నే నెఱుఁగననియా?

రు—నిన్నగాక మొన్న యీ దేశములోను దేశవాసుల

తోను బరిచయము గల మీ కవి దురవగాహములు. అవి యెట్టివియో గ్రహింపనేరని మీరు వాని నెట్లు బాగుచేయఁగలరు?

దొ — నాకీ దేశపరిచయము మొన్న మొన్ననే గల్గినను, ఇది వఱకే మీ దేశ సంఘము లాచారముల విషయమై గ్రంథములలోఁ జదివితిని. నాకుఁ దెలియుకేమి? మోక్షముల్లరు మీ మతగ్రంథము లన్నింటిని మా దేశభాషలోనికి మార్చినాఁడు.

రు — అవుఁగాక. అవి మా మతసాంప్రదాయార్థములను సరిగా వెల్లడింపలేవు. నిరుక్తాదిప్రమాణములను బట్టి వేదాదుల కర్థనిర్ణయము చేయవలెను. అట్లు కానిచో విపరీతార్థమే లభించును. ఇంతే కాదు. కావ్యాదిరూపములగు కథలే యొక భాషలో నుండి వేఱొకదాని లోనికిఁ బరివర్తింపఁబడినవు డెన్నియో లోపము లుండును. అట్టి వానిలో లోపము లున్నను బాధాకరములు కావు. మతవిషయమై యట్లు కాదు. పరివర్తనమునందు లోపము లున్నచో జదువరులు విపరీతాభిప్రాయములతో నందియని గ్రహించుటకు మాఱు పంది యని గ్రహింతురు. అట్టి గ్రంథములు చదివినంత మాత్రమున మా మతసాంప్రదాయము లెట్లు తెలియఁగలవు?

దొ — చాలు. చాలు. చాల నధికముగాఁ బ్రసంగించు చున్నావే? మీ దేశవాసులందఱును మోక్షముల్లరు మొదలగు భాషా పరివర్తకుల ననేకముఖముల నుతించుచుండ నీవిట్లందువేల?

రు — ఇతరమతస్థులు దురవగాహములగు మా వేదములను మామతశాస్త్రాదులను నతికష్టమున నింతో యంతో చదివి తమభాష లలోనికి మార్చినారన్న యంశమున కేపొగడ్త. అంతియకాని మూల ములందున్న విశేషాంశము లన్నియు సరిగాఁ బరివర్తింపఁబడినవని కాదు. ఇంతయేల? హైందవేతరలగు మీ రైదెనను వ్రాయుఁడు. మీకు నట్టిపొగడ్త సంభవించును.

దో—నీవు చెప్పినది సరికాదు. గ్రంథమునందు బ్రాశస్త్యము లేనిచో నెవ్వరు పొగడుదురు?

రు—ప్రాశస్త్యమును బరిశీలింపవలసినప్పుడు మూలగ్రంథ విమర్శనముకూడఁ గావలయును. అట్లుచేసినవా రెవ్వరున్నారు? పరివర్తనగ్రంథము మాత్రము చదివినచో బాగున్నదనియే తోఁచును.

దో—నీమాటలు విపరీతము. గ్రంథప్రాశస్త్యము గ్రహించినప్పుడే యందు లోకుల కామోదము హెచ్చగును. ప్రజామోదమును దెలిసికొనవలెనన్న గ్రంథప్రచారమును గమనింపవలెను. మా మేయోకన్య వ్రాసిన గ్రంథము చూడుము. ఎంత స్వల్పకాలములో నెన్ని ప్రతులు చెల్లినవో!—

రు—ఓహో! మీరు పొరపడుచున్నారు. ప్రాశస్త్యమును బట్టియే యన్ని ప్రతులు ప్రచారమునందున్నవని యనుకొనుచున్నారా? తప్పు. అందుచేఁగాదు. మీకుఁ గాగితములు చౌక. అచ్చుయంత్రములు వేనవేలుగలవు.

ముద్రాపణకు ధనమిచ్చువారు లేరు. ఇఁక నెన్ని ప్రతులయిన నచ్చొత్తింపవచ్చును. ఇఁకఁ బ్రచారము విషయమా? ఊరకయిచ్చినచో నాప్రతులచే దేశముకప్పఁబడును. అంతమాత్రముచే గ్రంథము ప్రశస్తమైన దనుకొనుట పొరపాటు.

దో—ఆమె సరిగా వ్రాయలేదందువా ఏమి?

రు—పాపము, ఆమె యత్నము మంచిదే! మా హైందవజాతిని లోకమునఁ బ్రకటింపనెంచినది. కాని యామెకు హైందవమతసాంప్రదాయము లెట్లు తెలియఁగలవు? హిందూదేశమునఁ బుట్టి హైందవమతగ్రంథములను, సాంప్రదాయములను మిక్కిలి పరిశీలించినవారికే కష్టతమమగు నాకార్యము పాప మేసముద్రాలకడనో పుట్టి తుదకు హిందూమతగ్రంథముల వాసననైనను నాఘ్రాణింపని మేయోకన్య

కెట్లు సాధ్యమగును? ఆగ్రంథమునిరాధారముకనుకనే వేనవేలు ఖండ
నలు, విమర్శనములు పెక్కులు ప్రకటింపఁబడుచున్నవి.

దొ—ఆమె మీహైందవస్త్రీలకుఁ బావిత్ర్యములేదని సకార
ణముగా వ్రాసినది. అందుచే మీకుఁగోపము గల్గినది కాఁబోలు.

రు—లేదు. లేదు. మాకుఁ గోపమందులకుఁ గల్గలేదు. అస
మర్థులగు వారట్టిపనికిఁ బూనుకొనినందులకేకోపము. ఆమె వ్రాసినం
తమాత్రమున మాపావిత్ర్యము పోవునా? పంచాంగము చించివేసిన
గ్రహనక్షత్రాదులు నశింపవు. నిజముచెప్పవలసి వచ్చినపుడు, స్త్రీల
పావిత్ర్యము విషయమై చర్చింపవలసినపుడు, సకలప్రపంచములో
మాహైందవస్త్రీలకుమాత్రమే యట్టిసద్గుణము కలదు. మతసాంఘిక
నియమముల విషయమై హిందూదేశము సర్వోత్కృష్టమని మీపం
డితులే యంగీకరించినారు. కల్పితములగు పురాణగాధలను గొన్నిం
టిని సత్యమని భ్రమించి తెలియక మీమేయో కన్య వ్రాసినది.

దొ—(నవ్వుచు) దీనికేమిగాని మీలో స్త్రీలకే యెక్కుడు
స్వాతంత్ర్యము గలదన్నావు. దానినెట్లో విశదపఱుపుము.

రు—ఇట్టి విషయములు నిర్ణయింపవలసి వచ్చినపుడు మర్యా
దావంతులగు సత్ప్రవర్తనులఁ బట్టియే చేయవలయును. దుర్గుణులను
బట్టియు, దుష్టాత్ములనుబట్టియు కాదు.

దొ—కావచ్చును.

రు—ఉత్తమ హిందూకుటుంబములందు నడచు వృత్తాంతము
మీకుఁ దెలియకపోవచ్చును.

దొ—చెప్పుము.

రు—మాలోఁ బురుషులు నిమిత్తమాత్రులయి సకల వస్తువు
లను నేకరించికొనివచ్చి గృహరాజ్యము సుసంపన్నముగాఁ జేయు
చుండ, స్త్రీలా వస్తుపరికరమంతయుఁ దమకు దమ పురుషులకును,

బుత్త్రపుత్త్రికాది బంధువులకును, బరిచారకులకును నుచితక్రమమున వినియోగించి గృహరాజ్యమును బాలించుచుండును.

దొ—కై దీవలె నింటఁబడియుండుట స్వతంత్రతయా?

రు—బయట విచ్చలవిడిగాఁ దిరుగుటమాత్రము స్వాతంత్ర్య మనిపించుకొనునా? తా మొనర్పవలసిన పనులలో స్వాతంత్ర్యము న్నదా లేదా చూడవలయును. అట్లుకానిచో జక్రవర్తిగూడ నస్వతంత్రుఁడే. ఒక్క పరమేశ్వరునికిఁదక్క నితరుల కాపేరు చెల్లదు.

కేమెలుదొరసాని యిక రుక్మిణితో వాదింప నసమర్థ యైనట్లు తోచెను. ముఖవికాసము తగ్గెను. ఆంగ్లేయస్త్రీలమన్న గర్వము పటాపంచ లయ్యెను. హిందువులలో గూడ నుత్తమస్త్రీలు కలరని గ్రహించెను. హైందవజాతి గూడ తక్కిన జాతులలో గ్రహింపఁదగిన దని తలంచెను. మొట్టమొదట నామె ముఖమునఁ దాండవించు గర్వాసూయామాత్సర్యంబులు మాయమయ్యెను. అది చూచి కమల దొరసానితో "అమ్మా! ఈ వాదముతో మన కెందుకు? మావచ్చిన పని మీరు నిర్వహింపవలెను. సుదర్శనరావుగారితోఁ జెప్పవలెను. మాకీ యుపకారము చేయక తీఱదు—

దొ—అట్లే చేసెదను.

క—అమ్మా! అడుగ మఱచితిని. మీ సంఘములో నేక కాలమున నిరువురు స్త్రీలను బురుషుఁడు వరింపరాదఁట! సత్యమా?

దొ—అవును.

క—సుదర్శనరావుగారు మి మ్మెట్లు వరించెను?

దొ—ఏమీ! ఆయన తొలిభార్యను విడిచిపెట్టినాఁడు.

క—మాలో నట్లు కాదు. విడిచిపెట్టుట కవకాశము లేదు. దంపతులలో నొకరియం దొకరి కిష్టము లేకపోయినను సరియే బ్రదికి నంతకాలమును వారు భార్యాభర్తలే యగుదురు.

దొ—సుదర్శనరావు భార్య యున్నదా?

క—లేకేమి? ఇంతవఱకు మీతో వాదించిన యీ రుక్మిణియే యతని భార్య.

దొరసాని గతుక్కుమనెను. మొగము పొగచూరిన ట్లయ్యెను. రుక్మిణికిఁ దానే విషయమునను సాటి కాజాలనని గ్రహించెను. ఇఁక మాటాడక యాలోచనలో మునిఁగి యుండెను.

అప్పుడు కమల "అమ్మా! మేము వచ్చి చాలసే పయినది. ఇఁక మాకు సెలవిమ్ము. పోయి మఱియొకనాఁడు సావకాశముగ వచ్చెదము. సుదర్శనరావుగారితో నీ దావావిషయమై స్పష్టముగాఁ జెప్పు" మని పలికి సెలవు గైకొని వెడలిపోయిరి. దొరసాని కుర్చీకిఁ జేరఁబడి యాలోచనాధీనమనస్కయై మిన్నుఁ జూచుచుండెను.

౭

శ్యామసుందరుఁడు లుబ్ధాగ్రేసరుఁడు. ధనమే యతనికి ముఖ్యము. అదియే యతనికి దైవము. అదియే యతనికి మర్యాద. అదియే యతనికిఁ బ్రాణము. ఆతని భార్య సుబ్బమ్మ లుబ్ధత్వమున నతని మించిపోయినది. ఆ దంపతు లొకవేళఁ దమ ప్రాణముల కపాయము సంభవించినను సహింపఁజాలుదురు కాని ధనమున కేమేని నాశనము సంభవించిన సహింపలేరు. శ్రీనివాసరావు కట్న మెచ్చుగా నిచ్చెద ననుటచేతనే సిద్ధమైన పెండ్లికి విఘాతము కల్గించి వారు తమ కొడుకునకు భద్రను వివాహ మొనర్చినారు. కాని వారి యభీష్టము నెఱ వేఱలేదు. శ్రీనివాసరా వొక దమ్మిడీయైనను నిచ్చిన పాపమునఁ బోలేదు. రామావధానిని సాధింప నడుకట్టి శ్యామసుందరుఁ డగ్ర

హారవాస్థవ్యుల పక్షమవలంబించి రామావధానిపై పెక్కు లభియోగ
ములు దెప్పించెను. తన వియ్యంకుఁడగు శ్రీనివాసరావు బంధుత్వ
మును బట్టి తమవలన ధనము పుచ్చుకొనకుండగనే కచ్చేరిపనులు
చక్కబెట్టునని శ్యామసుందరుఁడు భావించెను. కాని శ్రీనివాస మహా
పైసలుదగ్గఱనుండి లెక్కించి తుద కెట్లయిన నేమి కట్నము నాలుగు
వేలకును సరిపడునట్లు చేసెను. శ్యామసుందరుఁడు న్యాయప్రకార
ముగా శ్రీనివాసమునుండి ధనము రాఁబట్టుట కవకాశము లేకపోయె
ను. ఇఁక నేమి చేయుట? ఇఁక నతని కూతురగు భద్రను హింసించి
యతని యింటికిఁ బంపివేసి, కొడుకునకు మఱియొక పెండ్లి గావించి
శ్రీనివాసమునకు సంతాపము గల్గింపవలెనని శ్యామసుందరుఁడు నిశ్చ
యించెను. కాని కుమారుఁడా భద్రను మిక్కిలి ప్రేమించుచుండు
టచే నతఁ డింట నుండగా నప్పని కవకాశము చిక్కదని వ్యవహార
నెపమునఁ గుమారునిఁ జెన్నపురికిఁ బంపివేసెను. శ్యామసుందరుఁడు
భార్యతో నెట్లయినను గలహము పెంచి భద్రను బుట్టినింటి కంపివేయు
మని చెప్పెను. మొదటనే కోతి. ఆపయి దానికి మద్యము ద్రావిం
చిన నిఁక దాని వికారములు వర్ణింపనగునా? అట్లే స్వభావముచేతనే
సుబ్బమ్మ క్రూరురాలు. ఆపై భర్తచే బోధింపఁబడుచున్నది. ఇఁక
నామె యవస్థ వేఱుగఁ జెప్ప నక్కఱలేదు.

సాయంసమయమున భద్ర వంటచేయుచుండెను. పోగపునకై
నూనెగిన్నె యొక మూలనిడి యామె యన్నములో గంజి వార్చు
చుండెను. అంతట రెండుపిల్లులు దెబ్బలాడి యా నూనెగిన్నెను దొర
లించెను. గిన్నె తిరుగఁబడెను. గంజి వార్చుచున్న భద్ర కేమిచేయు
టకును దోఁచలేదు. చేతిలోని యన్నపుగిన్నెను వదలివచ్చినచో
నన్నము గంజిపాదువును. దానివలన నత్తమామలవలనఁ జీవాట్లుపడ
వలసివచ్చును. లేక చేతిపని పూర్తియగునంతవఱకు నూరకున్నచో

నూనె నేల నింకిపోవును. అయినను భద్ర త్వరపడి గంజివార్చి నూనె నెత్తఁబోయెను. కాని యాలస్యమగుటచే నూనె చాలవఱకు ఇంకి పోయెను. పోగవునకు నూనె చాలకపోవుటచే నట్టిమీద వేఱొక గిన్నెలోనున్న నూనె దీసికొనుచుండెను. కలహమునకు సమయమును వెదకుచున్న సుబ్బమ్మ త్వరగా వంటయింటిలోనికి వచ్చి "ఓసీ! భద్రా! నూనెదీయుచున్నా వెందులకు? ఉదయమునఁ దీసితినిగాదా? గిన్నెలో నిండుగా నూనెయుండవలెనుగాదా?" అని యడిగెను.

భద్ర — నూనె గిన్నెనిండ లేదు. మీరుదయమున దీసిన దానిలోఁ గొంతవఱకు మన యభ్యంజనముల కయినది. మఱికొంత మధ్యాహ్నభోజనముల కయినది. మిగిలిన దెంతో లేదు. ఈపూటకుఁ జాలియుఁజాలక యున్నది.

సు — అసత్య మాడకు. భోజనము లయినపిమ్మట నూనె గిన్నెను నేను జూచితినిగాదా! గిన్నెకు సగమువయిగా నున్నది. ఏమి చేసితివో తెలియదు.

భ — అత్తా! నూనెను నేనేమి చేయుదును? అమ్మికొందునా యార్చికొందునా? పిల్లు లాగిన్నెను దిరుగఁద్రోసినవి. నూనెను చాలవఱకే త్రితినిగాంచి కొంచెము నేల నింకిపోయినది.

సు — అట్లు చెప్పవేమి? ఓసీ! నాంచారీ! ఎంతపాడిచేసితివే! పిల్లు లెందులకుఁ దిరుగఁద్రోసినవి?

భ — అవి దెబ్బలాడి.

సు — నూనె గిన్నెక్రింద నెందులకున్నది?

భ — గంజివార్చగనే కూరపోగపవలెనని సామగ్రియంతయును దగ్గఱగాఁ బెట్టుకొన్నాను.

సు — (కోపముతో) ఓసీ! పోగరుఁబోతా! నిష్కారణముగా నూనెయంతయు నేలపాలుగావించితివా? ఓసి! నీమొగ మీడ్చ.

ముందుగా నూనెగిన్నె నెందులకుఁ దీసినావు? నేను మొదటనుండియుఁ జెప్పుచునే యున్నాను. పట్టవాసపు పిల్లలకుఁ దెలివి తేట లుండవు. గర్వమునకు మేరయుండదు. చుక్కలు చూచుచుఁ దిరుగుదురు. నీవు మావంటి సంసారులయిండ్ల నుండఁదగవు. ఎక్కడికని యేడ్వను. పని చేసిన పాతికవట్టము. ఇట్టి పనికిమాలిన పాడుపుండతోనే బ్రదుక లేనమ్మా! పనిచేయింపకుండ దీని నెవ్వరు మేపఁగలరు? పవలెల్ల గొడ్డులాగునఁ బనిజేయ నాతరమా? ఓసీ! పనికిమాలినదానా! రా. ఇఁక బయటికిరా! నేనే వండుకొందును.

భ—అత్తా! ఏదో పొరపాటువచ్చినది. పిల్లులు తిరుగఁ ద్రోయునని నే నెఱుఁగుదునా? వంట పూర్తియైనది. కూరపోగవు మాత్రమే తరువాయి.

సు—(చటాలున తడిబట్ట గట్టుకొనివచ్చి, భద్ర చేతిలోని గిన్నెను లాగుకొని) పొమ్ము. ఇటనుండి పొమ్ము. తినుటకేకాక పాడు చేయుటకుఁగూడ నెవ్వరు సంపాదింపఁగలరు?

భ—అత్తా! అంత కోపమెందులకు? పోయిన నూనె నాలుగు గరిటెలకంటె నెక్కుడుండదు. రెండురోజులపాటు నూనెను వాడుకొన కుండ నుందును లెండు.

సు—అంత నూనెనుగూడ దీయుటకు రెండు రోజులు కాదు. పదిరోజు లయినను జాలదు.

భ—పోనిండట్లే కావింతును. కలహింపకుఁడు.

సు—ఏమీ! నేను గలహించుచున్నానా? నీవు ముద్దరాలవా? పాడుపనిచేసి యింకను మాటాడెద వేమి?

భ—నేను బుద్ధిపూర్వకముగాఁ జేయలేదు.

సు—చేయకేమి? ఈయిల్లు మూఁడురోజులలో గుల్లచేయఁ దలపెట్టితివి. ముందుగానే మేల్కొనుట మంచిది. ఓసీ! నీవీ యింటికిఁ

బనికిరావు. పొమ్ము. ఇక్కడనుండి పోతివా! హాయిగా బ్రతుకుదుము—

భ—అత్తా! ఇది ప్రథమాపరాధముగా భావించి క్షమింపుఁడు.

సు—ప్రథమము లేదు, ద్వితీయము లేదు. నీవెన్ని చెప్పినను నేను వినను. పొమ్ము.

భ—ఎక్కడికిఁ బోవుదును ?

సు—నీయిష్టమువచ్చినచోటికి.

భ—నాఁ కిష్టమువచ్చిన దిదియే.

సు—ఇదికాక.

భ—ఇంతకంటె మఱి యిష్టమగునది లేదు.

సు—(మండిపడుచు) ఓసీ! మొండివాదము వాదించిన నేను సహించుదానను గాను. సిగబట్టి యీడ్పించెదను.

భ—మీ రేమిచేసినను నేను సహింపవలసిన దే!

సు—నీవు సహింపనువలదు. నీవిచ్చట నుండనువలదు.

భ—ఇటనుండక యెక్కడికిఁ బోవుదును ?

సు—మీ పుట్టినింటికిఁబో.

భ—పుటినింట నుండవలసినకాలము పోయినది. ఇదియ త్తింట నుండవలసినకాలము.

సు—కాని నీవు మాకుఁ బనికిరావు.

భ—పనికి రాకపోయినఁ బాఱవేయుటకుఁ బుచ్చిపోయిన వంకాయను గాను.

సు—అంతకంటెను హీనురాలవు.

భ—అయినను మీరు భరింపవలసినదే. ఒకమాఱు వివాహమైనపిమ్మట విడుచుటకును, మానుటకును మీ యిష్టముకాదు.

సు—మేము కాకపోయిన మాయబ్బాయియే విడిచిపెట్టును.

భ—ఆయనయైనను విడిచిపెట్టిన పెట్టవచ్చునుగాని నన్నుఁ

బోషింపకతీఱదు.

సు—ఎట్లు తీఱదో చూచెదనుగాక. ముందుగా నీరాత్రియే నీకు నన్నము పెట్టను.

భ—పస్తుండినైనను నేనిచ్చటనే యుండెదను.

సు—నేనిచ్చట నుండనీయను.

భ—ఉండనిచ్చుటకును, మానుటకును మీరెవ్వరు? మీరును నావలెనే వేఱొక యింటనుండి వచ్చినవారు. నన్నుఁ బొమ్మనుట కును మానుటకును మీకేమియు నధికారము లేదు. మీకుమారుఁడు వచ్చినపిమ్మట నతఁడు పొమ్మన్నఁ బోయెదను.

సు—ఓహో! పిట్టకూఁతపట్టుచున్నదే! నాకవన్నియు బనికి రావు. నీభర్త వచ్చినప్పుడు నీవుగూడ రావచ్చును ముందుగా నిల్లు విడిచిపొమ్ము.

భ—నాభర్తగారు నన్నీగదియందుండు మన్నారు. నే నట్లు చేయకమానను. మీ రన్నము పెట్టకపోయినఁ బోనిండు.

సు—నీ మగనికిమాత్ర మిం దధికార మేమున్నది? నీ కీగది నిచ్చుట కతఁ డెవ్వఁడు?

భ—అతఁ డెవఁడు? మీకొడుకు. నాభర్త.

సు—నీవు ముదురమాటలాడిన నేను సమ్మతింపను. లెమ్ము. పొమ్ము—ఆఁ—పోవేమి?

భ—ఊరకుందును.

సు—భద్రచేయిపట్టుకొని వీధిలోనికీడ్చి తెచ్చి నీవిఁక లోపలికి రావలదు. అని తలుపు బంధించుచుండెను.

భ.—"నే నిక్కడనే యుండెదను. నాపతియింట నాకుండుట కధికార మున్నది. పస్తువడి చావవలసినను నాకిదియే చోటు. నాకర్మ వశమున నేను పిశాచమనైనను, నా కిదియే చోటు" అని పలికి వీధి

యరుగుపై కూర్చుండెను.

సుబ్బమ్మ తలుపు బంధించుకొనునప్పు డిరుగు పొరుగు లమ్మలక్కలు సుబ్బమ్మ కనేకవిధముల నుపదేశించిరి. కాని యవి పెడచెవినిబెట్టి కూటము బంధించి సుబ్బమ్మ వెడలిపోయెను. భద్రతో మాటాడిన సుబ్బమ్మ యెక్కడ కలహించునో యని చూడవచ్చిన స్త్రీలు వెడలిపోయిరి. పాపము భద్రయొకతెయే యరుగుపై పైటకొంగుబఱచుకొని కన్నులు వర్షకాలమేఘముల వడువున సంతతధారగా వర్షించుచుండ శయనించెను.

తన యత్తగారు కోపమున నట్లుచేసినను దన మామగారింటికి వచ్చినపిమ్మటనైనను దన్ను మరల లోనికి రప్పింపకపోరని భద్ర తలంచెను. కాని సుబ్బమ్మకంటె నతి క్రూరుఁడయిన శ్యామసుందరుఁ డందులకు వెఱచునా? ఎంతసేపు నిరీక్షించినను దన యత్తగారుగాని మామగారుగాని వచ్చి లోనికిఁ దీసికొనిపోలేదు. అంతతో భద్ర యాశ యడుగంటెను అయినను నామె యటనుండి కదలలేదు. రాత్రి యొక యామ మతిక్రమించెను. ఇరుగు పొరుగుల వారందఱును నిద్రించిరి. పాపము భద్ర చిన్నపిల్ల—అసహాయ—దుస్సహదుఃఖాక్రాంత—ఎటుచూచినను మృత్యుదేవతావక్త్రగహ్వరంబు చందంబున భయంకరమగు గాఢాంధకారము. భద్ర తన దురవస్థను దలంచుకొనెను. ఈ దుఃఖభారము వహించి సంతత సంతాపమందుటకంటె మృత్యుదేవత కోరపండ్లక్రిందఁబడి నలఁగుటయే సుఖకరమని నిశ్చయించెను. సమీపమునఁ బ్రవహించు నదిలోఁబడి నశించుట మంచిదని మొదట నాలోచించెను. కాని యేటఁబడి కొట్టుకొనిపోయి యెక్కడనో చచ్చుటకంటెఁ దనపతి యింటిపంచను బంచత్వము నొందుటయే మేలని భద్ర నిశ్చయించుకొనెను. ఆమె మెలమెల్లగ లేచెను. తన పైటచెఱగు కంఠమున కురివోసికొని యాచెఱఁగింటి

పంచకు గట్టెను. ఈమె సాహసమును గాంచి యాశ్చర్య నిశ్చేష్టయగు నట్లు ప్రకృతి నిశ్శబ్దముగ నుండెను. భద్ర దైవమును బ్రార్థించు కొనెను. పతిదేవతను స్మరించు కొనెను. ఇఁకఁ జచ్చుటకు సిద్ధపడి యుండెను.

రాత్రిముఖమునఁ బొలముకాపుండి చేతి కర్రను జప్పుడు చేసి కొనుచు నా కటికిచీఁకఁటిలో నొక వ్యక్తి యాదారినిబోవఁ దటస్థించెను. అతనికిఁ బంచచప్పుడు వినవచ్చెను. అతఁ డావంకఁ జూచెను. ఎవ్వరో యట దిరుగుచున్నట్లు గ్రహించెను. పలుకరించెను. కాని భద్ర మాటాడలేదు. ఆపురుషుని నిర్బంధము లేకుండఁ జచ్చుటకే యామె నిశ్చయము. అంత నాపురుషుఁడు గంభీరస్వరముతో "అట నున్నవా రెవ్వరు? చెప్పుడు, లేనిచో నే నూరకుండువాఁడను గాను. ఈ బడితతో నేలఁ బడఁగొట్టెదను. తరువాత విచారించినను లాభము లే" దని పల్కెను.

ఆమాటసవ్వడినిబట్టి యాపురుషుఁడు తన పెదతండ్రియగు రామావధాని యని గ్రహించి, గద్గదఖిన్నకంఠముతో "పెదనాయనా! నేను భద్రను" అని పల్కెను.

రా—భద్రా!

భ—ఏమి తండ్రీ!

రా—ఆ చీఁకటిలో నేమి చేయుచున్నావు?

భ—నా కష్టాత్మకు సుఖము గల్గించుచున్నాను.

రా—ఆఁ. ఏమీ! ఎందుల కా సాహసము? భద్ర తన వృత్తాంతము కొంత యతనికిఁ జెప్పి "పెద్దనాయనా! మా తండ్రి చదువుకొన్నవాఁడే. కాని యవివేకి. మాయందమితప్రేమము కలవాఁడే కాని భావికాలవిపదలను గ్రహింపనేరని మందబుద్ధి. చూచితివా? ధనసంపన్నులలోపలఁ బడవేసినచోఁ దన కూతులు సౌఖ్య

మందఁగలరని యతని దురభిప్రాయము. తత్ఫల మిది. తన కుమారిక పలుకష్టములు పడి దిక్కుమాలిన పక్షివలెఁ జచ్చునని యతని కేమి తెలియును? నా ప్రారబ్ధకర్మమునకు పగవక తక్కినవారిని నిందించిన లాభ మేమి? నే నీ పంచను మరణము నొందినఁ బెక్కురు సంతసింతురు. పలువురకు నా బాధ లేకుండఁ జేయుట మంచిదని నా యభిప్రాయము" అని దుఃఖించెను.

రా—కుమారీ! నీవు సాహసము వదలుము. చచ్చి సాధించు నది లేదు. బ్రదికియుండియే దుర్మతుల గర్వ మణంపవలెను.

భ—అవుగాక. పలుకష్టముల పాలయి యున్న మా తండ్రి గృహమునకుఁ బోఁజాలను.

రా—మీ పెదనాన్నగారి గృహ మీయూర నున్నదికాదా? భద్ర ఊరకుండెను.

రామావధాని యామె చేయి పట్టుకొని నడిపించుకొనిపోయెను.

౮

రామావధాని యద్వితీయ మేధాసంపదగలవాఁడు. అతఁడు వైదికాచారసంపన్నుఁడు. అట్లనిఛాందసుఁడు కాఁడు. లౌక్యమునందుఁ గూడ నపారనైపుణ్యము గలవాఁడు. సుప్రసిద్ధిచెందిన న్యాయవాదులకుఁ గూడఁ గొన్ని విషయములలో నాలోచనము చెప్పఁజాలిన యూహాపోహలు గలవాఁడు. అతడు తనతో విరోధ మవలంబించినవారి నెల్ల నేదో విధమున బాధించి పశ్చాత్తాపతప్తులను గావించి, తన కసితీర్చుకొనెను. త న్ననేకవిధములఁ జిక్కులు పెట్టినవారిలోఁ దన జ్ఞాతియగు శ్రీనివాసరావొకడు. అతఁడు లుబ్ధుఁడగు శ్యామసుందరునకు ధనాశ

చూపి తనవంకకుఁ ద్రిప్పుకొని సిద్ధమైన వివాహమునకు విఘ్నము గల్గించి తన కవమానమును గూర్చినాఁడు. రామావధాని శ్రీనివాసమునకుఁ బ్రతీకారము చేయఁదలంచి యతఁడు వెంకునాయనిచే రమణమ్మకు వ్రాయించిన నోటు తనపేరఁ ద్రిప్పుకొని, వెంకునాయనిని శ్రీనివాసమును గలిపి దావా దెచ్చి యందులో శ్రీనివాసము చేసిన కుట్ర నెల్లను సభలో వెల్లడించెను. శ్రీనివాస మొనర్చిన ద్రోహమెల్లను బరిశీలించి న్యాయాధికారి, యతనిని న్యాయవాదిపట్టమును దొలఁగించెను. అంతియ కాక మీఁదుమిక్కిలి వెంకునాయని పక్షమునఁ దాను రమణమ్మకుఁ గొంత సొమ్ము గూడ నియ్యవలసి వచ్చెను. అట్లియ్యనిచోఁ గారాగృహమునకుఁ బోవలసి యుండెను. ఆ బాధ తప్పించుకొనుటకు భార్య యొంట మిగిలియున్న నగ లమ్మివేసి యా సొమ్ము నిచ్చివేసెను. ఇంతలో నతని భార్య పరలోకగతురా లయ్యెను. ప్రతిమాసమందును నింటియద్దె చెల్లించకపోవుటచే గృహాధికారులు శ్రీనివాసను నింటినుండి తొలఁగిపొమ్మనిరి. శ్రీనివాస మిప్పు డేమి చేయును? నిలువ నీడలేదు. తినుట కన్నము లేదు. వానికిఁ జోడు సాటివారిలోఁ దలవంపులు. పెంచి పోషింపవలసిన చిన్నపిల్లలు ముగ్గురు గలరు. తన పెద్దపిల్లల నత్తవారింటికిఁ బంపించినను వారికిఁ గొంత సొమ్మియ్యవలసి యుండుటచే వియ్యంకులతో విరోధ మవలంబింపవలసి వచ్చెను. ఇప్పుడు వారి యింటి కతఁడెట్లు పోఁగలఁడు. తల దాచుకొనుట కతని కవకాశ మేమియు లేదు. అతఁడు మిక్కిలి పశ్చాత్తప్తుఁ డయ్యెను. ఏది యెట్లయినను ముందుగాఁ బోయిన న్యాయవాదిపట్టము సంపాదింపవలసి యున్నది. అందులకై పై యధికారులతోఁ జెప్పుకొను నిమిత్తము చెన్నపురికి వెళ్ళవలయును. అతఁడు ధైర్య మవలంబించి తనయొద్దనున్న ముగ్వురు పిల్లలను దాతగారి యింటి కప్పగించి వారి నడిగియే కొంచెము

రొక్కము తీసికొని చెన్నపురి కరిగెను. రామావధాని కపకారము చేసినవారిలో నొకఁ డగు శ్రీనివాసము గతి యిట్లు నిరాధారమయ్యెను.

ఇఁక రెండవవాఁడు సింగన్న. ఇతఁడు రామావధానికి బంధువయినను నతనితో ద్వేషమూని పలువిధములగు నపకారము లొనర్చెను. రామావధానిపై నతఁ డెన్నో యభియోగములు తెచ్చెను. అవి యన్నియుఁ గల్పితములే. న్యాయాధికారు లది చక్కఁగా యోజించి సింగన్న చేయుచున్న దుశ్చేష్టలు నిర్ణయించి యతనికి విరుద్ధముగాఁ దీర్పు చెప్పి పరిహారమునకై కొంతసొమ్మును రామావధాని కతనిచే నిప్పించిరి. పాపము సింగన్న యేమి చేయును? ఇదివఱలో దావాకు వెళ్ళవలయునని చెప్పి శ్యామసుందరునినో మఱి యితరులనో కొంచెము సొమ్మడిగి పట్టణమునకుఁ బోయి యచ్చటఁ గొంచెము సొమ్ము వెచ్చించి కొంత మిగిల్చికొని దానితోఁ గుటుంబమును బోషించుకొనువాఁడు. ఇప్పు డట్టిది యేదియు లేకపోవుటచే ధనము లభింపకపోవుటయే కాక వెనుకటి సొమ్మియ్యకపోవుటం బట్టి శ్యామసుందరాదులతో విరోధము కూడ సంభవించెను. రామావధానిని బాధింప సమకట్టి యతఁ డిదివఱలో నవలంబించిన వ్యవసాయవృత్తి విడిచిపెట్టెను. జీవనోపాధి లేక యతఁ డటమటింపవలసి వచ్చెను. ఇఁక నతనికి సప్తాక్షరీ మంత్రోపాసనము తప్పఁ దన కుటుంబపోషణమునకు మార్గాంతరము కనఁబడదయ్యెను. మానావమానములు విడిచి యతఁ డందులకు సమకట్టు సమయమున రామావధాని కియ్యవలసి సొమ్మునకై కారాగృహమునకుఁ బోవలసి వచ్చెను. రాజభటు లతనిని గొనిపోవ వచ్చిరి. బోనులోఁ బడిన యెలుకవలె సింగన్న యిట్టటు పర్విడుచుఁ దప్పించుకొన నుపాయంబు కానకపోయి రామావధాని పాదములపైఁ బడి తన్ను రక్షింపక తీఱదని బతిమాలుకొనెను.

తన తప్పులు క్షమింపుమని వేడుకొనెను. తా నొనర్చిన యపరాధ ములకన్నింటికిని బశ్చాత్తాపపడెను. కాని యన్నిఁటిలోను రుక్మి ణికిఁ దా నొనర్చినది ఘోరకృత్యమనియు, జెన్నపురిలోఁ గాపుర మున్న సుదర్శనరావునకు సత్యమును దెల్పి, లోకాపవాదము దురా త్ముఁడగు తన మూలమున వ్యాపించినదని చెప్పి యతనిని మంచి మార్గమునకుఁ గొనివచ్చెద ననియుఁ బ్రార్థించెను. కరుణార్ద్రహృదయుఁ డగు రామావధాని యతఁ డొనర్చిన యపరాధములను మన్నించి రుక్మిణికి సంభవించిన యపవాదమును దొలఁగించి సత్యమును వెల్ల డించినచో సింగన్నను విడిచిపెట్టుట కభయహస్త మిచ్చెను. ఇంతియ కాక యవధాని చెన్నపురి ప్రయాణము నిమిత్తము కొంత సొమ్ము గూడ నిచ్చెను. సింగన్న బుద్ధితెచ్చుకొని సుదర్శనరావును బొడఁగనఁ జెన్నపురి కరిగెను. ఇతని స్థితి యిట్లు మారెను.

అవధానితో శత్రుత్వ మవలంబించి పనిచేయుచున్న వారిలో శ్యామసుందరుఁడు మూఁడవవాడు. రామావధానిని దుఃఖపెట్టుటకై సింగన్నాదుల మూలమునఁ బెక్కు దుష్కృత్యము లొనర్చెను. ఇతనికిఁ దగినబుద్ధి చెప్పవలెనని యవధానితలంపు. అందులకై యతఁ డనేక మార్గములఁ బాటుపడుచుండెను. కాని యట్టిదేదియు నతనికి లభింపలేదు. ఈసమయమునందే సుబ్బమ్మ భద్రను గృహమునుండి పొమ్మనుటయు, రామావధాని యామెను దన మందిరమునకుఁ గొని పోవుటయు సంభవించెను. కొన్నిదినములకు విశ్వంభరరా వింటికి వచ్చెను. తల్లిదండ్రు లిద్దఱును భద్రపై లేనిపోనివన్నియుఁ గల్పించి చెప్పి భద్రపై నతనికిఁ గోపము గల్గింపయత్నించిరి. కాని సహజ ముగా సద్గుణవంతుఁడగు విశ్వంభరరావు వారి చర్యల నిదివఱకే యెఱిఁగియున్న వాఁడగుటచే తదీయ బోధనలను విశ్వసింపఁడయ్యెను. తల్లిదండ్రు లతనికిమాఱు వివాహము గావించెదమనిరి. కాని విశ్వం

భరరా వంగీకరింపఁడయ్యెను. అంతియుకాక వారియెదుట భద్ర సుగ ణములను నుతింప నారంభించెను. దానిపైఁ దల్లిదండ్రుల కతనిపై కోప ముదయించెను. భద్రను విడిచి వేఱొక తెను వివాహమాడినచోఁ దమయింట నుండవచ్చుననియు లేనిచోఁ దమతోఁగాని తమ సంపద లతోఁగాని యతని కెట్టిసంబంధము లేదనియు విశ్వంభరునితోఁ దల్లి దండ్రులు ఖండితముగాఁ జెప్పిరి. విశ్వంభరునకుఁ బెద్ద చిక్కు సంభ వించెను. సద్గుణవతి యు ననురాగవతియునగు భార్యను విడుచుటయా? లేక పిత్ర్యములగు సంపదలను విడుచుటయా! ఏమిచేయుటకు విశ్వం భరునకుఁ దోచలేదు. తాము చెప్పినట్లు విని భార్యను విడిచి వెంటనే తమతోఁ జేరలేదని రాను రాను దల్లిదండ్రుల కతనిపైఁ గోప మతిశ యింపఁజొచ్చెను. దానితో విశ్వంభరుఁడు భోజనమునకు వచ్చినప్పు డెల్ల వారికి కొరకొరలు, కోరచూపులు, విసుగుదలలు, చీత్కారములు, నీసడింతలు, మొదలగునవి ప్రబలఁజొచ్చెను. పెద్దవారయ్యు నిట్టి నీచ కృత్యము లొనర్చుచున్నందులకు విశ్వంభరునికి హేయభావ ముద యించెను. లోకములోఁ బురుషునకుఁ దల్లిదండ్రులు పూజనీయులై నట్లే పుట్టినిల్లువిడిచి కనిపెంచిన జననీజనకులను విడిచి, తన పిత్ర్య మగు గోత్రమును విడిచి సర్వస్వమునకును దన్నే నమ్ముకొనివచ్చిన ధర్మపత్నిగూడ సమాదరణీయ యని యతఁడెఱుంగును. చంచల ములగు సంపదల కాసించి పత్నీత్యాగ మూలమున శాశ్వతధర్మ ప్రహాణము గావించి నిరయంబునఁ గూలుటకంటె నిహలోకమున దరి ద్రుఁడై వఱలుటయు మేలేయని భావించెను. తల్లిదండ్రుల యధర్మ వాక్యము పెడచెవిని బెట్టెను. ఒకనాఁడు తల్లిదండ్రులు తనతో గట్టిగా వాదించినప్పుడు విశ్వంభరుఁడూరకుండక “తల్లిదండ్రులారా! మీరు నా కెంతపూజనీయు లయినను మీయాజ్ఞాప్రకార మధర్మకార్యము నొనర్పఁజాలను. ఇందు భద్ర యమాయికురాలు. నిరపరాధ. మన

లను విశ్వసించి వచ్చినది. అట్టిదానిని పరిత్యజించుటలో న్యాయ మున్నదా? ధర్మమున్నదా? మీరు నన్నుఁ జేకొనినఁ జేకొనుండు. విడిచిన విడువుఁడు. నేను మాత్రము నాధర్మపత్నిని విడువఁజాల” నని గట్టిగాఁ బలికెను. మూర్ఖాగ్రేసరులగు నాదంపతులకు న్యాయము, ధర్మము మంచిచెడ్డలు గావలయునా? కుమారునిఁగూడ నింటినుండి తఱిమివేసిరి. తమనిశ్చయచిత్తమును వెల్లడించినచోఁ గుమారుఁడు తన చిత్తమును మార్చుకొని తమతో వర్తింపక యెచ్చటికిఁ బోఁ గల్గునని వారియూహ. మానమర్యాదలు పోఁగొట్టికొని నిలువ నీడ లేక నిరాధారుఁడై దేశము పాలయిన శ్రీనివాసరావు కట్టుగుడ్డలతో లేచి వచ్చిన యల్లునికి నాశ్రయ మీయలేఁడనియు, బదిరోజులపా టూళ్ళవెంబడి దిరిగి బుద్ధితెచ్చుకొని కొడుకు మరలివచ్చి తమ పాద ములు పట్టుకొనుననియు నూహించి యా దంపతులు నిశ్చింతగా నుండిరి.

విశ్వంభరుఁ డా యూరనే తమ బందుగులలోపల భుజించుచు నుం డెను. పెద్దలు మొదటఁ గోపించినను బిమ్మట నుచితజ్ఞానము బడసి తన్ను మరలఁ దమ యింటికిఁ బిలిపించుకొనకపోరని యతఁ డను కొనెను. కాని యతని యభిప్రాయము విపరీత మయ్యెను. తన భార్య రామావధాని యింట నున్నట్టు విశ్వంభరుఁ డెఱుంగును. కాని వివాహవిఘ్నమైనప్పటినుండియుఁ దన్నుఁ జూచినను, దన తండ్రిని జూచినను మండిపడుచుండిన రామావధాని యింటి కరిగి యామె నెట్లు రమ్మని కోరును. కోరునుబో, కోరినప్రకార మామె తనవెంట వచ్చినచో నా పాడుదినములలోఁ దన్నే కాక తన భార్యను గూడ నెట్లు పోషించుకొనఁగలఁడు? అందుచే నతఁ డేమి చేయుటకు నొల్లక యా యగ్రహారములో నెట్టకేలకుఁ గాలము పుచ్చుచుండెను. ఈ యుదంత మంతయు వినుచున్న రామావధాని శ్యామసుందరునికిఁ

ప్రతీకార మొనర్పఁ దనకుఁ దగిన సాధన మలవడినదని గ్రహించి, విశ్వంభరుని రప్పించి యాదరించి, యతనిచేఁ దన కార్యము నెఱవేర్ప నెంచియు, నతఁడు తన కనుకూలుఁడై వర్తించునో లేదో యని సంశయించుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు రామావధాని నదిలోఁ స్నానమాడి యొడ్డునఁ గూర్చుండి జపము చేసికొనుచుండెను. ఆ సమయముననే విశ్వంభరుఁడు స్నానార్థ మచ్చటి కరుఁదెంచుట సంభవించెను. రామావధాని యతనిని జూచి యూరకుండెను. విశ్వంభరుఁ డతనిని సమీపించి "మామగారూ! మీవంటి యుత్తమపురుషులను నే నెక్కడను జూడ లేదు. మూర్ఖజనుల లుబ్ధత్వమునఁ జేసి మీవంటివారు నాకు మామగా రగుట సంభవింపకపోయినను, నేఁడు దైవవశమున నా కది సంభవించెను. చావ సిద్ధముగ నుండిన నా భార్యను మీరవ్యాజకరుణచే రక్షించి నన్ను నిరయమునఁ బడకుండఁ జేసినారు. అమాయికురాలగు భద్ర నింటినుండి యెట్లు తఱిమివేసిరో చూచితిరా?" అని పల్కెను. రామావధాని యిదివఱ కెన్నఁడును విశ్వంభరుని నోట నుండి మాట విని యెఱుఁగఁడు. మితభాషియై వర్తించుటచే విశ్వంభరుని చిత్త మెట్టిదో గ్రహింపలేకపోయెను. మఱియుఁ బులికడుపున మేకపిల్ల పుట్టదని యతని నమ్మకము. ధర్మార్థసముచితములగు విశ్వంభరుని మాటల కతఁ డచ్చెరువొంది, లోలోన సంతసించుచు "అందాశ్చర్య మేమియున్నది? కన్నకొడుకునే యింటిపంచకుఁ జేరనీయని మూర్ఖులకుఁ గోడ లొక లెక్కయా" అని పల్కెను.

విశ్వ—ఆలోచింపఁ గన్నకొడుకుకంటెఁ బరగృహమునుండి వచ్చిన కోడలే యెక్కుడు మాన్యురాలు గదా?

రా—సత్యమే. కాని యది యుత్తములకు.

విశ్వ—నిజముగాఁ జెప్పుచున్నాను. భద్రవంటి గుణవతియు,

విద్యావతియు మఱియొకతె యుండదని నా నమ్మకము. అట్టిది శ్రీని వాసరావుగారి గర్భమునఁ బుట్టినదన మిగుల నాశ్చర్యము వొడము చున్నది.

రా__నాకట్టి యాశ్చర్యములేదు. మూర్ఖాగ్రేసరులగు తల్లి దండ్రులకు నీవంటి యుత్తముఁడు పొడముచుండుటలేదా?

విశ్వ__నాయందట్టి యుత్తమత్వము లేదు. అట్లయిన నను కూలయగు భార్య పలుబాధలు పడుచుండుట చూచియు సహించి యూరకుందునా?

రా__దానికేమి లెమ్ము. అనవకాశమైనప్పు డేమిచేయుదువు?

వి__నే నూర లేనప్పు డట్లగుటకు విచారము లేదు. కాని యిప్పుడో? నిలువ నీడ లేదు. తిన నన్నము లేదు. ఏమియు జేయ లేక పోవుచున్నాను.

రా__దృఢచిత్తుఁడవైనచో సర్వమును జేయఁగలవు. తండ్రి సంపదలు కొడుకునకుఁగాక మఱి యెవ్వరికిఁ జెందును?

వి__అది యెప్పుడో జరుగవలసినమాట.

రా__ఎప్పుడో యక్కఱలేదు.

వి__అదియెట్లు?

రా__నీవు స్థిరచిత్తుఁడవై యుండఁగలవా?

వి__తప్పక.

రా__కార్యమధ్యమున నీవు తండ్రితో సంధి కంగీకరింపరాదు సుమా?

వి__ఈ జన్మమధ్యమున వారితో నాకు సరిపడదు.

రా__ఇది నిశ్చయమేకదా?

వి__ముమ్మాటికిని.

రా__నీవు న్యాయాధికారుల కొక విజ్ఞాపనపత్రము పంపు

కొనవలయును. “తల్లిదండ్రులకును నాకును నానుకూల్యము లేదు. కావున నావంతు సంపదలు నాకుఁ బంచిపెట్టింపవలయు” నని వ్రాసినచో సర్వము చక్కఁబడును.

వి—అంతమాత్రమున నగునా?

రా—అట్లు కార్యము నెఱవేఱినపుడు దావా తేవలసి యుండును.

వి—అందులకు ధనమో!

రా—నే నుండఁగా నీకావిచార మక్కఱలేదు. కాని నేనింత వఱకు చేసియుండఁగా నాయనుమతి లేకుండ నీవు నీ తండ్రితోఁ జేర రాదు.

వి—తప్పక యట్లే చేసెదను.

అనంతరము రామావధాని విశ్వంభరుని తనతోఁగూడఁ దన యింటికిఁ గొనిపోయెను. ఆమరునాఁడే విశాఖపట్టమునకుఁ బోయి కావలసిన తంతు నడపెను. విశ్వంభరునిచేఁ బత్రము వ్రాయించుకొని తానే బదులిచ్చి యాధనమును వెచ్చించి యధికారుల ముఖమునఁ దండ్రికిని గొడుకునకును సంపదలు పంచి యిప్పించి శ్యామసుందరుని యనంతరమున నతని సందలుకూడఁ గుమారునికిఁ జెందునట్లుచేసి యాయూరనే శ్రీనివాసరావు గృహమున భద్రతోఁ గూడ విశ్వంభరుని విడియించెను. దీనివలన శ్యామసుందరుని ధననష్టమే కాక కొడుకును దఱిమివేసెనన్న లోకాపవాదముగూడ నొందవలసినవాఁడయ్యెను. అగ్రహారమున రెండవపక్షమున ముఖ్యులగు మువ్వురును వెనుకటివిధమునఁ బరాభూతులగుటచే మిగిలినవారందఱును రామావధానితో నేకీభవించిరి. కొంతకాలమునకుఁ బశ్చాత్తప్తులగు నాదంపతులు దమకుమారుని భార్యతోఁగూడ వచ్చి తమ చెంత నుండుమని కోరెను. కాని యట్లుండుటయే పరస్పరము మేలని విశ్వంభరుఁడు వారిమాటను మన్నింపలేదు.

చెన్నపురి మహార్ణవమువలె నిండయినది. సముద్రములో నెటు చూచి నను బ్రవాహములు ప్రవహించుచుండును. ఇట నేవీధి చూచినను గతాగతప్రజాసమూహము లుండును. అట మహాశైలవం లుండును. ఇచ్చట వానివలె నున్నతములగు సౌధపంక్తులు గలవు. అట మహో త్తుంగతరంగపంక్తుల కలకలము. ఇచ్చట వాదోపవాద కుతూహల జనకోలాహలము. అచ్చట సూక్ష్మజంతుసంతానమును బొట్టలో నిముడ్చుకొని మహాగభసంబున సంచరించు గ్రాహాదిసత్వంబులు. ఇచ్చట ననేక ప్రజలఁ దమ గర్భకుహరమున నుంచుకొని యిట్టటు నడయాడు విద్యుచ్ఛక్తిశకటములు. ఎటు చూచినను వింతపుట్టించు నా పురమున ననేక విశాలవీధులు గలవు. కాని యందులో మూంటు రోడ్డు తలమానికమువంటిది. అది వైశాల్యమునందే కాక స్నిగ్ధత్వ మునందు గూడ మిగుల వాసికెక్కినది. అది యెప్పుడును వర్షకాల నదివలెఁ బ్రజాసంతతులచే నిండియుండును. దాని యిరుప్రక్కలనుండు నున్నతసౌధశ్రేణులు నుభయతీరములందును శాఖోపశాఖలచే వర్ధిల్లి యతిసాంద్రములగు తరుపంక్తుల ననుకరించుచుండెను.

అభిలషిత కార్యనిర్వాహణపరాయత్తచిత్తులగు మనుష్యులందమిత ముగాఁ గలరు. కొందఱు వికసితముఖులు. కొంద అధికారగర్వవిభా సితవదనులు. మఱికొందఱు నానావిధవస్తువిక్రయణపరాయణులు. కొందఱు విక్రీతవస్తువిలసితహస్తులు. కొంద అమూల్యవస్త్రధారులు. కొందఱు మలినవసనవేష్టితులు. కొందఱు వాహనారూఢులు. కొం దఱు పాదచారులు. కొందఱు గంభీరసంభాషణనిపుణులు. కొందఱు దైన్యమయవాక్కులు. కొందఱు మహారాజులు. కొందఱు నిరుపేదలు.

ఈవిధమున వర్తిలు నావీధియందు సామాన్యముగాఁ బరిచితులనైనను గుఱితింపలేము.

ఆమాంటురోడ్డునకుఁ బ్రక్కవీధియం దొక యున్నత సౌధమున రామారావు నివసించియుండెను. అతఁడు క్రమముగా నా మహాపురమున వైద్యశాస్త్రమున మిగుల వాసిగాంచెను. దొరతనము వా రిచ్చు వేతనమేకాక పౌరులకుఁజేయు చికిత్సవలనఁ గూడ ధన మెక్కుడుగా సంపాదించుచుండెను. అతని తండ్రియుఁ బినతల్లియుఁ గూడఁ దన చెంతనేయుండి తన్నమితముగాఁ బ్రేమించుచుండిరి. తన్నేకాదు తనభార్యయగు కమలనుగూడ నదేవిధముగాఁ జూచి మన్నించుచుండిరి. కమలయు సద్గుణవతియు, వివేకవతియునగుటచే నత్తమామలకును, భర్తకును నెట్టిలోపమును గలుగకుండ వర్తించుచు నంతతము వారికి సౌఖ్యసంతోషములు గూర్పఁ బాటుపడుచుండెను. వెనుకఁ గమలయందు వారి కెంత నిరసనముకలదో యిప్పు డామెయందు వారి కంత సమాదరము కలదు. ఇట్లు రామారావు సముచితజ్ఞానముచేఁ దన గృహమును భూతలస్వర్గముగాఁ జేసికొని వర్తించినను దనమూలమున రుక్మిణికి సంభవించిన యపవాదమును, దదీయ దురవస్థను దలంచుకొన్నపుడెల్ల నతని హృదయము విషాదసంపూర్ణము కాకుండ నుండలేదు. రుక్మిణివంటి సౌందర్యవతికి, విద్యావతికి, వివేకవతికి, భర్తృకృతత్యాగరూపపరాభవమాయని యతఁడు తలంచుచుండును. అదిలేక పూర్ణహృదయముతో సముచితజ్ఞాన మెఱుఁగక చదువుకొనియుఁ బశుప్రాయుఁడై వర్తించుఁ దనకిట్టి గృహసౌఖ్యము సమకూర్పఁబాటుపడి యామె తుదకు దానట్టి సౌఖ్యమునకు వెలియైనది కదాయని యతఁడు దుఃఖించుచుండును. ప్రారబ్ధకర్మవశమున విపరీతచిత్తుఁడై వర్తించు సుదర్శనరావును మరల సత్పథమున సంచరింపఁ జేయ నతఁ డెక్కుడు శ్రమపడుచుండెను. కాని శ్వేతముఖిసమా

కృష్ణహృదయుఁడగు నతని చిత్తమును మరలింప నెవ్వరికిని శక్యము గాకుండెను. అతఁ డంతతో నూరకుండక తన భార్యయగు కమల చేతను రుక్మిణిచేతను గూడ నానావిధముల యత్నము చేయించు చుండెను. మానవుఁ డజ్ఞానపిశాచమును వదలినఁగాని సన్మార్గమునఁ బడఁడు. అట్లే సుదర్శనుఁడు శ్వేతమూఖిని విడిచినఁగాని సత్పథ మవ లంబించునా ? అందులకే వా రనేకవిధములఁ బాటుపడుచుండిరి.

ఒకనాఁడు రామారావు సాయంసమయమున మోటారుబండిపైఁ గూర్చుండి విహారార్థ మరుగుచుండెను శకటచోదకుని దనవెనుకఁ గూర్చుండఁబెట్టుకొని తానే బండి నడపుచుండెను. శకటచోదనమం దధికనైపుణ్యముగల రామారా వామహాపురమున నా ప్రజాసమూ హాముల నడుమ నిరపాయముగా బండి జోరుగా నడుపుచుండెను. అట్లు వెళ్ళి వెళ్ళి యాబండి యొకచోట చటాలున నాగినది. ఎందుల కాపఁబడినదోయని చోదకుఁ డట్టిటుచూడ నారంభించెను. ఆచుట్టు పట్ల మలినవసనధారియగు నొక వ్యక్తితప్ప మఱెవ్వరును లేరు. అట బండిని నిలుప నవసరమేమో యని యతఁడు లేచి నిలువఁబడులోపున రామారావు బండిదిగి యాబీదమనుష్యుని చెంతకరిగి చేతులు జోడించి నిలువఁబడెను. అతఁ డట్లు చేయుచున్నపుడు చూచినవా రంద ఱంత గొప్పవాని కీనిరుపేదతో నెట్టిపనిగలదో యని విచారించుచు వారి చుట్టునను మూగియుండిరి. ఆమలినవస్త్రధారి యెవ్వఁడు ? న్యాయ వాదియై పనిచేసిన శ్రీనివాసరావు. రామారావు మామగారు. శ్రీనివాస మతనిఁ జూచి నిశ్చేష్టితుఁ డయ్యెను. చిరకాలమునుండి చూడకపోవుటచే నతఁ డతనిని గుఱుతింపలేకపోయెను. అంతేకాదు. లోకములోఁ దప్పులొనర్చినవాని కనేక సందేహములు పొడము చుండును. ఒకవేళఁ దా నొనర్చిన యపరాధముల మూలమునఁ బ్రభుత్వముచే నాజ్ఞప్తుఁడై తన్నుఁ బంధింపవచ్చిన రక్షకభటాధికారి

యేమోయని యతని భయము. అందుచే నతఁడేమియు మాటాడ లేక యధోవదనుఁడై యట్టే నిలిచియుండెను. అప్పుడు రామారా వతనికి నమస్కరించి "మామగారూ! నేను రామారావును. మీ యల్లుఁడను. మీ రెందులకై యెవ్వ డిచ్చటికి వచ్చినా" రని పల్కెను.

ఒకమారు రామారావు ముఖమును జూచి భోరున నేడ్వఁజొచ్చెను. అతని కన్నులనుండి నీరు కాల్వలుగట్ట నారంభించెను. లోపలినుండి పొంగి పొరలివచ్చుచున్న దుఃఖంపు పెంపునఁ గంఠము స్తంభితమయ్యెను. బలాత్కారమున నతఁ డేదో మాటాడ యత్నించెను. కాని మాట కంఠమును వెలువడి రాలేదు. రామారా వతని దురవస్థను జూచి సహింపలేక యతని దగ్గఱగా దీసికొని యోదార్చి, యతని దుఃఖమును గొంత శమింపఁజేసెను. అతని చేయివట్టుకొని తీసికొనిపోయి ముందుగా నతనికిఁ గావలసిన దుస్తులుకొని కట్టనిచ్చి తన మోటారుబండిపై గూర్చుండఁబెట్టెను. మొదట శ్రీనివాస మతఁడిచ్చిన దుస్తులను ధరించుటకును, మోటారుపైఁ గూర్చుండుటకు నిరసించెను. కాని రామారావు నిర్బంధముచే నట్లుచేయక తీరినదికాదు. పిమ్మట రామారావు బండి నడుపుకొనిపోసాగెను. అప్పుడు శ్రీనివాసము తన దురవస్థనెల్ల నల్లునితోఁ జెప్పెను. మఱియుఁ దానచ్చటికివచ్చిన విషయమునుగూడ దెలిపి తుద కిట్లనెను.

శ్రీ—రామారావూ! నీ మొగము చూచుటకు నాకుఁ గష్టముగా నున్నది. మీ కందఱకు నపకార మొనర్చితినని దుఃఖించుచున్నాను.

రా—అయ్యో! అదేమి అట్లనుచున్నారు? మాకు మీ రపకార మొనర్పలేదు. మహోపకారము గావించినారు.

శ్రీ—నీ వుత్తముఁడవు. కావున నట్లనుట న్యాయమె.

రా—కాదు. కాదు. మీరు నిజముగా నుపకారమే చేసినారు.

శ్రీ—ఎందులకీ మాటలు. మీకిచ్చెదనని చెప్పిన కట్నము సొమ్మియ్యనే లేకపోయితిని. అశక్తుఁడనయ్యు నంతలేసి కట్నము లిచ్చెదనని మోసపుచ్చుట పెద్దపొరపాటు.

రా—అది పొరపాటుగాదు. అదియే మాకుపకరించినది.

శ్రీ—ఎట్లు?

రా—మాతండ్రిగారతిలుబ్ధులు. వారికిఁ గట్నమందే యభిలాషముకాని, వివాహమునకు ముఖ్యముగావలసిన సాంప్రదాయము, పిల్లసద్గుణములు, సౌందర్యము, తెలివితేటలు మొదలగునని వారికి పరిశీలనీయములు కావు. అప్పుడు మాకు స్వతంత్రతలేదు. మీరశక్తులైనను బెద్దకట్నము లిచ్చెదమని చెప్పుటచేతనే సద్గుణఖనియగు కమల నావంటివానికి లభించినది. లేనిచో నామె మఱియేమూర్ఖునో వరించి యాపురుషుని భాగ్యవంతునిగాఁ జేసియుండును. అందుచే మీరు నాకు మహోపకారమే గావించినారు.

శ్రీ—ఇప్పుడు మన మెక్కడికిఁ బోవుచున్నాము?

రా—మన యింటికి.

శ్రీ—వలదు. నేను మీ తండ్రిగారి ముఖము చూడలేను.

రా—మిమ్ముఁ జూచి కోపించుననియా?

శ్రీనివాస మూరకుండును.

రా—మీ కట్టి సంశయము వలదు. గొంగళిపురుగు సీతాకోకచిలుకయైనట్లు మావారి కుటిలహృదయము లన్నియు మంచి మార్పు చెందినవి. ఇంతకును గారణము మీ కూతురు. ఆమె తన సద్గుణములచే నందఱి మనస్సులకును మార్పు గల్గించినది. అట్టి యువతీరత్నమును మాకుఁ బ్రసాదించినందులకు మే మిప్పు డెంతయుఁ గృతజ్ఞులమయి యున్నాము. మా కృతజ్ఞతాపూర్వకాతిథ్యమును మీరు స్వీకరింపక

తప్పదు.

శ్రీ—నాయనా! నాయందు మీ కట్టి దయ గల్గినదని వినుట కెంతయు నానందించుచున్నాను. క్షమింపుము. ఇప్పట్టున మీ యింటికి రాజాలను. నా యుద్యమము నెరవేర్చుకొనవలసి యున్నది. ఆ విషయమై యొక తగు మనుష్యుని దర్శింపవలసి యున్నది. అందులకే పోవుచున్నాను. నన్నిప్పుడు పోనిమ్ము.

రా—ఎవ్వ రాతఁడు?

శ్రీ—రామస్వామయ్యరు.

రా—ప్రధాన న్యాయాధికారియా?

శ్రీ—అవును.

రా—అదెంత సేపు. ఆతని పరిచయము నా కెక్కుడు గలదు. నేను వారి యింటి వైద్యుఁడను. నాయందు వారి కెక్కువ గౌరవము. వారిచే మీకుఁ గావలసిన సాయము చేయించెదను. రేపటిదినమున మన ముభయులము గూడఁ బోవుదము.

అని వారు సంభాషించుచున్నంతలో బండి వచ్చి రామారావు గృహముముందు నిలిచెను. ఎవ్వరు వచ్చుచున్నారో యని లోపలినుండి చూచుచున్న కమల తన భర్తతోఁ గూడ లోనికి వచ్చుచున్న తండ్రిని జూచియు నానవాలు పట్టలేక నిలిచియుండెను. అంత రామారావు "ఇదిగో మీ తండ్రిగారు వచ్చినా" రని చెప్పెను. పలుకష్టముల పాలయి నిరాధారుఁడై భార్యను గోల్పోయి విచారపరంపరచేఁ జిక్కి శల్యమై యున్న తండ్రిని జూచి కెవ్వునఁ గేక వేసి కమల యేడ్వఁ జొచ్చెను. తన తల్లి మరణించిన పిమ్మటఁ దండ్రిగారిని సందర్శించుట కమల కది మొదటిపర్యాయము. విద్యావివేకవంతురా లయినను గమల మాతృమరణమును గూర్చియు, దన తండ్రి దుర్దశను గూర్చియు మాటికి మాటికిఁ దలంచుకొని విలపించుచుండ రుక్మిణియు,

రామారావును సాంత్వనవాక్యములచే నోదార్పఁ జొచ్చిరి. ఇంతలో రామారావు తండ్రియుఁ బినతల్లియుఁ గూడ వచ్చి, వచ్చిన శ్రీనివాసమున కుచితమర్యాదలు సలిపి యతనికి సంభవించిన కష్టములను గూర్చి విచారించుచుఁ దమ సానుభూతిని జూపిరి. వారు దన్నంత గౌరవింతురని శ్రీనివాసము మొదటఁ దలంపలేదు. వారట్లాదరించుటవలన శ్రీనివాస మదివఱకుఁ దన మనస్సున నంటియున్న సందేహము, మోమోటము మొదలగునవి పటాపంచలయ్యెను. ఆ యాపత్సముద్రములోఁ బడి యీఁది యీఁది యలసిపోయి కొట్టుకొనుచున్న తనకు దరి తారసించినందుల కతఁడు కొంత స్వస్థచిత్తుఁ డయ్యెను.

౧౦

మన పూర్వజన్మార్జిత పుణ్యపాపకర్మజాలమునకే దైవమని పేరు. అది మానవుల మంచిచెడ్డలకును, సుఖదుఃఖములకును, గలిమిలేములకును, గారణము. పటుతరకర్మసూత్రబద్ధుఁడై ప్రాణి యిరుసునకుఁ గూర్పఁబడిన చక్రమువలె నియమితుఁడై తిరుగుచుండును. అట్లు తిరుగునప్పుడు శకటచక్రనేమి మాటిమాటికిని గ్రిందుమీదునగు విధంబుననే కర్మబద్ధుఁడైన ప్రాణియుఁ బూర్వకర్మవాసనను బట్టి యొకప్పుడున్నతస్థితిని, మఱియొకప్పుడు నీచస్థితిని గాంచును. ఆ కర్మవాసనల వలననే యంతవఱకును సత్ప్రవర్తనుఁ డగువాఁడు విపరీతుఁ డగును. తెలియకుండఁగనే మనకు దైవ ముచ్చ నీచస్థితులను దెచ్చిపెట్టుచుండును. పంజరములోని చిలుక యింటివారి పెట్టుపోతలకు లోనై నిరీక్షించుచున్నట్టు మనము దైవము త్రిప్పులకు లోనై వర్తించి తీర

వలెను. ఆ దైవము కల్గించుచున్న సుఖదుఃఖాదులను హృదయపూర్వకముగా స్వీకరించి యనుభవింపవలెను. తప్పించుకొనన మన శక్యము కాదు.

సుదర్శనుఁడు మొదట సత్త్వవర్తనుఁడే. సదయహృదయుఁడే. స్థిరచిత్తుఁడే. ఆగర్భశ్రీమంతుఁడే. సుఖవంతుఁడే. కాని ప్రస్తుత మతని చర్యలన్నియు మాఱిపోయినవి. చెట్టుకొనకొమ్మనున్న మధుకోశ మతనికిఁ గానవచ్చినది. అందున్న మధుబిందువులచేఁ దన కడుపు నిండునని యతని తలంపు. అమృతమువంటి యా నిర్మలమధువా నతని కభిలాషము హెచ్చినది. అది తనకు సాధ్యమో లేక యసాధ్యమో, నిజముగా నది తన కానందకారి యగునో కాదో పరిశీలింప లేదు. ఆ తేనె నాసించి యాతఁడు చేతనున్న సరసపదార్థమును ద్రోసి పుచ్చెను. ఆ మధువుముందది విషమువలెఁ గనఁబడెను. వెంటనే యాతఁడా సమున్నతవృక్షమున కెగఁబ్రాకెను. కడకొమ్మ కరిగెను. మధుకోశ మెట్లయిన నేమి చేతికి లభించెను. అతఁడు పరమానంద మందెను. అమృతమానిన దేవతలకంటెను దన్ను నధికునిగా భావించుకొనెను. అతఁడు మరల మధుకోశమును నిదానించి చూచెను. దానికి సమీపముగా నొక క్రూరపన్నగ మొకటి కాచుకొని యుండెను. అయిన నతఁడది తన్నేమి చేయఁగలదని యనుకొనెను. తుద కతఁడా మధుకోశమును జేతితో లాగెను. అంతనచట సమీపమున నున్న యా త్రాచుపాము బుస్సున లేచి యతని గరచెను. ఇంతలో మధుపబృందము కూడఁ జెదరి యతని శరీరమం దంతటను గుట్టెను. ఇఁక నతని శరీర మతనికి వశముగాలేదు. కొమ్మ పట్టువదలి యతఁడధఃపతితుఁడాయెను. శరీర మంతయుఁ జితికిపోయెను. గాయములు బాధపెట్టుచుండెను. అయినను నతఁడా మధుకోశమునుండి నేలఁ బడుచున్న మధుబిందువులం దాశ వదలలేక యటు కన్నులఁ బ్రసరింపఁ

జేయుచునే యుండెను.

నాఁడు కమలా రుక్మిణులతో సంభాషించినప్పటినుండియు దొర సాని వంత క్రమక్రమాభివృద్ధి చెంద నారంభించెను. హిందువులలో, స్త్రీలలో నట్టివా రెందులకుఁ బుట్టవలయునని యామె మొదటి దుఃఖ ము. సుదర్శనరావు భార్య రుక్మిణి దన కేమైన నపకారము గల్గించు నేమో యని రెండవ దుఃఖము. అత్యుత్తముఁడును, స్వదేశీయుఁడును నగు మోకరుదొరను విడిచి యీ హిందువునకు భార్యను గావలసి వచ్చెఁ గదా యని మూఁడవదుఃఖము. ఇట్లు సంతతమును దుఃఖ ముల పాలయి దొరసాని తన దుఃఖవిముక్తికి మార్గ మరయుచుండెను. సుదర్శనుని విడిచిపోవుటయే తన దుఃఖాపనోదనమునకుఁ గారణమని గ్రహించెను. కాని యెట్లు విడిచిపెట్టుట? విడాకు లిచ్చి వెడలిపోయిన చో సుదర్శనుఁ డంతవఱకుఁ గొనియిచ్చిన యమూల్యవస్తువు లన్నియు మరలఁ బుచ్చుకొనునేమో యని భయము. ఎట్లయినను నా వస్తువుల నెల్లఁ దక్కించుకొనవలెనని యామె యూహ. కావుననే సుదర్శనునకు విడాకు లిచ్చి వెంటనే రమ్మని మోకరుదొర యెంత చెప్పినను వినక యతని నాశ్రయించియుండెను.

ఆమె సుదర్శనునిఁ దొంటికంటె నెక్కుడుగఁ బ్రేమించుచున్నట్లు నటించెను. సుదర్శనునకుఁ గ్రమముగా మోకరుతోఁ బరిచ యము గల్గించెను. ఒకొకప్పు డామె తమతో సుదర్శనుని విహారా ర్థము గొనిపోవుటయేకాక మోకరు దొరయింటికిఁగూడఁ గొనిపోవఁ జొచ్చెను. ఒకొ్కక సమయమున మోకరు కోర్కి ననుసరించి యీ దంపతులు రాత్రులందుఁ దద్గృహమున నివసించుటగూడఁ గలదు. ఈనెపమున దొరసాని సుదర్శనరావు గృహముననున్న యమూల్య వస్తుపరికరమంతయు మోకరుదొరయింటికిఁ జేర్చివేసెను. కామాంధుఁ డగు సుదర్శనుఁ డాతంత్రమేమియు గ్రహింపలేకపోయెను.

ఆదంపతులు వాడుకచొప్పున మోకరుగృహమున కరిగిరి. కొంత సేపేవేవియో ప్రసంగములు నడచెను. మాధ్యాహ్నికభోజన మచ్చటనే గావించిరి. మోకరేదోపనికై లోనికరిగెను. అప్పుడు సుదర్శనుఁడిట్లు సంభాషించెను—

సు—ప్రియా! చాలసేపైనది. ఇఁకఁ బోవుదమురమ్మి. ఈ మధ్యాహ్నము నీతోఁగూడ వచ్చెదనని యొక మిత్రునితో వాగ్దాన మొనర్చితిని.

దో—మంచిది. ఈరోజునకు మీరు దయచేయుఁడు.

సు—నిన్ను ముఖ్యముగాఁ దీసికొనిరమ్మని కోరెను.

దో—కాని నేను రాఁజాలను.

సు—రాకతప్పదు.

దో—ముమ్మాటికిని రాలేను.

సు—నామాటయందు నీకంత నిర్లక్ష్యమా?

దో—ఉండదా! నీ వసందర్భము లాచరించుచున్నపుడు?

సు—నేనేమిచేసితిని?

దో—మోసపుచ్చితివి.

సు—(నవ్వుచు) అవును. వేలకొలఁది కర్చుచేసి నీవు కోరిన వస్తువులనెల్లఁ గొనియిచ్చుట మోసముకాదా?

దో—నీయవసరమునిమిత్తమై కొనియిచ్చితివి.

సు—అవునుగదా! నాయవసరమును బట్టియే నిన్నిపుడు నాతో రమ్మనుట.

దో—నేనురాను.

సుదర్శనుడు రాకతీరదని యామెచేతినిబట్టి యాకర్షించెను.

దో—(కోపముతో అతనిని ద్రోసివేసి) పొమ్మి. నేనురాను.

సు—(ఆగ్రోపునకుఁ గుర్చిపైఁబడి నొచ్చుకొని) కేమెల్!

నీకిది తగదు. ఖండితముగాఁ జెప్పుచున్నాను. నీవు తప్పక రావలెను.

దొ—సుదర్శనరావూ! నేను ఖండితముగానే చెప్పుచున్నాను. నేను నీతో రాను.

సు—వలదుసుమీ! ఆలోచించుకొనుము. నీవు నాచెప్పిన చొప్పున నడవనిచో నీతో సంబంధము విసర్జించెదను.

దొ—మంచిది. అట్లే చేయుము.

సు—(కోపముతో) ఓహో! అంతగర్వముగా నున్నదా? అట్లయిన నా వస్తువులు నాకిమ్ము.

దొ—నీవస్తువులు నీయొద్దనేయున్నవి.

సు—అట్లుకాదు. నీకని కొన్నవిగాక నావస్తువు లెన్నియో నీవు వాడుకొనుచున్నావు. ఇంతవఱకు నీసంతోషమునకై విడిచితిని. అవి నాకిప్పు డప్పగింపవలెను.

దొ—అవి నీకప్పుడే యిచ్చివేసితిని. మాటాడకపొమ్ము.

సు—పాకము ముదురుచున్నదే! నీవు సరిగా నియ్యనిచో నీపై నభియోగము తేవలసియుండును. అప్పుడు విచారించిన లాభము లేదు. కాదేని నాచెప్పినచొప్పున నడచుచు నాకుఁ బ్రీతిపాత్రమవై యుండుము.

దొ—ఇఁక నీతో నాకెట్టిసంబంధమును లేదు. నీ యిష్టము వచ్చినపని గావింపుము.

సు—నీపై నభియోగమును దేకమానననుసుమా.

దొ—నీపై నేనును దెచ్చెదను.

సు—నీవలె నేను నిన్ను మోసపుచ్చలేదు.

దొ—లేకేమి? నాకు భార్యలేదనియు నీవే భార్యవనియు నమ్మించి నన్నీదేశమునకుఁ దీసికొనివచ్చినావు. ఆ మోసమునకు నీపై దావా తెచ్చెదను.

సు—అందు మోసములేదు. నాకు భార్యలేదు.

దొ—ఉన్నది. మొన్న మీభార్య మీయింటికే వచ్చినది. నేనామెచే సాక్ష్యమిప్పించెదను.

సు—ఇఁక వాదముతోఁ బనిలేదు. నాతో వచ్చెదవా? నా వస్తువులు నా కప్పగించెదవా?

దొ—నీతోరాను. నీవస్తువులు నాచెంతలేవు.

సుదర్శనుడు కోపముతో నామెను నిందింప నారంభించెను. ఇంతలో మోకరుదొర లోపలినుండి గబగబ వచ్చి సుదర్శనుఁ డేదియో చెప్పు చున్నను వినక "ఓరీ! తెలివిమాలినవాఁడా! చెవులు చిల్లులు పడునట్లు క్రూరసంభాషణముగావింపనా వచ్చితివి? స్త్రీతోఁ గలహింతువా? నీవంటి మోటువానికి స్త్రీల మర్యాద లెట్లు తెలియును? ఆ యువతిని మోసపుచ్చి తీసికొనివచ్చి తుదకుఁ గలహించుచున్నావా? ఇఁక నోరుమూయు"మని పలికి, యతని మెడమీఁదఁ జేయివైచి యా మేడమెట్లపైనుండి క్రిందికిఁ ద్రోసివైచెను. బలహీనుఁడగు సుదర్శనుఁ డేమఱిపాటున నుండుటచే నాత్రోపు నాచికొనఁ నవకాశములేక యా మెట్లపైనుండి క్రిందికి దొరలిపడెను.

ఇఁక సుదర్శనునకు సంభవించిన పరాభవదుఃఖముకంటె దొరసాని యొనర్చిన మోసమే తన్నెక్కుడు బాధింపఁజొచ్చెను. అతఁడు దుఃఖించుచు మెల్లగలేచి చెదరినవేషమును సరిగా దిద్దుకొనుచు నొక్క మోటారుబండిపై గూర్చుండి తనమందిరమును జేరెను.

అధమునకుఁ దనశక్తియెంతో పరశక్తియెంతో తెలియదు. తనవలననే సమస్తము వర్తిల్లుచున్నదని యతని నమ్మకము. అతఁడేదో స్వల్పాంశమును మదినుంచుకొని తన్నిర్వహణార్థమై యనేకవిధములఁ బ్రయత్నించును. తన్నిర్వహణముమాత్రమే యతనికిఁ గావలయును. కాని తత్సమయమున సంభవించు మంచిచెడ్డలను, గార్యాకార్యములను, లాభనష్టములను బరిగణించుట యనవసరము. అట్లయ్యును దుద కా స్వల్పకార్యమును నిర్వహించుకొనలేక పలువురతో విరోధమును, దీఱని కష్టములును, బశ్చాత్తాపమునుజెంది సర్వార్థహీనుఁడై లోకనింద్యుఁడై వర్తించును. ఇది యధముని లక్షణము.

సింగన్న యగ్రహారనివాసి. రామావధానికి దూరబంధువు. అతఁడించుకేనియుఁ జదువురాని మూర్ఖాగ్రేసరుఁడు. వయస్సుమీఱినవాఁడు. అయినను నపరిపక్వబుద్ధిగలవాఁడు. ఇతనికి వ్యవసాయమే వృత్తి. ఇతఁడు గ్రామములోని కార్యములన్నియుఁ దనపై వేసికొని స్వీయకార్యములు విడిచియైనను వాని నెట్లో నెరవేర్చుచుండుటచేఁ దగవునకై యాగ్రామస్థు లా సింగన్ననే పిల్చుచుందురు. ఇతఁడు వెనుకముందు లరయక, గంభీరస్వరముతో వాదించుటచే నాయూరి సర్వజనులును భయపడుచుందురు. అతనికి భయపడియే యా గ్రామవాస్తవ్యు లతఁడొనర్చిన యక్రమములఁ జాటుచాటునఁ జెప్పుకొందురే కాని యెదుటఁబడి మాటాడలేరు. సింగన్న కెట్లయిననేమి యాగ్రామమున మాట చెల్లుబడి గలదు.

వయస్సునఁ బెద్దవాఁడగుటచేతను నొకవిధమున బంధువగుటచేతను సింగన్నను రామావధాని సామాన్యముగా నన్నివిషయములందును

మన్నించుచుండును. అతఁడు సింగన్నమాటలను, బనులనుగూడ బరి
గణింపక యతఁడు కోరినప్రకారము చేయుచుండును. రామావధాని
భూమి ఖండము నొకదానిని సింగన్నసిస్తునకు దున్నుచుండువాఁడు.
ఆభూమిని బలువురంతకంటె నెక్కుడుసిస్తునకు దున్నుదుమని యడిగి
నను, స్వల్పధనము నపేక్షించి సాటిబంధువగు సింగన్నను నందుండి
తొలఁగింప నిష్టపడక రామావధాని యతఁడిచ్చినంతసిస్తునుమాత్ర
మే పుచ్చుకొనుచుండువాఁడు. రాను రాను సింగన్న యూరిపెత్తనము
పై నేసికొని యందులకై తిరుగుచు వ్యవసాయమునం దుపేక్షవహింప
వలసిన వాఁడయ్యెను. అందువలనఁ బండిన పంటనైనను గూడఁ దీసి
కొన నతనికవకాశము లేకపోయెను. ఈకారణమున సింగన్న ప్రతి
వత్సరమును రామావధాని కియ్యవలసినపన్ను చెల్లించుట మాని
వేసెను. నాల్గయిదు సంవత్సరములవఱకు రామావధాని పన్నువిష
యమై యతనిని ఖండితముగా నడుగలేదు. అతఁడెట్లో తెచ్చియిచ్చు
నని యవధాని యుద్దేశము. కాని సింగన్న యెప్పటికిని బన్ను చెల్లింప
లేకపోయెను. అనవసరకార్యప్రవిష్టుఁడై స్వీయకార్యములను మఱచి
పోయి వర్తించుసింగన్న తనభూమిని సరిగా దున్ని పండించి పన్నియ్య
లేఁడని భావించి యవధాని భూమిని వదలివేయుమని యనేకవిధముల
సింగన్నకు బోధించెను. అతఁడు భూమిని వదలఁడు. పన్నియ్య
లేఁడు. మాటలవలనఁ గార్యము నెఱవేఱదని యెఱిఁగి యవధానిపద్ధతి
ప్రకారమునడిచి యందుండి సింగన్నను బలాత్కారముగాఁ దొలఁ
గించెను. ఈవిషయమున నవధానియందు లేశమైన దోషము లేక
పోయినను, సింగన్న యది మహాపరాధముగా భావించి రామావధా
నితో శత్రుత్వమవలంబించి వర్తింపసాగెను. ఈసమయముననే యసూ
యాపరుఁడగు శ్రీనివాసరావును, శ్యామసుందరుఁడును గూడ సింగ
న్నకు లేనిపోనివి బోధించి యతని కవధానితో ద్వేషమును హెచ్చిం

చిరి. న్యాయవాదియగు శ్రీనివాసరావు, ధనవంతుఁడగు శ్యామసుం
దరుఁడును దనకుఁ దన్నైయున్నచో నవధాని గర్వమడంచుట యెంత
పనియని తలంచి సింగన్న యందులకు నడుముగట్టికొని పనిచేయ
నారంభించెను. సింగన్న మిక్కిలి శ్రమపడెను. కాని లాభము లేక
పోయెను. ప్రత్యభియోగమునందును రామావధానికే జయము
గల్గెను. క్రమముగా సింగన్న వంచకుఁడని స్థిరపడెను. అతఁడట్లగుట
యేకాక తుదకు రామావధానికిఁ గొంతసొమ్మిచ్చుకొనవలసివచ్చెను.
తనకు రెండుభుజములవలెఁ బనిచేసిన శ్రీనివాసశ్యామసుందరులలో
నొకఁడు తనవలె నిరాధారుఁడై వర్తించుటచేతను, రెండవవాఁడు
లుబ్ధుడై విరోధియై తనతో సంబంధము వదలుకొనుటచేతను సింగన్న
కోరలుతీసిన పామయ్యెను. ఇపుడు దానెట్లయినను రుక్మిణిపైఁ దాను
ప్రకటించిన యపవాదమును దొలఁగింపవలెను. అట్లయినఁ గాని తన
కుఁ గారాగృహవాసము తప్పదు కాని యతనికది సులభమా! సుద
ర్శనునకుఁ దనయందు మిగుల భక్తివిశ్వాసములు గలవు. అయినను
నాంగ్లయువతీలీలాసమాకృష్టచిత్తుఁడై తన్నుఁ దామఱచి వర్తించు
సుదర్శనుఁడు తన్ను మునుపటివలెఁ జూచి యాదరించునో లేదో
యని యతనిసందియము. ఒకవేళ నాదరించినను దనమాటలు వినునో
మానునో? నిజముగా నతఁడువినకపోయిన సింగన్న యధోగతి పాలు
కావలసినదే. వృథా ద్వేష మవలంబించి నిరపరాధయగు రుక్మిణికిఁ
జేయరానిపని చేసినందులకు సింగన్న యప్పుడనేకవిధముల దుఃఖిం
చెను. కాని చేతులుగాలినపిమ్మట నాకులుపట్టుకొనిన నేమిలాభము.
తనకు సంభవించినదురవస్థ కేవలము స్వయంకృతాపరాధమూలక
మయినందులకు వగచుచు సింగన్న చెన్నపురి చేరెను. కాని యామ
హాపురమున సుదర్శనుఁ డెవఁడు? ఏపాటివాఁడు? మహాసముద్రము
లోని నీటిబిందువు. అయినను సింగన్న యూరకుండక శ్రమయని

యోజింపక తిరిగి తిరిగి యతికష్టముచే సుదర్శనుని మందిరమును గనుగొనెను. కాని సుదర్శనుని సందర్శించి మాటాడుట యెట్లు? మహేంద్రకుమారుని వడువున మహావైభవముతో నమూల్యవస్త్రాభరణములతో సుదర్శనుఁడు భార్యాసహితుఁడై మోటారుబండిపై పోవుచుండ బిచ్చగానికంటె నధమాధముఁడై మలినవస్త్రధారియై వర్తించు సింగన్న కతఁడెట్లు లభ్యుఁడగును. పాపము సింగన్న సుదర్శనుని సందర్శింప ననువుగానక పలుశ్రమల నడుచున్నప్పుడే యతని యదృష్టవశమున దొరసాని సుదర్శనుని విడిచిపోవుట సంభవించెను. అయిన నంతమాత్రమున సుదర్శనుని దర్శనము లభించునని యనుకొన వీలులేదు. అతఁడిప్పుడు మహాదుఃఖపీడితుఁడై సంతతమంతర్గృహమున విడిసి బయటికి రానేలేదు. సింగన్న తననిజవృత్తాంత మతని సేవకుల కెరిగించి సుదర్శనుని దర్శనము చేయింపుఁడని బతిమాలెను గాని వారిదిసమయము గాదని తటిమివేయుచుండిరి. ఇఁకఁ దనకార్యము సాధించుకొనుట కవకాశము చాలక సింగన్న వివిధరీతుల విచారింపఁ జొచ్చెను. అయినను దనయత్నమును మానలేదు.

## ౧౨

ఆత్మ, స్వయంప్రకాశము. ప్రకృతి కతీతమైనది. కావుననే నిర్మలినము. అయిన నది యనాదిగావచ్చు కర్మవాసనలకు లోనై తన్మూలమునఁ బ్రకృతిసంబంధముగల దగును. కానఁ రా నది ప్రకృతి లీలావిలాసములకు మోహమంది స్వస్వరూపమును మఱచిపోయి ప్రకృతిరూపమగు దేహమే తాననుకొని తత్పోషణమునకై పలువిధములగు కర్మకలాప మాచరింప దొరకొనును. తాపత్రయమునకును లోనగును.

పలుకష్టములు పడిపడియు మోహవశమున నవి సుఖములుగా భావించి సంతసించును. ఇట్లు కర్మసూత్రబద్ధుఁడై పలువిధములఁ బరితపించు జీవుఁడు తన పూర్వకర్మవిశేషాతిశయమున సద్గురూపదేశము చెంది సద్జ్ఞానము గాంచును. దానివలనఁ బ్రకృతిలీలలకు లోనై మఱచిపోయిన తన స్వరూపమును గ్రహింపఁగలుగును. ప్రకృతితత్త్వమును గూడ గ్రహింపఁగలుగును. అజ్ఞానవశమునఁ బ్రకృతిరూపమే శాశ్వతవస్తువనుకొనినందుల కతఁడప్పుడు విచారించును. ఎట్లయిననేమి స్వస్వరూపజ్ఞానమును బడసి సుఖించును.

ఆవిధముననే సుదర్శనరావు మొదట నిర్మలుఁడైయెనను బూర్వకర్మవశమున దొరసానిలీలలకు మోహమందెను. అతఁడు తన దేశమును, భాషను, తనవారిని, తుదకుఁ దన్నునుగూడ మఱచిపోయెను. దొరసానితప్ప లోకమునఁ బ్రియతమవస్తువు లేదని భావించుకొనెను. దాని నుపచరించుటవలనఁ దాను ధన్యుఁడ నగుదునని సుదర్శనుఁడు నిశ్చయించుకొనెను. అందుకై యతఁడు తన యమూల్యమగు కాలమును, నశేషమగు ధనమును, దుదకుఁ దన సర్వస్వమునుగూడ వ్యయము చేసెను. అంతియకాని భ్రాంతివశమునఁ దా ననిత్యవస్తువును నమ్ముకొని యధోగతిపాలగుచున్నట్లతఁ డెఱుంగఁడు. ఇట్లు ప్రకృతిముగ్ధుడగు నతఁడు పూర్వపుణ్యావిశేషమున సద్గురూపదేశము నొందెను. ఇట సుదర్శనునకు గురువు మోకరుదొర. అతఁడు తన శిష్యుఁడగు సుదర్శనుని బ్రాకృతి విముఖునిఁ గావింపఁ బాటుపడెను. క్రమముగాఁ బ్రకృతిని దనవంక కాకర్షించుకొనెను. శిష్యుఁ డిక స్వస్వరూపమును గుర్తించి మరలిపోవునని దొర యనుకొనెను. గాఢముగా సక్తచిత్తుఁడగుటచే సుదర్శనుఁడు ప్రకృతిని సులభముగా విడువలేకపోయెను. ఇఁక సుదర్శనునకు సదుపదేశమావశ్యకమయ్యెను. అట్లయినఁగాని సుదర్శనుఁడు ప్రకృతిని విడిచి స్వమార్గమును బ్రవే

శింపఁడని యతఁ డెఱుంగును. అందుచే మోశరు కోపముతో సుద ర్శనుని మేడనుండి పడఁద్రోసి తన గురుత్వమును వెల్లడించెను. ఆ సౌధప్రపాత మనెడి సదుపదేశమువలన నతఁడు ప్రకృతిని పిడువక దీక్షినదికాదు. తోడనే యతనికి తాను హిందువనెడి స్వస్వరూపము ప్రత్యక్షమయ్యెను. తన వృత్తమంతయు స్మృతిదర్పణమునఁ బ్రతి ఫలించెను. అందుఁ దన పవిత్రదేశము, పూజనీయులగు తలిదండ్రులు సమాదరణీయులగు బంధుగులు, స్వర్గముకంటెను గరీయమగు తన జన్మభూమియు నతనికిఁ బొడసూపెను. మఱియు నతనికిఁ జిరకాలము నుండి నాగరకతచెంది వచ్చుచున్న హైందవజాతియు, జాతీయతా ధర్మమగు మతము, తదీయ సాంప్రదాయములు, హైందవసంఘ మర్యాదలు, మొదలగునవి యొక్కటియే తలంపునకు వచ్చెను. ఏవిష య మాలోచించినను దను హిందూత్వము సర్వోత్కృష్టమని యతని కప్పుడు బోధపడెను. ఇఁకఁ దన స్వరూపమునుగాంచి ముక్తి కాంతాకరుణా కటాక్షవీక్షములను బొంది సుఖింప సుదర్శనుఁడు నిశ్చయించుకొనెను. అతఁడు వెంటనే దొరసాని యపహరింపఁగా మిగిలిన యాంగ్లజాతీయవస్తువులనెల్ల నమ్మివేసెను. దాసదాసీజన మును మాన్పించెను. అంతవఱకుఁ దానున్న దివ్యమందిరమును వదలివేసెను. అతఁ డొక సామాన్యమందిరమున నివసింపఁజొచ్చెను. దొరసానితోఁగూడఁ జెన్నపురి నిధికిఁ జేర్చిన సొమ్మంతయుఁ బరుల పాలగుటచే నిఁక సుదర్శనుఁడు వస్తువిక్రయణసంపాదిత ధనముతోనే జీవింపవలసివచ్చెను. ఇఁక సుదర్శనుఁడు సులభదర్శనుఁడై తన పేరిని సార్థకము గావించుకొనెను. ఆంగ్ల స్త్రీపిశాచ మతనిని వదలి పోవుటచే నతనికి వస్తుతత్త్వగ్రహణము లభించెను. అయిన నీ యాపదలవలన నతఁడు రోగగ్రస్తుఁ డయ్యెను.

ఒకనాఁడు సుదర్శనుఁడు తన యింటి చావడిలో సుఖాసనమున

నొక్కఁడును గూర్చుండి దీర్ఘస్వప్న వృత్తాంతమువలెఁ గడచిన యాంగ్లయువతీవృత్తము స్మృతికి రాగా స్వయంకృతాపరాధము నకు వగచుచుండు దుఃఖసంపూర్ణమగు తన స్వాంతము నెట్లో శాంతింపఁ జేసికొను సమయమున సింగన్న యచ్చటఁ బ్రత్యక్ష మయ్యెను. ఏకాకిగానున్న సుదర్శనునకు సింగన్న రాక పరమానం దము గల్గించెను. అతఁడు సింగన్న కుచిత మర్యాదలు సలిపి యొక యాసనమునఁ గూర్చుండఁబెట్టెను. తన బంధువగు నతనిఁ జూడఁ గానే సుదర్శనునకుఁ బోయిన ప్రాణము తిరిగి వచ్చిన ట్లయ్యెను. "ఓ సింగన్నమామా ! నిన్నుఁ జూచుటవలన నీదినము సుదినము. సంతోషము. ఎప్పుడు వచ్చితి"వని ప్రశ్నించెను.

సిం—సుదర్శనా! నేను చాలకాలము క్రిందటనే వచ్చితిని.

సు—నాకుఁ గనపడలేదేమీ ! నేనిచ్చట నున్నట్లెఱుఁగవా ?

సిం—ఎఱుఁగకేమి ? నిన్ను జూచుటకే వచ్చితిని. కాని నీ దర్శనము నవాబుదర్శనముకంటె దుర్లభ మయ్యెను. ఏమి చేయు దును ?

సు—(విచారముతో) అవును. నా జీవితకాలమున నా కవి దుర్దినములు. ఇఁక నా ప్రసంగము తేకుము. మన బంధువుల సమా చారములు చెప్పితివా విని సంతసించెదను. మీ యగ్రహారములో నందఱకును కుశలమా?

సి—కుశలమే.

సు—మీయింట నొక యవ్వ యుండి నన్ను సంతతము పరి హాస మాడుచుండెడిది. ఆమె క్షేమముగా నున్నదా?

సిం—లేదు. నాల్గు నెలలక్రిందటఁ గాలధర్మ మందినది.

సు—చూఁడు—ఎగువవీధిలో మీ యింటికి నాలుగయిదిండ్ల పిమ్మట నొక యింటిలోఁ గాపుర మున్నాఁడు. అతని పేరెవ్వరు ?

సిం—ఎవరినిగూర్చి యడుగుచున్నావు?

సు—చూడు. ఎఱ్ఱగా, సన్నముగా, పొడుగుగా నుండును. అతని కణతలకుఁ గాల్పులుగూడ నున్నవి. పిల్లిగ్రుడ్లు.

సిం—ఓహో! అతఁడా! జాంబన్నగారి వెంకన్న.

సు—అతఁడు కుటిలస్వభావుఁడు సుమా! అగ్రహారము వెళ్ళి నప్పు డెల్ల నతఁడు నన్ను నదీతీరమునకుఁ గొనిపోయి గ్రామములో స్త్రీపురుషుల రహస్యము లన్నిటిని వెల్లడించువాఁడు. అది వినుట నా కెంతో కష్టముగా నుండెను.

సిం—అవును. అతఁడు కటపుపత్రము నొకదాని కల్పించి మీ మామపై సొమ్మునకు దావా తెచ్చెను. గడుసువాఁడగు మీ మామ వెంకన్న పన్నిన కుట్ర నెల్లఁ గచ్చేరీలో వెల్లడింపఁజేసి యత నికిఁ గారానివాసము గల్గించినాఁడు.

సు—శ్రీనివాసరావు చిన్నల్లుని పే రెవ్వరు?

సి—విశ్వంభరరావు.

సు—అతఁడు క్షేమముతో నున్నాఁడా?

సి—అవును. అతఁడు తండ్రితో వివాద పడి సంపదలు పంచుకొని భార్యతోఁ గలిసి యిప్పుడు విశాఖపట్టణ మందే యున్నాఁడు.

సు—అతనికి భార్యయం దిష్టము లేదని విన్నాను.

సిం—అది తప్పు. అతనికి భార్యయం దమితప్రేమము. అతని తల్లిదండ్రుల కా కోడలియం దమితద్వేషము. ఆ కారణము ననే తండ్రికొడుకులు వేఱున్నారు.

సు—దానికేమి; కాని రామావధానిగారి స్థితి యెట్లు న్నది.

సి—మామా! అతనికేమి? మహోన్నత పదవిలో

నున్నాఁడు.

సు—అతనికి నాయం దమిత వాత్సల్యము సుమా!

సిం—నీయం దనసూయ పతికంటె నెక్కుడు వత్సలత్వము గలది.

సు—సత్యమే! నిజముగా నాదంపతు లిరువురు నట్టివారే. ఆ కుటుంబములోనివా రందఱును మంచివారే. ఆయన కుమారికలు నట్టివారే.

సిం—అందఱు నట్టివారే! అందులో రుక్మిణి మంచివిద్వాంసురాలు.

సు—అవును. నేను ప్రవేశ పరీక్షయం దుత్తీర్ణుఁడ నగుట కదియే హేతుభూతురాలు. కాని లాభమేమి? శీలము చెడిపోయినది. శీలము చెడిన హైందవస్త్రీలు తృణముకంటెను లాఘవము నందుదురు. పద్మకోశమును మధుకరమట్లు దాని నిర్మలహృదయ పుండరీకమునం దా దుర్గుణ మిమిడియున్నది.

సిం—ఆలోచింప దాని కాగుణ మున్నట్లు నాకుఁ దోపదు.

సు—ఉండకపోయిన నా కుత్తర మేల వచ్చును?

సిం—అవధానిమీఁది కోపముచే వెంకన్నయే వ్రాసినాఁడు. వలదు వలదని యెంత వారించినను విన్నాఁడుకాఁడు.

సు—నీవుగూడ వ్రాసినట్లున్నదే?

సిం—లోక మట్లనుకొనుచున్నదని వ్రాసితిని. సామాన్యముగా లోకము గ్రుడ్డిది. అది వారు వీరు ననుకొనెడి మాటలను నమ్మి చెప్పుచుండును. అది తత్త్వమును గ్రహించి పలుకదు.

సు—ఆయపవాదము కల్పితమందువా?

సిం—(అగ్రహారవివాదములన్నియు నతనితోఁ జెప్పి) రామావధానిని బాధించుటకై యగ్రహారవాసు లతని కనేకవిధముల ద్రోహము

చేయు సమకట్టినారు. అందులో నిదియొకటి. రామావధాని తక్కిన ద్రోహములకెల్లను బ్రతీకార మొనర్పఁగల్గెను. కాని దీని నిమిత్త మతఁ డధికపరితాపము చెందుచున్నాఁడు. అంతకంటెను నధికసంతాప మందుచున్నది యనసూయ. రుక్మిణి యవస్థ చెప్పఁదరముకాదు. పాపమది సంతతదుఃఖముచేఁ జిక్కి సగమయినది. అప్సరస్త్రీవలె నుండెడి రుక్మిణి యిప్పుడు రూపొందిన దైన్యమువలెనుండి పోల్పవీలులేని దురవస్థ నొందినది.

సు—మా తండ్రిగారెట్లున్నారు ?

సిం—వారు సుఖముగానేయున్నారు. ఆయనకు రుక్మిణియం దపారవాత్సల్యము. అపవాదము కల్పితమని తెలిసినపిమ్మట మీ తండ్రిగారగ్రహారమువచ్చి యవధానిని, రుక్మిణిని నోదార్చి నాల్గు దినములుండి వెడలిపోయినారు.

సు—మా గోవిందరా వెటనున్నాఁడు ?

సిం—రాజమహేంద్రవరముననే.

సుదర్శను డాయాసముచేఁ గుర్చీకిఁ జేరఁబడి యిఁక మాటాడక నిట్టూర్పు పుచ్చెను.

సిం—ఏమి మామా ! అట్లున్నావు ?

సు—నాకు జ్వరము వచ్చుచున్నది. నీతో సంభాషించుట వలన నాయాసము హెచ్చినది. లెమ్ము. భోజనమునకు వేళయైనది. మా వంటలక్క వండినది నీవు తినవేమో. వండుకొని తినిరమ్ము. నే నొక్కమాఱు నిద్రించెదను.

సింగన్న లోపలి కరిగెను. సుదర్శనుఁడు నిద్రించెను. కొంతసేపటికి సింగన్న మరలివచ్చి చూచెను. సుదర్శనుఁడు నిద్రించియేయుండెను. ఒంటిమీదఁ జేయి వేసిచూచెను. జ్వరతాపముచే నతనిశరీర మగ్నిహోత్రసదృశముగానుండెను. సాయంసమయమునకు సుదర్శనునకుఁ

గొంచెము మెలకువవచ్చెను. కాని సింగన్నతో సరిగా మాటాడలేక పోయెను. పరాకుమాటలు హెచ్చ నారంభించెను. ప్రపంచజ్ఞానము క్రమక్రమముగా నతనికిఁ బోవుచుండెను. రాత్రి రెండుయామము లగునప్పటికి సుదర్శనుఁడు ప్రభంజనసముద్ధూతసముత్తుంగతరంగ భీకరంబగు సముద్రమధ్యముననున్న పడవ ననుకరింపజొచ్చెను. సింగన్న యతని యవస్థచూచి మిక్కిలి భయపడెను. అతనికిఁ దన వెనుకటిచరిత్రమే స్మృతికివచ్చెను. ఈ సుదర్శనుఁడిట్లు పాడగుటకుఁ దాను గారణమయినందుల కతఁడు తన్ను నిందించుకొనఁజొచ్చెను. అవధానిపై కసితీర్చుకొనుటకుఁ బూనికొని తాను సుదర్శనుని పాడు చేసితినిగదా యని యతఁడు వగవనారంభించెను. రుక్మిణియం దప వాద మారోపింపకుండిన సుదర్శనుఁ డాంగ్లయువతిని జేపట్టుటయు, సంపదలు పాడుచేసికొనుటయు నిట్లు పరాభవదుఃఖ మొందుటయు, సంభవింపకపోవునని యతఁడు గ్రహించెను. కాని యతఁ డిప్పుడేమి చేయఁగలఁడు ? ఇప్పుడతనిచే నగునదేదియును లేదు. నిష్కారణముగా నుత్తమదంపతుల నెడబాపిన పాపఫలము తన్నుఁ గట్టికుడుపకపోదని యతని భయము. ఆ సుదర్శనుఁ డెట్లయినను బ్రదికి బట్టగట్టి మరల రుక్మిణిని చేపట్టగల్గినచోఁ సింగన్న హృదయముననఁగల భయసంతాపములు కొంతవఱ కుపశమించును. కాని సుదర్శనుని గతియేమగునో యెవ్వరెఱుఁగుదురు ?

సింగన్న సుదర్శనుని యారోగ్యవిషయమై వేలకొలఁది దేవతలకు మ్రొక్కుచు, సుదర్శనుని గనిపెట్టుకొని కంట నిదురలేక సహస్ర వృశ్చికము లొక్కపెట్టునఁ గుట్టినబాధ ననుభవించుచుండెను. తెల్ల వాఱెను. కాని సుదర్శనుఁడు మంచిస్థితిలో లేఁడు. వైద్యుఁ డెప్పటి వలె వచ్చిచూచి రోగము ప్రమాదకరముగానున్నదనియు, నిన్నను క్షయోన్ముఖమగురోగ మింత యాకస్మికముగాఁ బ్రబలిపోవుటకుఁ

గారణ మగపడదనియు, నేదో మందిచ్చి తాను దిరిగివచ్చువఱకును నతని కా మందిచ్చుచుండుడనియు, నక్కడివారితోఁ జెప్పి వెడలి పోయెను.

ఇదియంతయుఁ జూచి సింగన్న దుఃఖితుఁడై, రామారావుగారి యింటికరిగి సుదర్శనుని దురవస్థను జెప్పెను. అది వినగానే రామారావునకు గుండెలో రాయిపడినట్లయ్యెను. కమల విచారముచే రాపడెను. రుక్మిణి యీ ఘోరవార్తను విని మూర్ఛిల్లి నేలఁబడిపోయెను. అదిచూచి కమలారామారావులు త్వరపడి రుక్మిణికి శైత్యోపచారము లొనర్చి తేఱినవెంటనే యామెను మోటారుబండిలోఁ గూర్చుండఁబెట్టి యామెతోఁ గూడ సుదర్శనుని మందిరమున కరిగిరి.

రుక్మిణి సుదర్శనుని దుర్దశ కమితముగా దుఃఖించుచుండ రామారావు సుదర్శనుని రోగము నిదానించి చూచి యతనికిఁ బ్రాణభయము లేదని చెప్పి కమలా రుక్మిణుల నోదార్చి యతఁడు శీఘ్రముగా వైద్యశాల కరిగి కొన్ని యౌషధములను గొనివచ్చి సుదర్శనున కిచ్చి రెండేసిగంటల కొకమా రా మందిచ్చుచుండుఁడని చెప్పి రుక్మిణికిఁ దన భార్యను దోడుగా నుంచి మరల వెంటనే వచ్చెదనని పలికి వెడలి పోయెను.

కమలా రుక్మిణులును, సింగన్నయు నతని చెంతనే కూర్చుండి జ్వరతీవ్రతచే సుదర్శనుఁడు పలుకు పరాకుమాటల కులుకొందుచు, నియమప్రకార మౌషధ మొసంగుచు, దైవముపై భారమువైచి యటఁ గూర్చుండిరి. సాయంసమయమునకు మరల రామారావు వచ్చి సుదర్శనుని చేతినాడిని బరిశీలించి యిఁక నతనికి భయములేదని చెప్పి యచ్చటివారికిఁ గొంచెము ధైర్యము నెలకొల్పెను. కమలా రామారావులును, సింగన్నయు నేదో విధమున భుజించిరి. కాని

దుఃఖాతిరేకమున రుక్మిణి మాత్రము భుజింపలేదు. అది చూచి కమలా రామారావు లనేకవిధముల బోధించి రుక్మిణిచే నన్నము తినిపించిరి. ఏమయినను నిరంతరదుఃఖపీడిత యగు రుక్మిణి రోగవర్జితయైనను దురవస్థకు భర్తను బోలుచుండెను. ఇట్లు నాల్గుదినములు గడచినవి సుదర్శనుని స్థితి యింకను మాఱలేదు. సుదర్శనునకుఁ బ్రాణభయము లేదని తెలిసియున్నను, నెందులకైనను మంచిదని సుదర్శనుని బంధుగులకు, రుక్మిణి బంధుగులకును, నతని స్థితిని దెల్పుచు రామారావు తంతివార్తల నిచ్చెను. ఇచ్చిన మూఁడవనాటికి బంధుగు లందఱును వచ్చిరి. అనసూయా రామావధానులు రుక్మిణి నోదార్చి యల్లుని కారోగ్యము గల్గ దేవతలకు మ్రొక్కుకొనుచుండిరి. శివరామారావును గోవిందరావును గూడ వచ్చి సుదర్శనుని స్థితికి వగచుచుండిరి. రామారావు రేయుంబవ ళ్ళచ్చటనే యుండి యెప్పటికప్పుడే రోగనిదానమును గమనించి మందు మార్చి యిచ్చుచుండెను.

ఇట్లుండఁ గొన్నిదినములకు రుక్మిణి పూర్వపుణ్యవిశేషమున సుదర్శనరావు రోగము క్షయోన్ముఖ మయ్యెను. ఆ గడువుదినము లరుగగానే రోగము మరలెను. అందఱ ప్రాణములును గూటఁ బడినవి.

ఒకనాఁడు సుదర్శనుఁడు కన్నులు విప్పి చూచెను. తన పాదములను దొడలపై నిడుకొని యొత్తుచు, వేఁడిబాష్పములచేఁ దన యడుగులు తడుపుచు రూపొందిన శోకదేవత యనున ట్లున్న రుక్మిణి కంటఁ బడెను. అతఁ డామె నానవాలు పట్టలేక పక్కకుఁ జూడగా భూమి కవతరించిన ధన్వంతరివలె నున్న రామారావు చూపట్టెను. అతఁడు మెలకువతో నున్నట్టు తెలిసికొని యా సమయముననే బంధుగు లొక్కరొక్కరే లోనికి రాఁ జొచ్చిరి. వారిని జూడగనే సుద

ర్శనుఁడు గతుక్కుమనెను. ఇట్టి విచిత్రప్రదర్శనము జన్మధ్యమున లభించునని యతఁ డనుకొనలేదు. తన యీ ప్తవర్గము నిట్లు తెప్పించిన యీ రోగము తన కుపకారమే చేసినదని సంతసించుచు ముందుగా రామారావును గాంచి "మిత్రమా! నా యవివేకమున నీకు గొప్ప యపకార మొనర్చితిని. క్షమింపు" మని పల్కెను. అది విని రామారావతనితో "ఇందు నీవు చేసిన దేమియును లేదు. దీని కంతకును గాలము కారణము. తక్కినవారిమాట కేమి? ముందుగా సత్ప్రవర్తన యగు నీ భార్య నోదార్పు" మని పలికెను. సుదర్శనుఁ డెండిపోయిన చెక్కిళులనుండి కన్నీరు కాలువలు గట్ట పాదము లొత్తుచున్న భార్య చేయి పట్టికొని "ప్రేయసీ! నాకు నీవు నిజమగు హితురాలవు. విద్వాంసురాలవు. పతివ్రతవు. అవివేకమున నీకుఁ దీఱని దుఃఖమును గల్గించితిని. మన్నింపుము. నీ భర్తను దొంటివలెఁ బొడగాంచుము. నిజ మాలోచింప హైందవదాంపత్యమే దాంపత్యము. తక్కినవి సామాన్యము" లని భార్య నూరడించెను. ఆమె యధోముఖయై నులివెచ్చబాష్పధారలను గురియించుట తప్ప ప్రత్యుత్తర మీయలేదు. అట్లే సుదర్శనుఁడు తన యపరాధమును మన్నింపుఁడని తండ్రి మొదలగువారి నందఱను బ్రార్థించెను. సుదర్శనుఁడు దుస్సహరోగముఖగహ్వరమునుండి విడివడుటయే కాక తన తప్పును దెలిసికొని సత్పథగామి యైనందుల కందఱును సంతసించిరి. తన హృదయాయఃపిండము పశ్చాత్తాపాగ్నితప్తతచే మృదువై యచ్చటివారు నానావిధములఁ బల్కు కారువచనములనుసుత్తిదెబ్బలచేఁ గొట్టఁబడుటవలన సింగన్న మొగమెత్తి యెవ్వరితోను మాటాడఁజాలక యొకమూలఁ బడియుండెను.

కొన్ని దినములకు సుదర్శనుఁడు స్వస్థత గాంచెను. అతఁడు భార్యను స్వీకరించెను. రామారావుతోఁ దొంటిమైత్రి వహించెను. తక్కిన

పెద్దల నెల్ల నెక్కుడుగా నాదరించెను. అనంతర మతఁడు కొన్ని దినము లచ్చటనుండి తండ్రి యనుమతిచొప్పునఁ దన బలగముతో రాజమహేంద్రవరమునకుఁ గాఁపుర మేగెను. సింగన్న వారిని వెంబడించి తన తప్పును క్షమింపుఁడని యందఱను బ్రార్థించి యనుమతి వడసి యగ్రహారమున కరిగెను. శ్రీనివాసరావు తన యల్లుని ప్రయత్నమునఁ దన న్యాయవాదిపట్టమును మరల స్వీకరించి, విశాఖపురమున నుండ సిగ్గుపడి కాకినాడపురమున నివసించెను.

సంపూర్ణము

ప్రకాశకులు:—అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయఁడుగారు

# సరస్వతీ గ్రంథమండలి

## రాజమహేంద్రవరము



నవలలు - నవరసభరితములగు - నవలలు

ముచ్చటైన బొమ్మలతో ముద్దులొలుకు క్యాలికో బైండుతో

రెండు మాసముల కొక్కటిగా వెలువడుచుండును.

### నిబంధనలు

1. ఇందుఁ జందాదారులుగఁ జేరువారు ప్రవేశరుసుము క్రింద ముందుగా రు 0-4-0 లు చెల్లింపవలయును.

2. ఇందు రెండు మాసముల కొక్కటిగ వెలువడుచుండు క్యాలికోబైండుగల ప్రతి గ్రంథమును 1-0-0 వెలకుఁ జందాదారులకుఁ బంపుచుందుము.

3. గ్రంథములఁ బంపుట కగు పోసేజీ మొదలగు కర్చు లన్నియును జందాదారులే భరింపవలయును.

4. చందాదారు లగువారు వెనుకటి గ్రంథముల నన్నిటిని గొనవలయు నను నియమము లేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములు కూడఁ జందాదారుల వెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

5. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

6. ముందు ప్రకటింపఁబడు ఆయాపుస్తకములకు రు 7-2-0 లు ముందుగఁ బంపువారికి ఆయాపుస్తకములను అన్‌రిజిష్టర్డు పార్శిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆయాపుస్తకములకు చెల్లింపవలసిన మనియార్డరు కమీషను 0-12-0 లును రిజిష్టర్డు ఖర్చు 0-12-0 లును 1-8-0 కూడివచ్చును.

ఇం దీవరకు ప్రకటింపఁబడిన గ్రంథములు :—చిత్రపటశోభితములు

---

**ప్రేమసుందరి**
కర్త :
చిర్రావూరి కామేశ్వరావు
బి.ఎ., ఎల్.టి.

నవరసభరితమగు సాంఘికనవల. క్యాలికోబైండు 272 పుటలు వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**చోరశిఖామణి**
అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

లోమహర్షమగు డిటెక్టివునవల. క్యాలికోబైండు 197 పుటలు వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**లక్ష్మీప్రసాదము**
కర్త :
కేతవరపు వేంకటశాస్త్రి

నవరసభరితమగు సాంఘికనవల. ఇందు మూఢురాంధ్రగు స్త్రీలవలన కుటుంబములందు సంభవించు కలహములును అందువలన కలుగు కష్టపరంపరలు చక్కఁగా వర్ణింపఁబడినవి. 346 పుటలు వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు 1-8-0.

**హత్యారహస్యము**
అనువాదకులు :
సాహితీసమితి సభ్యుడు

జటిలమగు ఇతివృత్తముగల డిటెక్టివు నవల. తుదవరకు దోషులెవరో కనుగొనుటకు వీలు లేకుండునటులదుండగులుపన్నిన పన్నాగము లత్యంత భయంకరములు వెల చందాదారులకు1-0-0 ఇతరులకు రు1-8-0.

**ఫాస్టు** (ప్రథమభాగము)
అనువాదకులు :
వెదురుమూడి శేషగిరిరావు

అధికార దుర్వినియోగము-అభేద్యములైన కోటయందు దురాచారుల దురంతములు మహాప్రళయము రహస్యమువలన కలిగిన తీవ్రమనోవేదనము, మున్నగు చిత్రవిచిత్రకల్పన, పాఠక మహాశయుల జిత్తరువుల గావించుచుండును. చందాదారులకు 1-0-0 ఇతరులకు 1-8-0.

**ఫాస్టు** (ద్వితీయభాగము)
అనువాదకులు :
వెదురుమూడి శేషగిరిరావు

ఈశ్వర కృపాతిశయము, భక్తసంరక్షణము, భాగవతవిజయము, విమలప్రేమాభిరాములగు సాధు యువతీ యువజనులకల్యాణము మున్నగు నత్యద్భుతఘట్టములుచందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు1-8-0.

**కుముద్వతి**
రచయిత :
శ్రీమతి
పులవర్తి కమలావతీదేవి

ఇందలిదుష్టకేతుని దౌష్ట్యము భయావహము. మాయామారీచుని మాయలు భయంకర కృత్యములు చదివి యానందింపుడు. ఇయ్యది నవలకాదు. నవరసరత్నాకరము. వీరశృంగార కరుణారసంబుల యేకీభావము త్రివేణీసంగమమును బోలి చదువరుల హృదయముల రసరంజితములుగ జేయును. వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు 1-8-0.

**చిన్నకోడలు**
అనువాదకులు :
ప్రాపవరపు నరసింహము

శ్రీయుత కాశీనాథ రఘునాథమిత్ర గారిచే మహారాష్ట్రభాషయందు వ్రాయబడిన ధాకట్యాసూన్ భాయి నుండి తెనిగింపబడినది. కథాచమత్కృతి నవీనము. చిన్నకోడలు "లక్ష్మి" యొక్క శాంతౌదార్యాది సుగుణములును, పతిభక్తియు, మిక్కిలి పేదస్థితియందున్న సంసారమును తన చాతుర్యముచే లక్ష్మీసంపన్నముగాఁ జేయుట మొదలగు సంగతులు చదువవలసినవి. చందాదారులకు 1-0-0 ఇతరులకు 1-8-0

## రహస్యభేదనము
కర్త:
కేతవరపు వేంకటశాస్త్రి

రహస్యాపరాధ పరిశోధకనవల. కథాకల్పన మత్యద్భుతము. సంఘటనము లతి భయంకరములు. నిగూఢహత్యలెన్నియో వర్ణింపఁబడినవి. ఇది స్వతంత్రగ్రంథము. ఇతివృత్తమాంధ్రదేశమునకు సంబంధించినది. ఇట్టి గ్రంథ మిదివర కాంధ్రదేశములో వెలువడలేదు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## సింహగడము
అనువాదకులు:
శ్రీ వాసుదేవరావు

మహారాష్ట్ర భాషలో శ్రీహరినారాయణ ఆపటేగారు విరచించిన గ్రంథమున కనువాదము. రమణీయముగు యీ కథ గాంభీర్యమై యుండును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మణిహారము
కర్త:
బులుసు
వేంకటసుబ్బారావు
బి.ఎ., బి.ఎల్.,

ప్రభాకరునివంటి ప్రకాశించు ప్రభాకరుడు, హృదయరంజనియగు రంజని, చంద్రునిబోలు విజయచంద్రుడు, వికసితహృదయపద్మినియగు పద్మిని సార్వభౌమ లక్షణలక్షితుం డగు అలకసుందరుడును చదువరి హృదయమును వివిధరసభావ తరంగముల దేలించును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మొగలాయీ దర్బారు
ప్రథమభాగము
అనువాదకులు:
మొసలికంటి
సంజీవరావు పంతులు

కీ. శే. ధీరేంద్రనాథపాల్‌గారి సుప్రసిద్ధగ్రంథరాజమున కనువాదము. ఇయ్యది నవరసభరితమై చరిత్రాత్మకమై, చిత్రవిచిత్రోపకథలతో విరాజిల్లుచు పాఠకమహాశయుల కెంతయు నానందదాయకముగ నుండును. అద్భుతసంఘటనములతో నిండి సులభశైలిని వ్రాయబడిన యీ గ్రంథ మెల్లరు చదువతగియున్నది. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మొగలాయీ దర్బారు

రెండవభాగము

అనువాదకులు: మొసలికంటి సంజీవరావుపంతులు

ప్రథమ సంపుటమందలి నిగూఢములైన దారుణ శవప్రదర్శనములు, పిశాచ కృత్యములు ఇందు భేదింపబడి చదువరుల నానందనిమగ్నులనొనర్చును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఘటనాచక్రము

అనువాదకులు: గారపాటి ఆంజనేయ చౌదరి

పాంచకడీదేవ విరచితమగు భీషణ పరిశోధకనువాదము. ఆశ్చర్యములకుఁ బుట్టినిల్లు, కౌతుకమునకు భాండారము, విచిత్రములకుఁ గనియై, పాఠకులను విస్మయసాగరమున ముంచివేయును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## రాజసుందరి

కర్త: కేతవరపు వేంకటశాస్త్రి

ఆంధ్రదేశాత్మకమగు స్వతంత్ర కల్పనసాంఘికనవల. కథావిధానమత్యద్భుతము నిరుపమానము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## కుంకుమభరణి

అనువాదకులు: శ్రీ శివశంకరశాస్త్రి

ఇది సాంఘికనవల. మామూలునవలవలె గాక యిందు క్రొత్తచమత్కారములున్నవి. చదువుటకు మిక్కిలిమనోహరము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## జాగిలము

రచయిత్రి: శ్రీమతి సీరము సుభద్రయాంబ

అతి భయంకర నిరూపక నవలారాజము. హంతకుడు భయంకరమగు జాగిలము సహాయమున చేయు హత్యలు హృదయవిదారకములు. అపరాధపరిశోధకులు యూహిమమ సమస్యను భేదించుటతి విచిత్రము. హత్యలపై హత్యలు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## సరస్వతి

అనువాదకులు: శ్రీవాసుదేవరావు, శ్రీకృష్ణరఘునాథరావు

మహారాష్ట్రభాషనుండి యాంధ్రీకరింపబడిన సాంఘికనవల. మనోహరకథావిధానము. శైలినాతికఠినము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఆనందాభాయి

కర్త:
కేతవరపు వేంకటశాస్త్రి

ఇయ్యది యూహాజనితమే యైనను చరిత్రసమ్మిళితము. పండితకవులచే మనోహరముగా వ్రాయబడినది. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## హత్యాన్వేషణము

అనువాదకులు:
గుర్రాల నారాయణరావు

అద్భుతమగు పరిశోధక నవలారాజము. ఆంగ్లేయగ్రంథమునుండి మనోహరముగా భాషాంతరీకరింపబడినది. తుదివఱకు చదివినగాని అపరాధిని తెలుసుకొనలేరు. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0.

## మొగలాయీ దర్బారు

తృతీయసంపుటము

అనువాదకులు: మొసలికంటి సంజీవరావుపంతులు

మొదటి రెండు సంపుటములవలె నిదియును చరిత్రాత్మకమై, నవరసభరితమై చిత్రవిచిత్రోపకథల కాలవాలమై మనోహరమై, యూనందదాయకమై పాఠకుల కెంతయు విజ్ఞానప్రదమై యొప్పును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0.

## గంగ

కర్త:
చిర్రావూరి కామేశ్వరరావు బి. ఎ., ఎల్. టి.,

గంగాచరిత్రము కరుణరసప్రపూర్ణము, ప్రేమ భావాత్మకము. శైలి కోమలమై, సుధామధురమై, తేటతేట వెల్లువవలె, ముద్దులొలుకుచుండును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మొగలాయీ దర్బారు

చతుర్థసంపుటము

అనువాదకులు: మొసలికంటి సంజీవరావుపంతులు

కథోపకథావల్లరులతో నల్లిబిల్లిగ నల్లుకొనియున్న యీ నవలారాజము సర్వజనహృదయాకర్షణీయము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## కోహినూరు

కర్త:
చిల్లరిగె శ్రీనివాసరావు

ఈ కోహినూరు అమూల్యమైన వజ్రముగాదు. అతిమనోహరమైన చారిత్రిక నవల. శైలిమృదుమధురము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**ఆటీమ నేలా**

అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం, ఎ.,

అత్యద్భుతమయిన డిటెక్టివునవల. ఇందలి మనేలా మరమ్ములు, మానవహంతకి మాయలు అనిర్వాచ్యములయి పాఠకులను విస్మయవిపరీత చేతస్కులనుగావించును. వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు 1-8-0.

**అపరిచిత**

కర్త :
మాలే రాఘవరావు

మనోహరమైన సహజ సాంసారిక, సాంఘిక సంఘటనలతో వెల్లివిరియు అపూర్వ పరిశోధక నవలారాజము. ఇందలి ఇతివృత్తము సర్వజన హృదయానందప్రదము. క్రొత్తపోకడలతో గూడిన దీని శైలి మృదు మధురము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**అంతఃపురము**

ప్రథమ భాగము

అనువాదకులు :
మొసలికంటి సంజీవరావు పంతులు

సుప్రసిద్ధరైనాల్డ్సు గ్రంథ రాజమున కనువాదము. తురుష్క చరిత్రాధారమగు నియ్యది సర్వజనహృదయాకర్షణీయమైనది. నవరసభరితము-అందును శృంగార రసప్రధానము - అద్భుతసంఘటననిధానము. ఎల్లరు చదువదగినది. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**అంతఃపురము**

ద్వితీయభాగము

అనువాదకులు :
మొసలికంటి
సంజీవరావు పంతులు

అత్యద్భుత ఘటనా సంయుతమును విచిత్రకథా విలసితమును నగు గ్రంథరాజము. ప్రథమభాగమునం దభివర్ణింపబడిన నిగూఢ హత్యారహస్యము లిందు వెల్లడింపబడినవి. శైలిమృదుమధురము. వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు 1-8-0.

## అనుబంధగ్రంథములు

**మృత్యుతరంగిణి**

అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

గొప్ప డిటెక్టివునవల. ఒకానొక సుందరియొక్క భయంకరకథ. నరహత్య-నారీహత్య-హత్యపైహత్యలు. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 0-12-0.

**అభాగిని**

అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

బాల వితంతువులు పడు కష్టములు. దుండగులుపన్ను కుట్రలు-సహజరీతినివర్ణింపఁబడిన నవరసభరితమగు సాంఘికనవల. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 0-12-0.

**ఛద్మ వేషి**

అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

ఇది చక్కని పరిశోధకనవల. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 0-12-0.

**విదురుని యుపదేశములు**

కర్త :
కేతవరపు వేంకటశాస్త్రి

చిత్తస్వాతంత్ర్యము-సత్యవాక్యపరిపాలనము-నీతి బలము-ధర్మోపదేశము జదువదగినవి. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

**కాంచనమాల**

అనువాదకులు :
శ్రీశివశంకరశాస్త్రి

అశోకుని కాలమునాటి బౌద్ధమతధర్మ ప్రచారముల దెలుపునవల. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

**సీమంతిని**

కర్త : మాలుకుట్ల వేంకటశాస్త్రి

పౌరాణికగాధ. నీతిదాయకము. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 1-0-0.

**సుశీల**

అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి
బి. ఎ. ఆనర్సు

పతివ్రతయగు నీమె చరిత్రము హృదయవిదారకమయ్యును ప్రగాఢ ప్రణయాదర్శము జూపి యనేకుల పవిత్రుల జేయకమానదు. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

**శశిరేఖ**

కర్త :
గుడిపాటి వెంకటాచలం
బి. ఎ. ఎల్. టి,

ప్రేమమూర్తియగు శశిరేఖ ప్రియుని తరువాత ప్రియుని స్వీకరించుట యెట్లవసరమయ్యెనో అయినను ఆమె నిర్మలచారిత్రి యెట్లయ్యెనో వ్రాయబడినది. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

**యమునాబాయి**

అనువాదకులు :
క్రాపవరపు నరసింహము

తమతమ పరిస్థితులను పరిశీలింపని ప్రేమాంధులగు యువతీయువకుల కీగ్రంథమత్యంత బోధప్రదము. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 0-12-0.

**శ్యామల**

అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం.ఏ., బి.ఎల్.

శిథిలప్రణయుల దుఃఖగాథ. సాంఘిక దురాచారమును ఖండించు ప్రేమైక నవల చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 1-0-0.

**కాలసర్పి**

అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం.ఏ., బి.ఎల్.

అత్యద్భుత రహస్యాపరాధ పరిశోధక నవలారాజము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

**కాంతంకథలు**

కర్త :
మునిమాణిక్యం నరసింహారావు బి.ఏ., ఎల్.టి.,

శ్రవణానందదాయకములై హాస్యరసపూరితములై యొప్పు వివిధకథల సంపుటము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు 1-0-0.

**భారత కథాసారము**

(గ్రంథకర్త్రి)
శ్రీమతి దేవిరాజు లక్ష్మీనరసమ్మ

మృదుమధుర శైలిలో వ్రాయఁబడిన శ్రీమదాంధ్ర మహాభారతకథాసారము. వెల చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 1-0-0.

—: నా ట కా ను బం ధ ము లు :—

**మార్కండేయ**

కర్త :
పింగళి వెంకటనరసయ్య

3 గంటల కాలములో ప్రదర్శించుటకనువుగ వ్రాయబడిన భక్తిపూరితమగు 6 అంకముల నాటకము. చక్కనిపాటలు గలవు. వెల చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 0-12-0.

**అహల్యాశాప విమోచనము**

కర్త :
పప్పు మల్లిఖార్జునరావు

భక్తిరసపూరితమగు చక్కని నాటకము. వెల చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 0-12-0.

**మేవారుపతనము** — వీరరసప్రధానమగు నైదంకముల నాటకము. ఇతిహాసికవచననాటకమున కన్ను వాగము. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 1-0-0.

అనువాదకులు: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం.ఏ., బి.ఎల్

**షాజహాను** — విషాదాంతమైన మొగలాయీ చారిత్రక వచన నాటకము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

అనువాదకులు: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం.ఏ., బి.ఎల్

**వరమాల** — హిందీనుండి యాంధ్రీకరింపబడిన మనోహరమగు నాటకము. ఇందు ప్రేమపరీక్ష, తత్పరిణామము హృదయంగమముగను చమత్కారప్రదముగను నిరూపింపబడినవి. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

అనువాదకులు: మాడభూషి సురేంద్రాచార్యులు

**నూర్జహాను** — కరుణరసపూరితము, విషాదాంతమునగు చరిత్రాత్మక నాటకరాజము. మనోహరగీతములు కలవు. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు 1-0-0.

అనువాదకులు: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం.ఏ., బి.ఎల్

**దుర్గాదాసు** — వీరరసపూరితమును, ద్విజేంద్రుని విరచితములలో మిగుల పవిత్రమును నగు నైదంకముల చక్కని నాటకము. ముఖ్యముగ చదువతగినది. వెల చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 1-0-0.

అనువాదకులు: జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం.ఏ., బి.ఎల్

ఇట్టివే చక్కని నవలలు పలువురు కవులచే రచింపఁబడుచు రెండు మాసముల కొకటిగా ప్రకటింపఁబడును.

సరస్వతీ గ్రంథమండలి,
రాజమహేంద్రవరము.